సమర్థత వున్నవాడిని మేనేజరుగా యేర్పాటు చెయ్యాలి. ఆ లక్షణాలన్నీ అస్ట్రోవునోవులో వున్నాయి."

నగుల్నోవ్‌కి విపరీతమయిన కోపం కలిగింది.

"మీకు, ఆండ్రీకి, అస్ట్రోవ్‌నోవు మీద యింతగారి యెందుకు యేర్పడిందో నాకు అర్థం కాకుండావుంది. నేను యెన్నడూకూడా అస్ట్రోవునోవుని మేనేజరుగా చెయ్యడానికి అంగీకరించను. అతన్ని సమిష్టివ్యవసాయక్షేత్రం లోనుంచి తరిమేస్తాను. రెండు సంవత్సరాలనుంచి అదనపు పన్నుకూడా కడుతున్నాడు. దోహీ! వాడికి రోజులింకా దగ్గరకు రాలేదు; యుద్ధానికి పూర్వంనుంచీకూడ భాగ్యవంతుడుగా వున్నవానిని సమిష్టివ్యవసాయ క్షేత్రపు మేనేజరుగా చేస్తారా!"

"అతడు తెలివైన వ్యవసాయదారుడు. భాగ్యవంతులతరపున మాట్లాడుతున్నానా మీవుద్దేశ్యం?"

"తేనెపట్టుపిండినట్లు యెప్పటికప్పుడుపిండకుండా వున్నట్లయితే యీపాటికి గొప్ప భాగ్యవంతుడయి వుండేవాడు."

ఎంతసేపు మాట్లాడినా సమాధానానికి రాలేక వొకరిమీద వొకరికి అసంతృప్తితో విడిపోయేరు.



# పద్ధానుగో ప్రకరణము.

## మేనేజరు నియామకం.

చలికి నేలంతా రాయిలా బిగుసుకు పోయింది. స్టెప్పీలో పెద్ద పెద్ద సుడులు లేచి గాలిలో ఆడుతూ కళ్ళకి మిరుమిట్లు గొల్పుతూంది. గాలిచేత మంచు యెగిరిపోయినచోట్ల భూమిలోనికి పెద్ద బీటలు తీసిపోయింది. నదిగట్ల మీదనున్న 'పాప్లార్' చెట్లు పండిపూతి పూసినట్లు మంచుతో తెల్లగా కనిపిస్తున్నాయి.

రాత్రి తెల్లవార్లు పశువులు దొడ్లల్లో తిరుగుతూనే వున్నాయి. తెల్లారేటప్పటికి పశువుల కొట్టాలు వొక్క గడ్డిపరకకూడా లేకుండా ఖాళీగా నాకేసినట్లున్నాయి, చలి యెక్కువగా వుండడంచేత గొర్రి పిల్లలు, మేక పిల్లలు యిళ్ళలోనే వుంటున్నాయి. రాత్రి నిద్రపోయేముందు ఆడవాళ్ళు వాటిని చంకపెట్టుకొని తల్లుల దగ్గరకు తీసుకొనివచ్చి పాలు తాగడం అయిన తరువాత మళ్ళీ యిళ్ళల్లోకి తీసుకుపోతున్నారు. అర్ధ రాత్రిలు నక్షత్రాలు మినుకు మినుకుమంటూన్న ఆ నిర్మలాకాశమూ, నిశ్శబ్దంగా చలనం లేకుండా వున్న ఆప్రకృతీ చూస్తే ప్రపంచం నిర్జీవం అయిపోయిందా అనిపిస్తుంది. వుండి వుండి స్టెప్పీలో యెక్కడో తోడేలు అరుపుమాత్రం వినిపిస్తూంది.

ఆ నిశీధ నిశ్శబ్దంలో పాలు పేపువచ్చి, ఆడగుఱ్ఱం సకిలిస్తే ఆధ్వని అనేక మైళ్ళ దూరం వరకు వినిపిస్తూంది.

ఫిబ్రవరి నెల.........

తెల్లవారు ఝామున, నిర్మలమైన ఆకాశము, చలిచేత కొంకరించుకొని పోయిన ప్రకృతికూడ నిద్రపోతున్నాయి.

నిశీథం సూర్యుడు వస్తూన్నాడేమో అనే భయముతో వెల వెల పోతూంది.

ఇళ్ళ కిటికీ సందులలోనుంచి అప్పుడే వెలిగించిన సన్నడు వెల్తుర్లు కనిపిస్తున్నాయి.

ఫిబ్రవరి నెల............

ఇంకా తెల్లారలేదు. యాకోవ లూకిచ్ ఇంట్లోవాళ్ళందర్నీ లేపేడు. ఆడవాళ్ళు స్టౌ వెలిగించేరు. లూకిచ్ కొడుకు సెమియన్ కత్తులు పదును పట్టేడు. క్రైస్ట్ పాలోయిట్స్వి కాళ్ళనున్న వూలు పేజోళ్ళ మీద చింకి గుడ్డలు బాగా చుట్టపెట్టి, వాటిపయిన ఫెల్టు బూట్లు తొడిగేడు. సెమియన్, అతడూ కలిసి గొర్రెల దొడ్లోకి వెళ్ళేరు. యాకోవలూకిచ్‌కి మొత్తం 17 గొర్రెలూ, 2 మేకలూ వున్నాయి. వాటిలో మూడింతో వున్న జీవో యూనినజీవో సెమిన్‌కి బాగా గుర్తే. అతడు ఆ చీకట్లోనే పొట్టేళ్ళు, గొర్రెలు, మేకలు, వేటికి వాటిని పడతీసి, వొక్కొక్కదాన్నే పట్టుకొని లాక్కొస్తున్నాడు. తెల్లటి టోపీ ముఖంమీదికి లాక్కొని సిద్ధంగా నిలబడి యున్న పాలోయిట్స్వి వొక పొట్టేలు కొమ్ములు పట్టుకొని క్రింద పడతోసే డు. మళ్ళీ పైకి లేవకుండా దానిని కాళ్ళతో తొక్కిపెట్టి, మెడలు వెనక్కి వంగతీసి కత్తితో కంఠంముడి కోసి చంపేసేడు.

యాకోవు లూకిచ్ వొక్క వ్యవసాయంలోనే కాక అన్నివిషయాల లోనూ కూడ గట్టివాడే. అతడు తన గొర్రెల మాంసం, బోల్షివిక సైనికులు కాని, పారిశ్రామిక కూలీలు కాని తినడానికి యిష్టపడలేదు. వాళ్ళిద్దరూ లూకిచ్ మీద పన్నులు, అదనపు పన్నులు విధించి 10సంవత్సరాలనుంచి అతను భాగ్యవంతుడవకుండా క్రుంగతీస్తున్న సోవియట్ ప్రభుత్వానికి మూలస్తంభాలు. సోవియట్ ప్రభుత్వము, 'యాకోవలూకిచ్'లు వొకరి కొకరు గర్భ శత్రువులు. దీపంచూస్తే పిల్లలు దాన్ని అందుకోనడానికి గబగబ పాకినట్లు, యాకోవు అతని జీవితంలో వొక్క నిముషం కూడా వృధా చెయ్యక ధనంకూడ బెట్టడానికి పాకులాడేడు. విప్లవంనాటికి అతని ఆశయాలు ఫలోన్ముఖానికి వచ్చేటట్లు కనిపించేయి. అతని కొడుకుని 'నొవోచెర్కాస్' జంకర్సు స్కూలులో చదివించాలని అనుకొనేవాడు. చిన్న 'ఆయిల్ మిల్' కొనాలనేవద్దే

శ్యముతో క్రమంగా డబ్బు కూడబెట్టడం మొదలెట్టేడు. నలుగురు కూలీలని పెట్టి వ్యవసాయం విరివిగా సాగించాలని కలలుకంటూ, ముందు తనకు కలుగబోయే వుచ్ఛస్థితిని తలుచుకొని ఆ సంతోషం పట్టలేక ఎగిరి గంతులు వేసేవాడు. చిల్లరకొట్టు నొకదానిని పెట్టాలనియు, తరువాత ఏదే దివాలాతీసిన కోసక్కు జమీందారు దగ్గరనుంచో చవుకగా వొకమిల్లు కొనాలనియు ఉవ్విళ్ళూరుతుండేవాడు. ఊహా ప్రపంచములో యాకోవు లూకిచ్, నిరంతర కృషిచేత మొద్దుబారియున్న శరీరము, చవుకబారు కోసక్కు ట్రౌజర్సు, జాకెట్లు తొడుగుకున్న తనని అందమైన నాజూకైన శరీరముమీద సిల్కు ట్రౌజర్లు, ఫెల్టుబూట్లు, తొడుగుకొని పొట్టమీద బంగారపు గొలుసు వ్రేలాడుతూ, సమస్త సౌఖ్యాలు అనుభవిస్తున్నట్లు చిత్రించుకొనేవాడు. అతని కొడుకు సైన్యంలో కల్నల్ గా పనిచేస్తూ చదువుకొనిన పెద్దకుటుంబములోని యువతిని పెళ్ళి చేసుకొంటాడు. అతనిని తీసుకొని రావడానికి యాకోవు లూకిచ్, సాధారణ బండి కాకుండా మంచి ఖరీదయిన మోటారుకారునే తీసుకు వెడతాడు..................... యాకోవులూకిచ్ స్వప్నాలకి అంతే వుండేది కాదు. ఇంతలో విప్లవం వచ్చి దేశం అల్లకల్లోలమైపోయింది. కాని యాకోవులూకిచ్ దానివల్ల నష్టపడలేదు. స్వతహాగా తెలివైనవాడు, జిత్తులమారి అవడంచేత అరాజకంవస్తుందని ముందే గ్రహించి, వెంటనే దీపం వుండగానే యిల్లు చక్కపెట్టుకున్నాడు. అతడు 1914 సం॥లో కొన్న ఆవిరియంత్రం అమ్మేసి మూడువందల రూబులుల బంగారం, వొకతోలుసంచి నిండా వెండి, కుండలో పెట్టి పాతేసేడు. పశువులు, గొర్రెలు, మొదలైన జంతువులనన్నిటిని అమ్మేసి, తనకి కావలసినంత భూమి మాత్రం సేద్యంచేసి మిగిలినది బీడుగా వదిలేసేడు. అంతా సిద్ధంచేసుకొని కూర్చున్నాడు. రెల్లు దుబ్బు మీదనుంచి తుపాను వెళ్ళిపోయినట్లు విప్లవము, అంతర్యుద్ధము, కరువులు అతనిమీదనుంచి వెళ్ళిపోయేయి. తుపాను వస్తే మహావృక్షాలు వేళ్ళతో కూడా తెగి క్రిందకూలిపోతాయి. కాని రెల్లు నేలమీదికివంగి తుపాను వెళ్ళిపోగానే పయికి లేస్తుంది. కాని పాపం— యాకోవు లూకిచ్ మళ్ళీ పైకి

మళ్ళీ లేవడానికి వీలు లేకపోయింది. అందుచేతనే సోవియట్ ప్రభుత్వం అంటే అతనికి తీరని ద్వేషము. అతని పని విత్తులు తీసిన గిత్త మాదిరి అయి పోయింది. సంపదలు పోగుచేసే అవకాశాలు, వాటితోబాటు శరీరానికి మైకం కలిగించే ఆసంతోషముకూడా పోయేయి. అందుచేత పాలోవిట్స్నివు, అతనికి భార్యాపుత్రు లందరికంటె కూడ సన్నిహితు డయేడు. వీళ్లైతే పాలోవిట్స్నివు పక్షాన్ని జేరి సోవియట్ ప్రభుత్వాన్ని నాశనంజేసి జీవితా దర్శాన్ని సాధించాలి, లేదా యీఆస్తికూడావదలి మామూలు కూలీలలా జీవించాలి! యీరెండూ వదలి మూడో మార్గం యేదీలేదు. లూకుచ్! మొదటి మార్గమే మంచిదని తోచింది.

అందుచేతనే యాకోవులూకుచ్ 'స్టాలిన్' సమిష్టివ్యవసాయ క్షేత్రపు మేనేజిమెంటు కమిటీలో సభ్యుడై యుండియు 14 గొర్రెలను చంపేస్తు న్నాడు. "ఆ కుక్క పాలోవిట్స్నివు కాళ్ళదగ్గర రక్తం యెలా కతుకుతూం దో! నా గొర్రెలన్నిటిని చంపి యీ కుక్కకేనా పారేస్తానుకాని, వొక్క గొర్రెనికూడా సమిష్టివ్యవసాయక్షేత్రానికి యివ్వి; పెరిగి పిల్లల్ని పెట్టించి సోవియట్ ప్రభుత్వానికి వుపయోగపడడానికి మాత్రం వొప్పుకోను." అనుకున్నాడు లూకుచ్. పాలోవిట్స్నివు చెప్పిన ఆలోచనకూడా బాగుంది. "నువ్వు నీపశువుల్ని చంపేసెయ్యి. బోల్షివిక్ లికి యేమీ అంకనియ్యకు. పశువులన్నీ సంరక్షణ లేక చావనీ; అధికారం మనచేతిలోకి వచ్చిన తర్వాత కావలసినన్ని సంపాదించుకోవచ్చు. అమెరికా, స్వీడను, దేశాలనుంచి మేలుజాతి పశువుల్ని పంపిస్తారు. కనబడినవన్నీ నాశనంచేసి తిరుగుబాట్లు చేసి కమ్యూనిస్టులకి వూపిరాడకుండా చెయ్యాలి! యాకోవు లూకుచ్! చింత పిక్కలాంటి నీ గుర్రం పోతుందని విచారించకు. గుర్రాలన్నిటినీ సమాజ పరం చెయ్యడంకూడా వొకందుకు మంచిదే! దానివల్ల ముందుముందు మనక్క సులువు, లాభము కూడ వుంది. మనం తిరుగుబాటుచేసి వొక గ్రామాన్ని స్వాధీనం చేసుకున్నప్పుడు యింటింటికీ తిరిగి గుర్రాలను వెతకనక్కర లేకుం డా, తిన్నగా సమిష్టి వ్యవసాయ క్షేత్రపు తబేలాలలోకి వెళ్ళి గుర్రాలన్ని

టిని బయటకి తీసుకువచ్చి యెక్కి వెళ్ళిపోవడానికి వీలుగా వుంటుంది." ఓహో! యెంతటి ఆలోచన! ఇంతటి దూరాలోచనతో సలహా యిచ్చేవాడు లూకిచ్ కి అయాచితంగా దొరికేడు.

పొలోవిట్సేవ్, హైమియక్ గొర్రెల్ని చంపి తోళ్ళు వొలుస్తూంటే లూకిచ్ పక్కని నిలబడి చూస్తున్నాడు. లాంతరు వెలుతుర్ని తెల్లటి గొర్రె చర్మం నిగనిగలాడుతూంది. వాళ్ళిద్దరూ కలసి తోళ్ళు సునాయాసంగా వొలిచేస్తున్నారు. గలకిందికి వేళ్ళాడుతూ, చర్మం వూడ్చివస్తూ తిరగతీసి లాగేసియున్న మొండెంవైపు, పక్కనే కిందబడి నోళ్ళుతెరచిన తలవైపు, చూసేటప్పటికీ యాకోవు లూకిచ్ కాళ్ళు తడబడ్డాయి. హఠాత్తుగా ఖాప్రోవు భార్య భయంతో వణుకుతూ నెమ్మదిగా "లూకిచ్! యెందుకున్న యిలాగ బాధ పెడతారు? వదిలెయ్యండి." అనడం జ్ఞాపకం వచ్చింది. తోలు లాగేసిన చోట నీలిగాను, యెర్రిగాను కనిపిస్తున్న మాంసం ముద్దలు, పైకి వుబికియున్న కండరాలతోను, భయంకరముగాయున్న గొర్రె మొండెము వైపు అయిష్టంతో చూసేడు. ఆ కొత్తపువాసనకి మళ్ళీ వెనకవచ్చినట్లే వాంతి రాబోయింది.

"చూస్తే కళ్ళు తిరిగిపోతున్నాయి,..............వాసనకి పేగులు కడుపులోనుంచీ...................."అని నసుగుతూ బయటకి వెళ్ళిపోయేడు.

"ఇక్కడ నిలబడి యిదంతా చూడమని యెవరేనా బతిమాలేరా నిన్ను? నేమిద్దాం చెయ్యగలం యూపని!" పొలోవిట్సేవు నవ్వి, ఆ రక్తపు చేతులతోనే సిగరెట్టు తీసి వెలిగించేడు.

ఉదయం భోజనాల వేళకి అతికష్టంమీద ఆపని పూర్తి అయింది. వొలిచిన తోళ్ళన్నీ చాటుగా గదిలో ఆరబెట్టారు. ఆడవాళ్ళిద్దరు బతిసిన గొర్రెమాంసం కూర తయారు చేసేరు వుదయం భోజనానికి. పొలోవిట్సేవ్ గదిలోకి వెళ్ళి లోపల తాళం వేసుకున్నాడు. కేబేజి పులుసు గొర్రెమాంసం కూర తీసుకువెళ్ళి అతని గదిలో పెట్టేరు. అతని భోజనం అయిన

తరువాత లూకుచ్ కోడలు ప్లేట్లు తీసి గది బాగుచేసి బయటికి వచ్చింది. ఇంతలో బయట తలుపు తీసిన చప్పుడు వినబడింది.

"నాన్నా! డేవిడోవ్ వస్తున్నాడు!" అని సెమియన్ పరుగెత్తివచ్చి తండ్రితో చెప్పేడు. యాకోవ్ లూకిచ్ నిట్టూర్చబోయేడు. కత్తివేటు వేసిన ముఖంలో రక్తపుచుక్క లేదు. డేవిడోవ్ వంటవాకిట నిలబడి బూట్లమీది మంచు తుడుచుకుంటున్నాడు. నిలబడి దగ్గి, పెద్ద పెద్ద అంగలు వేస్తూ వచ్చేడు.

"నా పని అయిపోయింది!" అనుకున్నాడు యాకోవ్ లూకిచ్.

పిశాచం ముండాకొడుకు యెలా నడుస్తున్నాడో! ప్రపంచం అంతా తనదే అయినట్లు! స్వంత యింట్లో మసలుతున్నట్లు. ఏమీ సందేహం లేదు. యీ వేళతో నాపని ఆఖరు! నిక్కటా ఖ్లాపోవ్రివుని హత్య చేసినందుకు నన్ను అరెస్టు చెయ్యడానికి వస్తున్నాడనుకుంటా. ఆచోకీ తీసేడు; దొంగ లంజ కొడుకు!"

తలుపు తట్టిన చప్పుడు ఆ వెంటనే వొక కంఠస్వరం వినబడ్డాయి.

"లోపలికి రావచ్చా?"

"రండి!" అని యాకోవ్ లూకుచ్ అనబోయేడు. కాని నోట మాట రాలేదు.

డేవిడోవ్ వొక్క నిమిషం ఆగి తలుపు తెరిచేడు. లూకుచ్ బల్లమీదనుంచి లేవలేదు. — లేచి నిలబడడానికి కాళ్ళు స్వాధీనం తప్పేయి. వణుకుతూన్న కాళ్ళబూట్ల మడమలు నేలకి తగిలి చప్పుడవకుండా పయికి కాళ్ళు యెత్తవలసివచ్చింది.

"కామ్రేడ్! క్షేమమా"

"కామ్రేడ్, తమరు క్షేమమా" లూకుచ్ అనిర్భాగ్యకూడ వొక్కసారిగా అన్నాడు.

"మంచు విపరీతంగా కురుస్తూంది............."

"అవును బాగా కురుస్తూంది."

"ఈ మంచువల్ల దేనికీ నష్టం లేదనుకుంటూను. నష్టం వుందంటారా?" అంటూ దేవిడోవ్ జేబులో చెయ్యిపెట్టి వొక జేబురుమాలు పైకి తీసేడు. ఉతికి యెంత కాలం అయినదో కాని మాసిపోయి నల్లగా తోలులావుంది. అది గుప్పెట్లో వుండచేసి దాన్లో చీదేడు.

"కామ్రేడ్! లోపలికి రండి" యాకోవు లూకుచ్ ఆహ్వానించేడు.

"ఈలాగ వున్నారెందుచేత చెప్మా!" అస్త్రోవునోవు వాలకం అతని వొణుకు చూసి దేవిడోవ్ ఆశ్చర్యపోయేడు.

"రై చేలకి నష్టం వుందంటారా?" అని దేవిడోవ్ అడిగేడు.

"వాటికేమీ నష్టం వుండకూడదు...............—మంచుబాగా కప్పేసింది. గాలి దెబ్బకి మంచు యెగిరిపోయినచోట మాత్రం కొంచెం జబ్బు యిస్తుం..............."

"నెమ్మదిగా యీమాటా, ఆమాటా, మాట్లాడి, హఠాత్తుగా 'ఖ్రాస్రోవుని ఖూనీ చేసినందుకు నిన్ను అరెస్టు చేస్తాను.' అంటాడేమో! బహుశా పొలోవిట్సీవు యిక్కడ వున్నట్లు తెలిసిందేమో. సోదా జరుగుతుంది!" అనుకున్నాడు. యాకోవు లూకుచ్ భయం వదలి ముఖం కొంచెం తెరిపిని పడింది. నుదుటిమీద చెమటపోసి దట్టంగా పెరిగిన గడ్డంలోకి జారుతూంది.

"అంతా కలిసి కొంచెం ఫలహారం దీసుకుందాం. రండి, ఆపైగదిలో కూర్చుందురుగాని."

"యాకోవ్ లూకుచ్! మీతో మాట్లాడడానికి వచ్చేను. మొన్నటి మీటింగులో సమిష్టి వ్యవసాయ క్షేత్రం మీద మీరు చెప్పిన వుపన్యాసం చాలాబాగుంది. కాని వొక్క 'లేబర్ ఆర్గనైజేషన్' విషయంలో మాత్రం మీరు కొంచెం పొరపాటుపడ్డారు. మిమ్మల్ని సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి మేనేజరుగా యేర్పాటుచెయ్యాలని అనుకుంటున్నాం. వ్యవసాయంలో మీకు చాలా నైపుణ్యము, అనుభవమూ వుందని విన్నాను."

"ఇల్లా నిలబడ్డారేమిటి! లోపలికి రండి. 'గషా! 'టీ' సిద్ధంచెయ్యి. 'కేబేజిసూప్' మీకు ఇష్టమేనా? లేకపోతే పుచ్చకాయలు వున్నాయి.

మీ యిష్టం; రండి. మీకు తోచి వచ్చేరు కాని, మీ యెత్తు బంగారం యిస్తే మాత్రం వస్తారా. ప్రజల్ని దరిద్రం లోనుంచి లేవనెత్తడానికి వచ్చిన మహా పురుషులు......................" యాకోవు సంతోషంతో వుక్కిరి బిక్కిరి అయిపోయేడు. నడ్డిమీదనుంచి పెద్ద బరువేదో దింపేసినట్లు అనిపించింది. నేను శాస్త్రీయ పద్ధతులమీద వ్యవసాయంచేయడం, నిజమే. వ్యవసాయంలో వాళ్ళ తండ్రి తాత లందరి పద్ధతినే అనుసరించే యీ కోసక్కులందరికి నూతన మార్గాలు నేర్పాలి. వాళ్ళు యెలాగ దున్నుతారో చూడండి. నేలపైన గోకి వెళ్లులు తిరగతీస్తారు! వ్యవసాయ శాఖవారు నాకొక 'సర్టిఫికేటు' యిచ్చేరు. సెమియన్! అద్దం కట్టించిన ఆ 'సర్టిఫికేటు' తీసుకురా. పోనీ, అవసరం లేకుంటే మేమే వెడతాం, అక్కడికి."

'సెమియన్‌కి' సైగచేసి యాకోవ్ లూకిచ్ దేవిడోవుతోకలసి మిద్దె గదిలోకి వెళ్ళేరు. తండ్రి వుద్దేశ్యం గ్రహించి సెమియన్, పొలోవిట్సేవ్ వున్న గదికి తాళం వెయ్యడానికి వసారాలోకి వెళ్ళేడు. గదిలోకితొంగిచూసి లోపల యెవరూ లేకపోవడానికి ఆశ్చర్యపోయేడు. అక్కడినుంచి సావిట్లోకి వెళ్ళేడు. పొలోవిట్సేవు కాలి బూట్లు లేకుండా సాక్సు వూలు మేజోళ్ళు మాత్రం తొడుగుకొని మిద్దెగదిలోకి వెళ్ళే గుమ్మంలో నిలబడి తలుపు సందులోనుంచి తొంగి చూస్తున్నాడు. అతను సెమియన్‌ని చూడగానే వెళ్ళి పొమ్మని సంజ్ఞచేసి తలుపుసందు దగ్గిర చెవి పెట్టి వింటున్నాడు. "గుండెలు తీసిన బంటు" అనుకుంటూ సావిడి వదలి వెళ్ళిపోయేడు సెమియన్.

ఆపిలు శీతకాలంలో వుపయోగించరు. ఒకమూల గంజాయి విత్తులు రాశి పోసి వున్నాయి. గుమ్మందగ్గర ఆపిలుపళ్ళు నిలువచేయబడ్డ పీపా పడి వుంది. పొలోవిట్సేవు ఆ పీపా పంచమీద కూర్చున్నాడు. అక్కడ కూర్చుంటే డేవిడోవ్, యాకోవు ల సంభాషణ బాగా వినిపిస్తుంది. చలిచేత పొలోవిట్సేవు కాళ్ళు కొంకర్లు పోతున్నాయి. కదలకుండా కూర్చుని, తలుపు అవతల మాట్లాడుతూన్న డేవిడోవ్ మాటలు శ్రద్ధగా వింటున్నాడు. "అస్తమానూ వెధవ మీటింగుల గొడవే! వీలుంటేనా.........—.........ఈ

తక్షణం......................" పాలోవిట్సేవ్ పళ్ళు కొరుకుతూ గుప్పెళ్ళు బిగించి గుండెలకి అదుముకున్నాడు.

తలుపు అవతలనుంచి యీ మాటలు వినిపిస్తున్నాయి:

"కామ్రేడ్! అసలు కిటుకు అది. పూర్వంలాగే వ్యవసాయం చేస్తే లాభం లేదు. పంటలు యెలాగ పండుతున్నాయో చూసేరా! ఎకరం పుట్లు పండితే గొప్ప. ఒక్కొక్కప్పుడు పండినపంట పెట్టుబడికే సరిపోవడం లేదు. మా చేలు చూడండి! మనిషి అడ్డపడితే కదలటానికికూడా వీలుండదు. చేలో నిలబడి చెయ్యెత్తితే వెన్నులు అందకుండా యెదిగిన సంవత్సరాలు కూడా యెరుగుదును నేను. కురిసిన మంచు అంతా యెక్కడికీ పోకుండా చేలల్లో నిలకట్టడమే కారణం. అంతకంటె మరేమీ లేదు. 'సన్ ఫ్లోరు' మొక్కలు చలి మంట కాగడానికి వుపయోగిస్తాయని వేళ్ళలోకి కోసేస్తే యెలాగ? వేసవిలో పిడకలుచేసి జాగ్రత్త పెట్టుకునే శ్రద్ధ వొక్కడికీ కూడా లేదు. సోమరితనం బలిసి పోయింది. 'సన్ ఫ్లోర్' పంటమాత్రం కోసుకుని మొక్కల్ని అట్టే పెట్టేస్తే కురిసిన మంచు అంతా యెక్కడికీ పోకుండా వాటిని అంటిపెట్టుకుని వుంటుందని, గాలి మంచుని యెగరకొట్టకుండా అడ్డుగాకూడ వుంటుందని కూడ వీళ్ళకి తెలియదు. అటువంటి భూమి వేసవికాలం దున్ని విత్తులుచల్లితే యెంత పంట పండమంటే అంతపంటా పండుతుంది. మంచు నిలగట్టకపోతే అదంతా వృధాగా పోయి, నేలకి సత్తువ వుండదు: మనకి పంట వుండదు."

"అవును మీరన్నమాట నిజమే."

"మన సోవియట్ ప్రభుత్వం నాకు వూరికే యివ్వలేదు సర్టిఫికేటు. గొప్ప చెప్పుకోడం కాదు కాని — వ్యవసాయంలో నాకు వున్న అనుభవం యీ చుట్టుపక్కల యెవరికీ లేదు. గవర్నమెంటు వ్యవసాయ నిపుణులు చెప్పి వాటిలో కూడ అక్కడక్కడ కొద్ది లోపాలున్నప్పటికీ, నేర్చుకోవలసినది చాలావుంది; నేను వ్యవసాయ విషయాల్ని గురించి వ్రాసే పత్రిక ఒకటి తెప్పిస్తున్నాను. అందులో వొకడు చేల నిండా మంచు లేకపోయినట్లయితే నేల బీటలు తీసి మొక్కల వేళ్ళన్నీ తెగి చచ్చిపోతాయని వ్రాసేడు."

"ఆ! అలాగా. ఈ సంగతి నేను యెప్పుడూ వినలేదు."

"అది అక్షరాలా నిజం. పరీక్షచేసి చూశానుకూడాను. కొన్ని మొక్కలు తవ్వి చూస్తే వాటి పిల్లవేళ్ళన్నీ తెగిపోయి వున్నాయి! ఆహారం తీసుకొనే వేళ్ళు లేకపోతే మొక్క చాకి యేంచేస్తుంది? రక్తనాళాలు కోసేస్తే మనిషి చావడూ? అలాగే మొక్కలు కూడాను."

"నిజమే. యాకోవులూకుచ్, మీరు చెప్పేవాటిలో వొక్కటికూడ అసత్యం లేదు. చేలలో మంచు నిలకట్టాలి. వ్యవసాయ సంబంధమైన పత్రిక లేవో తెప్పిస్తున్నానన్నారు, అవి వొక్కసారి యిచ్చారండి. చదివి మళ్ళీ యిచ్చేస్తాను. ఇప్పుడు మీదగ్గర వున్నాయా?"

"అవి నీకు ఆట్టే వుపయోగించవు" అనుకున్నాడు పొలోవిట్సేవు. "వాటిని చదవటానికి నీకు వీలుండదు. నీరోజులు దగ్గర పడ్డాయి." అతను తనలో తనే నవ్వుకున్నాడు.

"శీతకాలం బీళ్ళలో మంచు నిలకట్టడం యెల్లాగ?" లూకుచ్ మళ్ళీ మొదలెట్టేడు. "దానికికూడా ఆలోచించాను. 'బ్రష్‌వుడ్' తో దడికట్టడం కంటె సులువైన పద్ధతి యేదీ కనిపించలేదు."

"సరేలెండి. దూడల పాకలు వెచ్చగా వుండడానికి యేం చెయ్యాలంటారు. చవకలో తేలిపోవాలి: తెలిసిందా?"

"దానికి పెద్ద ఆలోచన యేముంది? చుట్టూ దడి కట్టి మట్టిపూత పూయించడం; లేకపోయినట్లయితే రెండుపరసలని దడులుకట్టి ఆ ఖాళీలో యెండిన పేడ వెయ్యడం"

కాళ్ళు నొప్పి పట్టడంచేత సుఖవుగా కూర్చోడానికి పొలోవిట్సేవు కొంచెం కదిలేడు. అడుగున పీపా దొర్లిపోవడంచేత గ్లాసులు కింద పడిపోయేయి.

"ఏదో పడినట్లు చప్పుడయింది, యేమిటది?" అన్నాడు దేవిడోవు.

"పిల్లి యేదో కింద పడతోసి వుంటుంది. శీతకాలంలో ఆసావిడి ఉపయోగించం. ఆసావిట్లో గజాయి విత్తులున్నాయి చూద్దురుగాని రండి."

పాలోవిట్స్ గభాలున లేచి, తన గదిలోకి వున్న ద్వారం తెరచి, లోపలికి వెళ్ళి తలుపు వేసేసుకున్నాడు. తలుపు గ్రంథులన్నిటిలోను నూనె వెయ్యడంచేత యేమీ చప్పుడవలేదు.

డేవిడోవు, ఆస్ట్రొవునోవు బాగా వుపయోగిస్తాడని సంతోషిస్తూ, పేపర్లకట్ట వొకటి చంకని పెట్టి, యింట్లోనుంచి బయిటకి వచ్చేశాడు. ఇట్లాంటి వాడు చేతిలో వుంటే గ్రామం గ్రామం అంతా సంవత్సరంలో మార్చెయ్య వచ్చు. కష్టపడి పనిచేస్తాడు. తెలివితేటలున్నాయి; పైగా చదువుకున్నవాడు. మేనేజరు పదవికి తగినవాడు. మకార్ యితనిని అనుమానించడాని కారణం తెలియకుండా వుంది. సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి వుపయోగిస్తాడు. సందేహం లేదు." అనుకుంటూ డే వి డో వ్ సో వి య ట్ ఆ ఫీ సు కి వెళ్ళిపోయేడు;



# పదిహేనో ప్రకరణం.

## జంతు వధ.

యాకోవ్ లూకిచ్ ప్రోత్సాహంచేత, గ్రెమాచీలాగ్ లో ప్రతివాళ్ళు రాత్రిలందు రహస్యంగా పశువులు, గొర్రెలు, పందులు, కోళ్ళు మొదలైన వాటినన్నిటిని చంపడం ప్రారంభించేరు. చీకటి పడ్డది మొదలు తెల్లారేవరకు, రాత్రి అంతా యేదో వొకదాని అరుపు వినిపిస్తూనే వుంది. వీరు, వారు అని భేదం లేకుండా సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేరినవాళ్ళు, చేరనివాళ్ళు కూడ చంపుతూనే యున్నారు. గొర్రెలు, పందులు మొదలయిన వాటినే గాక పాడి పశువుల్ని, యెద్లనికూడ చంపేస్తున్నారు. రెండు రోజుల్లో గ్రెమాచీలాగ్ లోని సగం పశువులు నశించేయి. పేగులు, యెముకలు, నోట కరచుకొనిపోతున్న కుక్కలే యెక్కడ చూసినా. 18 నెలల నుంచి కోఆపరేటివ్ స్టోర్సులో పడియున్న 50 బస్తాల వుప్పు యీ రెండు రోజులలోను ఖర్చయిపోయింది. "మసని కావు, చంపెయ్యండి" "చంపక అట్టేపెడితే మాంసపు పన్ను పేరు చెప్పి యెల్లాగా తీసుకు పోతారు వీటినన్నిటిని." "సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేరిన తరువాత మాంసం దొరకదు. కడుపు నిండా తినండి" అనుకొనేవాళ్ళే యెవర్ని చూసినా. చిన్నపిల్లలు మొదలు ముసలివాళ్ళ వరకూ ప్రతివాళ్ళు పొట్టలు విచ్చేలా తిన్నారు మాంసం. పండుగులలోను, చచ్చిపోయినవాళ్ళ ఆత్మశాంతి రోజులలోను తిన్నట్లు తెగతిని కడుపు నొప్పిచేత బాధ పడ్డారు.

ఛూనెక్ తన ఆవుదూడని మొదటిరోజు రాత్రి చంపేసేడు. దూడానికి వేళ్ళాడతీస్తే చర్మం సులువుగా తీసెయ్య వచ్చునని భార్య, అతడు కలసి ఆశవానికి తాడుపోసి వేళ్ళాడతియ్యడానికి ప్రయత్నించేరు. బాగా బలిసిన ఆ దూడని యెత్తడంలో ఛూకర్ భార్యనడుము బెణకడంచేత వారంరోజుల

వరకు 'మనుభికా' చేత నడ్డితో మించుకొనవలసి వచ్చింది. భార్య నడ్డి బెణకడంచేత ఆమరునాడు ఘూకర్ కి వంట తప్పింది కాదు. ఆకలిచేత ఆ మాంసం తెగతిన్నాడు. దానితో అజీర్ణంచేసి కడుపుబ్బి బాధపడుతూ 24 గంటలూ దొడ్లో 'సన్ ఫ్లోర్' మొక్కలలోనే కూర్చుని వుండేవాడు. అతని యింటిప్రక్కనుంచి వెళ్ళేవాళ్ళు యెప్పుడుచూసినా ఘూకర్ టోపీ ఆ 'సన్ ఫ్లోర్' మొక్కలలో కదలిక లేకుండా అల్లా కనిపిస్తూనే వుండేది. ఉండి ఉండి ఘూకరు ఆత్రంగా లేచి పొట్టతో మూలుగుతూ, కిధరైనా చూడకుండా యింట్లోకి వెడుతూండేవాడు. కాళ్ళు యీడ్చుకుంటూ నెమ్మదిగా గుమ్మం వరకూ వెళ్ళి, అక్కడ యేదో జ్ఞప్తికి వచ్చినట్లు ఆత్రంగా వెనక తిరిగి మళ్ళీ 'సన్ ఫ్లోర్' మొక్కలలోకి వచ్చి కూర్చునేవాడు.

ప్రజలంతా పశువుల్ని దంచేస్తున్న సంగతి రజ్మట్నోవుకి రెండోరోజు సాయంత్రం తెలిసింది. వెంటనే అతడు డేవిడోవు బసకి పరుగెత్తేడు.

"సావకాశంగా కూర్చున్నారా!" అని అడిగేడు.

"చదువుకుంటున్నాను." చేతిలోనున్న చిన్న పచ్చఅట్ట పుస్తకం పేజీ తిరగేస్తూ డేవిడోవ్ చిరునవ్వు నవ్వేడు. "ఈపుస్తకంచదువుతూ కూర్చుంటే యింకతిండికూడా అక్కర్లేదు." అతడు తొస్సికనిపించేలా పకపకా నవ్వేడు.

"నవలలు చదువుతున్నారా! ఆవతల గ్రామం అంతా......"

"నవలా యిది! మతిలేదా యేమిటి!" డేవిడోవు విరగబడి నవ్వుతూ రజ్మట్నోవ్ ని తనకియెదురుగా బల్లమీద కూర్చోపెట్టి ఆపుస్తకం అతని చేతికి యిచ్చేడు. ఇది రాష్ట్రపు పార్టీకమిటీ సభ్యులకి ఆండ్రీవ్ యిచ్చిన రిపోర్టు. వెధవ నవలలు దీనిముందు యెందుకు పనికివస్తాయి! నిజం! యేమీ తోచక పుస్తకం చదవడం మొదలెట్టేను. అంతే; ఆ ధోరణిలో ఆకలికూడా మరచిపోయేను. చాలా చలిగా వుందే!" అతడు లేచి జేబుల్లో చేతులు పెట్టి వంటయింట్లోకి వెళ్ళేడు.

"నేను చెప్పేది వింటారా, వినరా?" రజ్మట్నోవు కోపముతో గట్టిగా అడిగేడు.

"ఆ–యిదిగో వస్తున్నా! ఒక్క నిముషం."

వంట యింట్లోనుంచి 'కేబేజీ సూప్' మూకుడు చేత పట్టుకొనివచ్చి కూర్చున్నాడు. రజ్మటోన్షెవ్ కేసిచూస్తూ పెద్ద రొట్టెముక్క నోటితో కొరికి నమలడం ప్రారంభించేడు. మూకుడులోనున్న 'కేబేజిసూపు'లో పచ్చగా తేలుతూన్న గొఱ్ఱి మాంసపు కొవ్వు, యెఱ్ఱిగానున్న మాంసపు ముక్కలు కనిపిస్తున్నాయి.

"సూప్ లో మాంసం వేసేరా యేమిటి?" అండ్రీ మూకుడుకేసి చూపిస్తూ అడిగేడు.

ఉక్కిరిబిక్కిరి అయేటట్లు నోటినిండా రొట్టె వుండడంచేత, మాట్లాడడానికి వీలులేక బుర్ర వూపేడు, డేవిడోవ్.

"మాంసం యెక్కడిది?"

"నాకు తెలియదు; కాని యెక్కడిది అయితే మనకెందుకు!"

"వాళ్ళు అప్పుడే గ్రామములోని సగం జంతువుల్ని పయిగా చంపేసేరు."

"ఎవరు?" డేవిడోవ్ యింకొక రొట్టెముక్క విరిచేడు."

"ఇంకా యెవరని అడుగుతున్నారా? సమిష్టి వ్యవసాయ క్షేత్రపు ఛైర్మన్! యీ లోకంలో లేరా మీరు? మీ సమిష్టి వ్యవసాయ క్షేత్రపు రైతులు వారి పశువుల్ని అన్నిటిని చంపేస్తున్నారు. వాళ్ళే కాదు. గ్రామంలోని రైతులందరూను! క్రిందు, మీదు తెలియక రక్తం చవిచూసిన పెద్ద పులుల్లాగ యెద్దునికూడా చంపేస్తున్నారు."

"మీటింగులో మాట్లాడుతూన్నట్లు అంత గట్టిగా అరుస్తారెందుకు? అదో దురలవాటు." డేవిడోవ్ రొట్టె, సూప్ కలిపి నోట్లో వేసుకున్నాడు. "జరిగినదంతా నెమ్మదిగా చెప్పండి, యెవరు చంపుతూన్నదీ, యెందుకు చంపుతూన్నదీ!"

"ఎందుకు చంపుతున్నారో నేనెల్లా చెప్పగలను."

అనవసరంగా అరుస్తూ చప్పట్లు చరుస్తాను. నేను కళ్ళు మూసుకుని

1919 నాటి ఆ వెనుకటి సంగతులన్నీ శాంతముగా జ్ఞప్తికి తెచ్చుగో కలను.”

“ఇంకొక నిమిషానికి మీరుకూడా ఆనవడం మొదలెడతారు.”

రజ్మటోన్నవు తనకు తెలిసినంతవరకూ, ప్రజలు జంతువుల్ని చంపడం విషయం తెలియజేసేడు. డేవిడోవు క్రమంగా రొట్టె నమలకుండానే తినెయ్యడం మొదలెట్టేడు. అతనిలో పరిహాసభావం పోయింది.

“వెంటనే వెళ్ళి ‘జనరల్ మీటింగు’ జరుగుతుందని ప్రజలకందరికీ తెలియ చెయ్యండి.” అని ఆజ్ఞాపించేడు. “నగ్లోన్నవ్‌ని యిక్కడికి......
......పోనీలెండి, నేనే వెడతాను అక్కడికి.”

“జనరల్ మీటింగు దేనికి?”

“ఎందుకా? జంతువుల్ని చంపకూడదని తెలియచెయ్యడానికి. అటువంటివాళ్ళ సభ్యత్వాలు రద్దుచేసి, కేసులు పెడదం. చూసీచూడనట్లు వదిలెయ్యవలసిన విషయం కాదిది. ఇదంతా కులక్‌ల ప్రోత్సాహం. ఈ సిగరెట్టు తీసుకొని కాల్చి చూడండి. ఇందాకటినుంచి యీ విషయం మరచిపోయేను. చూసేరా,” డేవిడోవ్ పెదవులమీదచిరునవ్వు తొణుక్కుమంది. కళ్ళు సంతోషాన్ని వెలిగక్కుతున్నాయి. అతడు పెదవులు కదల్చకపోయినా, సంతోషం ముఖంలో తాండవం ఆడుతూనేవుంది.

“ఈ రోజుననే, నాకు లెనిన్ గ్రాడు నుంచి బంగీ వొకటి వచ్చింది. స్నేహితులు పంపేరు. .......................” వుత్సాహం చేతఎఱ్ఱబడ్డ ముఖంతో వంగి, మంచం కిందనుంచి, చిన్నపెట్టివొకటి యివతలకి లాగి మూత తెరిచేడు! సిగరెట్టు పెట్టెలు, బిస్కటు ప్యాకట్లు, నమ్కాపని చేసిన సిగరెట్టు కేసు, ఇంకా అనేక వస్తువులు చిందరవందరగా పడివున్నాయి.

“కామ్రేడ్సు నన్ను మరచిపోలేదు. చూడండి, యెన్ని వస్తువులు పంపించారో ....................... ఇవి లెనిన్‌గ్రాడ్ సిగరెట్లు. ఛోకలెట్లు కూడా పంపేరు. చూసేరా? నాకు యెందుకు అవి? ఏవరికేనా పిల్లలకి పంచిపెట్టేస్తాను.......................కాని అదికాదు విషయం, అసలు

మనకి పంపించేరు, అదీ మనం చూడవలసింది. ఏమంటారు, అంతేనా? జ్ఞాపకార్థం యీ వస్తువులన్నీ పంపుతూ వాటితో వొక ఉత్తరం కూడా పంపేరు................"

దేవిడోవు కంఠ స్వరంలో యెన్నడూ లేని నెమ్మది తొణుకాడుతూంది, ఆంద్రీ శాంతము, సంతోషము మూర్తీభవించియున్న యీ కామ్రేడ్ దేవిడోవుని యిదివరకు చూడలేదు. దేవిడోవు తత్తరపాటంతా రజ్మటోవుని ఆవహించింది.

"సరే, బాగానేవుంది, మీరు చాలా గొప్పవాళ్ళు. అందుచేతనే మీ స్నేహితులు యివి అన్నీ పంపించేరు. కాని యివిఅన్నీ కలిపి వొక 'రూబులు' ఖరీదైనా వుంటాయా!"

"ఖరీదు యెంత అని కాదు మనం చూడవలసినది. నేనున్నాను చూసేరా, తల్లి, తండ్రి, భార్య, పిల్లలు లేని యేకాకిని. యిప్పుడు యీ పార్సిలు వచ్చింది చూడండి! యెంత సంతోషంగా వుంటుంది! ఈ ఉత్తరం మీద యెంతమంది సంతకాలు చేసేరో చూడండి." దేవిడోవు వొక చేతితో సిగరెట్టు పెట్టె తీసి రెండవ చేతితో అనేక సంతకాలు వున్న వొక ఉత్తరం పట్టుకున్నాడు. అతని చేతులు వణికేయి.

రజ్మటోవు లెనిన్ గ్రాడు సిగరెట్టు వెలిగించి యిల్లా అడిగేడు.

"ఈ బస వీలుగా వుందా? ఇంటి యజమానురాలు మంచిదే అనుకుంటాను, కాదూ? గుడ్డలు వుతకడం యేం చేస్తున్నారు? మా యింటికి తీసుకు వచ్చి పడెయ్యండి. మా అమ్మ వుతికి పెడతూంటుంది. లేకపోయినట్లయితే యిక్కడివాళ్ళని యెవరినేనా యేర్పాటుచేసుకోండి. మీరు తొడిగిన అవస్థ చూడండి. గొడ్డుతోలులా యెలావుందో. అంటించినా అంటుకోదు."

దేవిడోవు ముఖం ఎఱ్ఱబడింది.

"అవును, యేదో చూడాలి. నగుల్నోవు యింట్లో వున్నంత కాలమూ యేమి చెయ్యడానికీ కూడా వీలులేకపోయింది. చిరిగిపోయిన బట్టలు కుట్టుకోవడం, వుతకడంకూడా నేనే చేసుకుంటూండేవాడిని. యిక్కడికి వచ్చిన

ప్పటినుంచి వొక్కసారికూడా సబ్బుపట్టించి బట్టలు శుభ్రంగా వుతుక్కో లేదు. అందుచేతనే యిల్లా వున్నాయి .........................ఈ వూళ్ళో కొట్లలో యెక్కడా సబ్బు దొరకలేదు. ఈ పక్కని వున్న ఒకామె నడుగుతే, ఆమె 'సబ్బు యివ్వాండి, వుతికిపెడతాను' అంది. బట్టల సబ్బు పంపించమని లెనిన్‌గ్రాడ్‌లో మా స్నేహితులకు వుత్తరం వ్రాయాలి. ఈ బస అంత పాడుగా లేదు. పిల్లల గొడవ యేమీ లేదు. స్థిమితంగా కూర్చొని చదువుకోడానికి వీలుగానే వుంది........"

"మీ బట్టలు మా అమ్మకి యివ్వండి, ఆవిడ వుతుకుతుంది. మొఖమాట పడకండి. మా అమ్మ చాలా మంచిది."

"ఏదో వొకటి చేస్తాను. మీరు వ్యసనపడకండి. సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి మంచి స్నానాలయిల్లు వొకటి కట్టించాలండి. బాగుండదు! కొద్ది రోజులలో చూడాలి. ముందు మీరు వెళ్ళి మీటింగు విషయం చూడండి. వెనక నేను కూడా వచ్చేస్తున్నాను."

రజ్మట్నోవు సిగరెట్టు పూర్తి చేసి వెళ్ళిపోయేడు. డేవిడోవు కొంతసేపు పెట్టిలో వస్తువులు యిక్కడవి అక్కడ, అక్కడవి యిక్కడ సర్ది వొక్క నిట్టూర్పు విడిచేడు. తరువాత బూడిదరంగు 'స్వెట్టరు' కాలరు సరిచేసి, చెదిరియున్న నల్లటి జుట్టు దువ్వుకొని బయటికి వెళ్ళడానికి సిద్ధమయేడు.

దోవలో నగుల్నోవు యింటిదగ్గర ఆగి అతనిని కేకేసేడు. నగుల్నోవు కనుబొమలు ముడిచి అతనినుంచి దృష్టి తప్పించి చూస్తూ బయటికి వచ్చేడు.

కుశల ప్రశ్నలు అయిన తరువాత డేవిడోవు, "ప్రజలు పశువుల్ని అన్నిటిని చంపేస్తున్నారు." అన్నాడు.

"ఒక్కడికి కూడా కట్టుమని పదిరూపాయిల ఆస్తిలేదు. ఇంతోటి ఆస్తి ప్రభుత్వానికి వశపరచవలసి వస్తుందేమోనని యీ ఆడావిడ అంతా. మధ్యతరగతి ప్రజలు పడుతున్న ఆందోళనకి అంతేలేదు." నగుల్నోవు భార్య వయిపు తిరిగి "లుకేరియా! నువ్వు యిక్కడ వుండకు. వెళ్ళి యీ యింటి ఆవిడ దగ్గర కూర్చో" అన్నాడు.

లుకేరియా విచారంతో యింట్లోకి వెళ్ళిపోయింది. గ్రిమాచీలోని భాగ్యవంతు లందరితోబాటు, టిమోఫీకూడ ప్రవాసానికి వెళ్ళినప్పటినుంచి, ఆమె విచారంగానే వుంటూంది. ఎప్పుడూ కలకలలాడే ఆమెలో ఆ వెనకటి సంతోషమే లేదు. టిమోఫీ వియోగం సహించలేక క్రుంగిపోతూంది! భాగ్యవంతుల్ని అందరిని వుత్తర ధ్రువప్రాంతానికి పంపే రోజున ఆమె టిమోఫీని చూడడానికి, సగ్గు బిడియాలు వదిలేసి వుదయం మొదలు బోస్లేవు దొడ్లో కాచుకొని కూర్చుంది. బాగా పొద్దువాలిన తరువాత భాగ్యవంతుల కుటుంబాలను, వారి సామానులను యెక్కించుకొని స్లెడ్జిబళ్ళు బయలుదేరేయి, గ్రిమాచీనుంచి. లుకేరియా వొక్క కేక వేసి, నిలువునా మంచులో పడిపోయింది. టిమోఫీ ఆమెను లేవనెత్తడానికి స్లెడ్జిబండిలోనుంచి కిందికి వురికేడు. కాని అతని తండ్రి కేకలు వెయ్యడంచేత మహాక్రోధంతో గ్రిమాచీ గ్రామం వైపు తిరిగి తిరిగి చూస్తూ, బళ్ళ వెనక వెళ్ళిపోయేడు.

టిమోఫీ బుజ్జగింపు మాటలు లుకేరియా చెవుల్లో యింకా ప్రతిధ్వనిస్తూనే వున్నాయి. ఆమాటలు యింక యెన్నడూ వినిపించవుగదా! జీవితంలో వెనకటి సౌఖ్యదినాలు తలుచుగుంటే యే యువతి విచారించదు! ప్రేమతో ఆమె కళ్ళలోకి చూస్తూ, "లుకేరియా! అపచ్ఛగాను తొడుక్కుంటే బాగుంటుంది; పెద్ద వుద్యోగస్తుడి భార్యలా వుంటావు." అనేవాళ్ళు యెవరు! "వెళ్ళిపోవాలి; వొదిలెయ్యి. ఎంతసేపు వున్నా నిన్ను విడిచి వెళ్ళాలని వుండదు. నీ అందం చూస్తే కొరుక్కు తినెయ్యాలనిపిస్తుంది;" లుకేరియాని పొగడి వుబ్బేసి, హృదయం రేకెత్తించి, సౌఖ్య పరవశురాల్నిగా చేయగలవాడు టిమోఫీ వొక్కడే.

ఆ రోజు మొదలు ఆమె భర్తమీదకూడ విరక్తిగా వుండడం మొదలెట్టింది. ఆమెలోని యీ మార్పు మకార్ గ్రహించేడు.

"లుకేరియా! నాతోవుండే యీ కొద్ది రోజులూ సుఖంగా వుండు. తరువాత నీవస్తువులన్నీ తీసుకొని నీ యిష్టం వచ్చినచోటుకు వెళ్ళు. నిన్ను హృదయపూర్వకంగా ప్రేమించి నలుగురిలోను నవ్వులపాలయేను. నా

వోర్పు నశించింది. ఒక భాగ్యవంతుడి కొడుకుతో నీయిష్టంవచ్చినట్లు తిరుగుతున్నాగాని మాట్లాడక వూరుకున్నాను. అంతటితో వదిలిపెట్టక వాడు వూరు వదలి వెళ్ళిపోతూంటే నడివీధులలో, అందరూ చూస్తూంటే సిగ్గనా లేకుండా వాడికోసం గోల పెట్టావు. ఇంకా వోర్పు వహించి వుండడం నా చేతకాదు; ఇంతవరకూ నా మెడకి గుదిబండలా వున్నావు. ఈ అనవసరపు బరువెందుకు. తోసి పారేస్తాను. తెలిసిందా!" అన్నాడు.

"ఆ తెలిసింది." అని చెప్పి వూరుకుంది లుకిరిగా.

ఆ రోజు సాయంకాలం నగుల్నోవు, డేవిడోవులు యీ విషయాన్ని గురించి రహస్యంగా మాట్లాడుకున్నారు.

"మకార్! మీ భార్య దుర్నడత అంతకంతకి మితిమీరుతూందే! నిన్న యేమిచేసిందో చూశేరా! పదిజనంలో తల యెత్తుకొని తిరగగలరా మీరు!" అని నిలవతీసి అడిగేడు డేవిడోవు.

"మళ్ళీ ఆ వెంకటిగొడవలన్నీ........."

"ఛీ! పత్తి మొద్దు! యింతకంటె దున్నపోతయినా నయం." డేవిడోవు ముఖం యెర్రబడింది. నుదురుమీది రక్తనాళాలు వుబ్బొంగేయి.

"మీతో మాట్లాడడం కష్టం." నగుల్నోవు గదిలో పచారు చేస్తూ వేళ్లు మెటికలు విరిచి తనలో తనే నవ్వుకున్నాడు. "'అనార్కిస్టు ట్రాట్స్కీయిస్టు. నిలకడ లేనివాడు.' అని తిట్టడంతో మాట్లాడటం ప్రారంభిస్తారు. నా భార్యమీద నాకు యెటువంటి వుద్దేశ్యం వుందో, యింత అపకీర్తి సహించి యెందుకు వూరుకుంటున్నానో మీకు తెలుసును. నా మనస్సు మారిపోయిందని మీకు చెప్పనే చెప్పేను. మీకు యెప్పుడయినా గొర్రెతోక చూస్తే ఆశ్చర్యం కలిగిందా!"

"లేదు." డేవిడోవు నెమ్మదిగా సమాధానం చెప్పేడు. నగుల్నోవు సంభాషణ మార్చేసి అర్థంలేని ప్రశ్నలు వెయ్యడంచూసి ఆశ్చర్యం కలిగింది.

"నాకుమాత్రం ఆశ్చర్యం కలిగింది. గొర్రెకి తోక వుపయోగం ఏమి వుందా అని. అదనపు బరువు తప్ప యేమీ లాభంలేదు. ఎద్దు, గుర్రం, ఆఖ

రుకి కుక్క కూడా దాని తోకవల్ల కొద్దిగానయినా వుపకారం పొందుతూంది. గొర్రెకి ఈ పొన్నాబరువయిన తోక యిటు అటు ఆడించడానికి తప్ప యీగల్ని తోలుకోవడానికి కూడ వుపయోగించదు ఉపయోగం లేకపోవడం సరే కదా పైగా దానినిండా బుడ్డగణాజులు మారి పీకుతూంటే బాధగా కూడా వుంటుంది."

"ఈ తోకల్ని గురించిన యీ వుపన్యాసం యెందుకు?" అన్నాడు డేవిడోవు.

నగుల్నోవు సమాధానం చెప్పకుండా మళ్ళీ ప్రారంభించేడు.

"గొర్రెకి తోక లేని కొరత తీర్చడానికి పెట్టినట్టు తోస్తుంది ఆ మొండి ముక్క. అది అనుపయోగమే కాని దానిబదులు అక్కడ యింకొకటి యేమి పెడతాము? గొర్రెకి తోక అనుపయోగమైనట్లే, నాభార్యకూడా నాకు అనుపయోగం. నేను ప్రపంచ విప్లవంకోసం యెదురు చూస్తున్నాను. అదే నా జీవిత పరమావధి. నా భార్య తినడానికే కాని యింక యెందుకూ పనికి రాదు. నా దోవకి అడ్డుకూడాను. కాని ఆడది లేనిదే అసలే సాగదు. నేనూ మనుష్యుడనే. జబ్బుచేస్తే చాకిరీ చెయ్యడానికీ యింకా యితర అవసరాలు తీర్చడానికి వుపయోగిస్తుంది. నేనుకనక తృప్తి పరచలేకపోయినట్లయితే వెళ్ళి పోవచ్చు! ఒకసారి ఆమెతో 'నువ్వు నీ యిష్టం వచ్చినవాళ్ళతో తిరగవచ్చు, నా అభ్యంతరం లేదు; కాని నా కళ్ళయెదుట కాకుండా రహస్యంగా వుంటూండు. అంతేకాని నీ యిష్టం వచ్చినట్లు అడ్డమైన వాళ్ళతోనూ తిరిగి ఆ ఆనవాళ్ళతో నాదగ్గరికి వచ్చేవంటేమాత్రం వొళ్ళు వాలి చేస్తాను. జాగ్రత్త' అన్నాను. కామ్రేడ్ డేవిడోవు! యీ గొడవలన్నీ మీకు తెలియవు. నా భార్య చెడు ప్రవర్తనకి నేను యేమి చెయ్యగలను? అది మన యిద్దరికీ కూడ సమాధానం చెప్పగలదు. కూలీ వర్గానికి శత్రువైన వొక భాగ్యవంతుడుతో తిరగడమే కాకుండా, వాడు వెళ్ళిపోతుంటే సిగ్గైనా లేకుండా యేడ్చిన దీనిని యెవరు అడ్డం వచ్చినా సరే నా యింట్లోనుంచి తరిమెయ్యక మానను. ఎటువంటి పని చేసినా కొట్టడానికిమాత్రం నా మనస్సు వొప్పదు.

మీ రేకనక అయినట్లయితే చావకొట్టి వుందురు కాదూ! అటువంటప్పుడు కమ్యూనిస్టునని చెప్పుకొనే మీకు, పూర్వకాలపు వాళ్ళకి యేమి తేడావుంది? పూర్వపువాళ్ళు భార్యలను అస్తమానూ కొడుతూండేవారు. విషయం యిది. మీరు యికనుంచి ఒకరియా మాట యెన్నడూ నాదగ్గర యెత్తకండి. అటువంటి విషయాలలో వొకరి సలహా నాకు అవసరం లేదు. భార్య చాలా తీవ్ర సమస్య. చాలవరకు ఆమె మీద ఆధారపడి వుంటుంది." నగుల్నోవు పరధ్యాన్నంగా నవ్వేడు. మళ్ళీ తీవ్రంగా మాట్లాడడం మొదలెట్టేడు. "ఈ దేశ సరిహద్దులు తీసి పారెయ్యనియ్యండి; అప్పుడు అందరికంటె ముందుగా నేనే విదేశ స్త్రీలను మీ యిష్టం వచ్చినవాళ్ళని పెళ్ళి చేసుకోనండి,, అని బయలు దేరుతాను. అప్పుడు ప్రపంచములోని యీ వేర్వేరు జాతులన్నీ కలసిపోయి వొకడు తెలుపు, యింకొకడు పసుపు, మరియొకడు నలుపు అను భేదము, తెల్ల జాతివాడు మిగిలిన వాళ్ళకంటె గొప్పవాడనుకొనే అహంభావము నశించిపోతాయి. ప్రతివాళ్ళు యెండలో శ్రమపడి పనిచేయడంచేత బలిష్ఠములైన వొకేరంగు శరీరాలతో వుంటారు: రాత్రిలు సాధారణంగా యిలాగ ఆలోచిస్తూ యుంటాను..............."

"మకార్! మీరుకల్పనా ప్రపంచంలో విహరిస్తుంటారు." డేవిడోవు అసంతృప్తితో అన్నాడు. మిమ్మల్ని నేను అనేక విషయాల్లో అర్థం చేసుగోలేకుండా యున్నాను. జాతి విభేదాలు ..........................అది నిజమేననుకోండి. కాని మిగిలిన విషయాలు .......................... Problems of existence లో మాత్రం మీతో యేకీభవించలేను. సరే, ఆ విషయాలన్నీ మనకెందుకు! ప్రస్తుత విషయంచూద్దాం. ఈ వేళనుంచి మీ యింట్లో మకాం యెత్తేస్తున్నాను."

డేవిడోవు బల్లకిందనున్న సూట్కేసు యివతలకి లాగేడు. దాల్లో వున్న పనిముట్లు గలగలలాడుతూంటే ఆ పెట్టె తీసుకొని బయటికి వెళ్ళిపోయేడు. నగుల్నోవు అతనితోగూడా కొత్తగా తీసికొన్న బస శ్చీలిమోవు యింటికి వెళ్ళేడు. అక్కడికి వెళ్ళేవరకూ వారు తొలకరిచల్లికలను

గురించి మాట్లాడుతున్నారు. అదిమొదలు వారి పరస్పర సంబంధాలలో యే పేచీ లేకుండా సాఫీగా గడవడం ప్రారంభించేయి.

అందుచేతనే డేవిడోవు గ్రామస్థులు పశువుల్ని చంపుతున్నారని చెప్పడానికి వచ్చినప్పుడు నగుల్నోవు తనభార్య లోపలకు వెళ్ళిపోయిన తరువాతి సరదాగా మాట్లాడడం మొదలెట్టేడు.

"పశువుల్ని అన్నిటిని చంపేస్తున్నారు, ద్రోహులు!" అన్నాడు నగుల్నోవు. వాళ్ళు మాంసం తెగతిని కడుపు నొప్పితోనైనా బాధ పడడానికి అంగీకరిస్తారు కాని, పశువుల్ని సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి యివ్వడానికి మాత్రం అంగీకరించరు. మనం వొక సమావేశం యేర్పాటుచేసి ఆసభలో, 'పశువుల్ని చంపేవారిని కాల్చి చంపడానికి అనుమతి యివ్వవలసిందని' వొక రిజల్యూషను ప్యాసు చేద్దాం."

"ఏమిటి?"

కాల్చి పారేద్దాం. వాళ్ళని కాల్చి పారెయ్యడానికి యెవరి అనుమతి తీసుకోవాలి? పీపుల్సు కోర్టుకి అధికారం లేదనుకుంటాను. ఉందా? ఇద్దర్ని కనక చంపినట్లయితే, మిగిలినవాళ్ళు కళ్ళుతెరచి దోవకి వస్తారు. ఇటువంటి పరిస్థితులలో మనం యేమీ దయా దాక్షిణ్యాలు లేకుండా అతి క్రూరంగా ప్రవర్తించాలి."

డేవిడోవు నెత్తిమీది టోపీ బల్లమీద పడేసి గదిలో పచారు చెయ్యడం మొదలెట్టేడు. అతనికంఠస్వరంలో అసంతృప్తి అనిశ్చయము ప్రతిఫలిస్తున్నాయి.

"మళ్ళీ మీరు తప్పు దోవ తొక్కుతున్నారు. అది వట్టి దుడుకుతనం అనిపిస్తుంది. మకార్! మళ్ళీ ఆలోచించి చూడండి. ప్రజలు వాళ్ళ పశువుల్ని చంపుతుంటే మీరు నిజంగా వాళ్ళని కాల్చి చంపగలరా? అటువంటి పని చేస్తే సమర్థించుకోడానికి మనకేమీ చట్టాలు లేవు. సెంట్రలు ఎగ్జిక్యూటివు కమిటీ ప్యాసు చేసిన రిజల్యూషను ప్రకారంగా 'రెండు సం॥ల పైదు భూమిని స్వాధీనం చేసుకోవడం ప్రవాసం పంపడం' తప్ప మరేమీ చెయ్య

డానికి వీలు లేదు. మీరు యేకంగా చంపి పారెయ్యడానికి అనుమతి కోరుతున్నారు! నిజంగా మీరు............?"

"ఏమిటి నేను" నేను ఆ రకంకి చెందినవాడిని కాను. అస్తమానూ ప్లానులు వేస్తూ ఆలోచిస్తూనే వుంటారు. కాని ముందు ముందు మనం దుక్కి దున్నడం యెలాగ? ప్రతీవాళ్ళు సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేరేముందే యెడ్లని చంపివేసినట్లయితే యేం పెట్టి దున్నతారు?" నగుల్నోవు పెద్దపెద్ద అంగలు వేస్తూ డేవిడోవు దగ్గరికి వెళ్ళి అతని బుజంమీద చెయ్యి వేసేడు. తన బుజాల దగ్గరకు వచ్చిన డేవిడోవు కేసి చూస్తూ.

సెమియన్! మిమ్మల్ని చూస్తే విచారంగా వుంది. ఇంత. చవటబుర్ర అయిపోయింది యెందుచేత మీది? ఈ సం॥రం చల్లికలు ఆగిపోయాయి అంటే యెంత యిబ్బంది పడాలో తెలుసునా? ఆవిషయం గ్రహించలేదూ మీరు? దీనికి మూలకారకులను యిద్దరు ముగ్గుర్ని కాల్చి చంపేస్తే చాలు! భాగ్యవంతుల్ని కాల్చి పారెయ్యాలి! ఇది అంతా వారిప్రోత్సాహమే! పై వుద్యోగస్తుల అనుమతి పొందాలి." అన్నాడు.

"ఛీ! నోరుముయ్యి!"

"అదిగో! మళ్ళీ మొదలెట్టేరు!" నగుల్నోవు తలవాల్చేడు. మళ్ళీ హఠాత్తుగా తల యెత్తి పెద్ద కంఠస్వరంతో, "వాళ్ళు అందరూ పశువుల్ని నాశనం చేసేస్తున్నారు. అంతర్యుద్ధంలో మాదిరిగా అతి క్లిష్ట పరిస్థితులు వచ్చేయి. శతృవులు నలుమూలలా చెలరేగుతున్నారు. మీరు? మీ వంటి మందకొడి మనుష్యుల మూలంగానే ప్రపంచ విప్లవానికి అనుకూల పరిస్థితులన్నీ వృధా అయిపోతున్నాయి. ఇటువంటివాళ్ళు ప్రపంచ విప్లవం తీసుకువస్తారన్నది వట్టిమాట. ప్రపంచం అన్ని మూలలా భాగ్యవంతులు మనసోదర కూలీలను చిత్రహింస చేస్తున్నారు; రెడ్ చైనీయుల్ని నాలుగు మూలలనుంచి క్రమ్మి నాశనం చేసేస్తున్నారు; నల్లవాళ్ళని నేల పెట్టి రాసేస్తున్నారు. అటువంటి వర్గ శతృవుల్ని మీరు యిక్కడ దయ తలుస్తామంటారు. ఎవరేనా వింటే సిగ్గుకూడాను. భయంకర అవమానం! భాగ్యవంతులచేత అణచివెయ్య

బడుతున్న యితర దేశములలోని మన సోదరులని తలుచుకుంటే నారక్తం ఉడికిపోతూంది! భయంకరమైన ఆవార్తలు చదవడానికి యిష్టంలేక పేపరు చూడడంకూడా మానేసేను. వాళ్ళస్థితి పడుతూన్న బాధలుచూస్తే గుండెలు నీరయి పోతాయి. కాని మీరు....................., శత్రువుల చేత జైళ్ళలో త్రోయబడి మగ్గుతూన్న మన సోదరుల్ని కలలోనైనా తలుచుకుంటారా మీరు! వాళ్ళ విషయమే అక్కరలేదు మీకు!"

"వాళ్ళ విషయం అక్కరలేదూ నాకు! యింక యెప్పుడూ మాత్రం యిలాంటి మాటలు అనకూడదండి. మిమ్మల్ని చూడగా కొంచెం మతి చెలించినట్లు కనిపిస్తున్నారే! మాట్లాడితే కాల్చెయ్యాలి అంటారు, అదొక పెద్ద విషయం కాదు. — ఎవరుపడితే వాళ్ళే చెయ్యగలరు! ఏమాత్రం ప్రతిఘటన కలిగినా మీరు తీవ్రంగా పోరాడతారు. మన నీతిని బోధిస్తూ, ప్రచారం చెయ్యాలి కాని అడ్డువచ్చిన వాళ్ళందర్నీ చంపేస్తానంటే యెల్లాగ! అసలు యింతవరకు వచ్చినా యెందుకు ఊరుకున్నారు!"

"ఊరుకున్నానా?"

"ఆ — నేమీ అనుమానం లేదు. పరిస్థితులు విషమించేవరకూ కళ్ళు మూసుకొని కూర్చున్నాము; యిప్పటికైనా దానికి తగిన ప్రతిక్రియను ఆలోచించాలి కాని, కాల్చి చంపేస్తానంటే లాభంలేదు. అవసరం వచ్చినప్పుడు ఇదివరకు చేసేరు ఆ పని. ఇప్పుడు యెంతసేపూ ప్రజలలో తీవ్రంగా ప్రచారం కావాలి మీటింగుకి వెళ్ళిపోదాం రండి; అప్పుడే ఆలస్యం అయింది పశువులను చంపకూడదని ప్రజలలో బాగా ప్రచారము చేయాలి."

"నిన్న రోజల్లా నేను ప్రతి యింటికీ వెళ్ళి వాళ్ళకి బాగా బోధించేను"

"ఇదీ చెయ్యవలసిన పని. మళ్ళీ యింకోసారి వెడదాం. మనం అందరం కలిసి."

"మళ్ళీ వెడతారా! నిన్న ఒకరి యింట్లోనుంచివస్తూ వాళ్ళకి బాగా నచ్చచెప్పేను. యింక పశువుల్ని చంపరు.' అనుకున్నాను. ఇంతలో ఆయిల్లు

దాటకుండానే వాళ్ళు చంపుతూన్న పంది అరుపు వినబడింది. అంతక్రితమే వాళ్ళకి ప్రపంచ విప్లవాన్ని గురించి, కమ్యూనిజాన్ని గురించీ బోధించేను. యెల్లా మాట్లాడేననుకున్నారు! ఆ మాటలకి నాకే కళ్ళనీళ్ళు వచ్చేయి. అంత అల్లా చెప్పినా లాభం లేకపోయింది. బండియెద్దు ముల్లు కర్రతో చెపితే వింటుందికాని నచ్చచెబితే వింటుందా? వీళ్ళని నెత్తిమీద మొట్టి 'భాగ్యవంతుల మాటలు వినకురా గాడిదా! వాళ్ళలా ఆస్తి పోగుచేసుకోవాలనే దుర్బుద్ధి వొదిలెయ్యి. పశువుల్ని చంపేసేవంటే, చిత్రవధ చేస్తాను. జాగ్రత్త' అని చెప్పాలి. వాడు 'యుద్ధనేకాదా చంపుతున్నాను' అనుకుంటాడు కాని నిజముచేత వాడు ప్రపంచ విప్లవాన్ని దూరము జేస్తున్నాడన్న మాట."

"కొంతమందిని శిక్షిస్తె మిగిలిన వాళ్ళు సులవుగా లొంగుతారు." అన్నాడు డేవిడోవు.

వాళ్ళు వీధులోకి వచ్చేరు. దట్టంగా కురుస్తున్న మంచు కాళ్ళకింద పిసపిసలాడుతూంది. చీకటి గాఢాంధకారం. ఆ చీకట్లోనే వాళ్ళు స్కూలు దగ్గరకు వచ్చేరు. మీటింగుకి గ్రామస్తులలో సగంమంది మాత్రం వచ్చేరు. ప్రజలు బుద్ధిపూర్వకంగా చేసే జంతు వధను ఆపడానికి పీఠుల్ని కమిషార్లు నిర్ణయించిన శిక్షాస్మృతి రజ్మట్నోవు చదివి వినిపించేడు. అతని తరువాత డేవిడోవు మాట్లాడేడు. అతడు వుపన్యాసం అయిపోయిన తరువాత ఆఖరున యిల్లా అని చెప్పేడు:

"సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేరడానికి కొత్తగా 26 గురు దరఖాస్తులు పెట్టేరు. రేపు మీటింగులో, భాగ్యవంతుల మాటలు విని మోసపోయి పశువుల్ని చంపేసినవారిని యేరి వారి దరఖాస్తులు తోసేసి, మిగిలిన వారిని మాత్రం చేర్చుకుంటాము."

"ఇంతక్రితమే సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేరినవాడు చంపుతాడనుకోండి; వాడిని యేం చేస్తారు?" అని అడిగేడు లుబిష్కిన్.

"వాళ్ళనికూడా బయటికి గెంటేస్తాము!"

సభలో గుసగుసలు బయలుదేరేయి.

"అలాగ అయినట్లయితే సమిష్ఠి వ్యవసాయ క్షేత్రమే యెత్తెయ్యవలసి వస్తుంది. ఈ వూరు మొత్తంమీద అటువంటివాడు ఒక్కడూకూడా లేడు." అన్నాడు బోర్షెవు.

నగుల్నోవు పిడికిళ్ళు బిగించి అతని మీదికి వురికేడు.

"నిన్ను యెవరూ మాట్లాడమనలేదు. నోరుముయ్యి! సమిష్ఠివ్యవసాయ క్షేత్రాన్ని గురించి నువ్వు మాట్లాడవలసిన అవసరం లేదు. నీ సలహా అవసరం లేకుండానే మేము నిర్వహించుకోగలం. నీగిత్తదూడని నువ్వేంచెయ్యాలేదనుకుంటాను, అవునా?"

"నా దూడల్ని నాకు తోచినట్లు చెయ్యగలను."

"అ—అల్లాగా! రేపు నిన్ను సైబీరియాకి పంపించినప్పుడు, అక్కడ నీ యిష్టం వచ్చినట్లు చేద్దువుగానిలే!"

"అంత తొందరా! వొకొక్కప్పుడు విషమిస్తుంది జాగ్రత్త" అని యెవడో కేకేసేడు.

మీటింగుకి ప్రజలు చాలామంది రాకపోయినా చాలా గందరగోళంగా వుంది. మీటింగు పూర్తి అయినతరువాత అంతా నిశ్శబ్దంగా బయటికి వెళ్ళేరు. అక్కడ యెవరి యిళ్ళకి వాళ్ళు వెడుతూ గుంపులు గుంపులుగా చేరి మాట్లాడుకోనడం మొదలెట్టేరు.

"తొందరపడి అనవసరంగా రెండు గొర్రెల్ని చంపేసేను." అని సమిష్ఠి వ్యవసాయ క్షేత్ర సభ్యుడైన 'సెమియన్ కుర్షునోవు' లుబిష్కిన్‌తో అన్నాడు.

"అన్నీ తెలిసిన నేనుమాత్రం యేం చేసేను? ఒక మేకని చంపేసేను" లుబిష్కిన్ నిట్టూర్పు విడిచేడు. "సభలో నిలబడడానికే చిన్నతనంగా వుంది. దీనికంతకీ నా భార్యే కారణం. దీన్ని తగలెయ్య? 'చంపు' 'చంపు' అని వేధించుకు తినేసింది! మాంసం తినాలని ఉందిట! దొంగముండ! ఇంటికి వెళ్ళనీ పళ్ళు వూడకొడతాను!"

"ఆడవాళ్ళకి యేం తెలుసును; నెమ్మదిగా బోధించాలి మనం" అంటూ ష్కిన్ మామగారు అకీమ్ బెస్ఖిబ్నోవు అతనికి సలహాయిచ్చేడు. "సమిష్టివ్యవసాయ క్షేత్రంలో సభ్యుడవు. నువ్వు అలా చేయడం బాగుండదు."

"అకీమ్! నువ్వు నీ దొరయెద్దుని చంపేసేవుట కాదూ?" అన్నాడు అతని యింటిపక్కనే నివసించే డెమ్కా ఉషాకోవు.

"అవునోయ్— అబ్బాయి గానేను అంతకింతా నేను యేం చెయ్యను చెప్పు? దాన్ని చంపెయ్యా అది కాలు విరగ్గొట్టుకుంది! కెన్న అంటే ఆకే. సుమా — పూరికేపుణ్యానికి యెక్కడో మూలవున్న పాతరగొయ్యి దగ్గరకు వెళ్ళి దాల్లోబడి కాలు విరగగొట్టుకుంది."

"తెల్లవారుఝామున నోళ్ళ, నీకోసం, కర్రలు పుచ్చుకొని గాన్ని పాతరవైపు తోలడం నేను చూసేను...."

"ఆ— యేమిటీ? డెమ్కా,— యేమంటున్నావు? ఎప్పుడూ అలాగంటి తెలిసీ తెలియని మాటలు చెప్పకేం." గుసరి అకీమ్ తోటాకొంగి హఠాత్తుగా నడివీధిలో అలాగే నిలబడి కన్నుకొనరాని గాయిచీకట్లోక రెప్పలార్పుస్తూ చూస్తూన్నాడు.

"తాతా, గానోయ్!" అన్నాడు డెమ్కా. "మైంకగారిలా నడివీధిలో అలాగ నిలబడ్డావెందుకు? నీ అంతట నువ్వే యెద్దుని పాతర గోతిలోకి తోలి........"

"డెమ్కా! యెద్దు దానంతట అదే వెళ్ళింది. అలాగంటి మాట లెప్పుడూ అనకు! మహాపాపం!"

శీతగాలి చెలరేగింది. నదికి యిరువైపులా దట్టంగా వ్యాపించియున్న పాప్లారు చెట్లు, విల్లో చెట్లు, హోరుమని ధ్వనిచేస్తూ వురూత్రిలూగి పోతున్నాయి. ఎటు చూచినా చీకటి గాఢాంధకారం. కురుస్తూన్న మంచుకు హద్దూ—పద్దూ లేదు. శీతకాలం అఖరు సారి తన ప్రతాపమంతా చూపిస్తూంది.

## పదునారవ ప్రకరణము.

## హత్యా ప్రయత్నము.

మీటింగు అయిపోయిన తరువాత దేవిడోవు, రజ్మటోన్నవులు కలిసి బయటికి వచ్చేరు. మంచు దట్టంగా కురుస్తూంది. అక్కడక్కడ తలుపు సందుల్లోనుంచి దీపాలు మినుకు మినుకుమని కనిపిస్తున్నాయి. యెక్కడో మోర యెత్తి అరుస్తున్న కుక్క అరుపు వినిపిస్తోంది. పొలాలమీద మంచు నిలకట్టడాన్ని గురించి థారోవు లూకుచ్ చెప్పిన సలహా జ్ఞాపకం వచ్చి, దేవిడోవు నిట్టూర్పు విడిచేరు. "ఈ సంగారానికి మనం అలా చెయ్యలేము. ఇటువంటి తుపాను పట్టింగంటే యెంత మంచు పడుతుంది నేలమీద! అంతాకూడా వృధాగా పోతుంది. ఏం జేస్తాం."

"తబేలా దగ్గరకు వెళ్ళి, గుఱ్ఱాలని వొకసారి చూచి వెళ్ళిపోదం!" అన్నాడు రజ్మటోన్నవు.

"సరే, నడవండి"

వాళ్ళు వొక పక్క సందులోకి మళ్ళేరు. దూరాన్ని వెలుతురు కనిపించింది. తబేలాగా మార్చబడిన లోప్షినోవు పాక వెనుక వొక లాంతరు వేళ్ళాడుతూంది. ఇద్దరూ అక్కడికి వెళ్ళేరు. గుమ్మం దగ్గర పంచదార యేడు, యెనమండుగురు కోసక్కులు నిలబడివున్నారు.

"ఈ వేళ డ్యూటీమీద యెవరున్నారు?" అని అడిగేడు రజ్మటోన్నవు. అక్కడ నిలబడియున్న కోసక్కులలో వొకడు సిగరెట్టుపారేసి కొలిబూటు* తో రాసేసి, కోండాన్రిట్ షైడనికోవు అని సమాధానం చెప్పేడు.

"ఇక్కడ ఇంతమంది మూగేరెందుకు? మీరంతా యేం చేస్తున్నారు ఇక్కడ!" అని దేవిడోవు అడిగేడు.

"కామ్రేడ్ దేవిడోవు.......................పూరికేనే నిల

బడి సిగరెట్లు కాల్చుకుంటున్నాము."

"ఇప్పుడే గడ్డి తీసుకువచ్చి పడేసి నిల్చున్నాము."

"సిగరెట్లు కాల్చుకుంటూ ఇక్కడి మాట్లాడుకుంటున్నాము. మంచు కురవడం తగ్గుతుందేమోనని చూస్తున్నాము వెళ్ళిపోవడానికి."

గుర్రాలు గడ్డి నమలు చప్పుడు వినిపించింది. గుర్రపు లద్దెలు,— పుచ్చు వాసన కొడుతూంది. ఒకమూల కొయ్యలను గుర్రపు సామానులు వేళ్ళాడుతున్నాయి. నేల అంతటా తుడిచి వుంది

"మైదనికోవ్!" ఆండ్రీ కేకేసేడు.

"ఆ— వస్తున్నా" [illegible] ము వినబడింది.

మైదనికోవ్ రాగోలు కర్రతో కట్టగడ్డి తీసుకు వస్తున్నాడు. తొట్టె దగ్గరనుంచి నాలుగవ అరలోనున్న నల్లగుర్రం దగ్గరకి వెళ్ళి బూటుతో దాన్ని లేవగొట్టి గాడిలో గడ్డివేసేడు.

"అల్లాగ లడ్డావేమి!" అంటూ కునికిపాట్లు పడుతూన్న గుర్రాన్ని రాగోల కర్రతో కొట్టేడు. గుర్రం త్వరత్వరపాటుతో డెక్కలు ఎత్తివేస్తూ సకిలించి గాడిలోకి తల పెట్టింది. కొండ్రాట్ దేవిడోవ్ దగ్గరకువచ్చి పని చేత మోటుబారిన చెయ్యి అందరికీ జాపేడు.

"కామ్రేడ్ మైదనికోవ్! పనులెల్లా జరుగుతున్నాయి."

"అన్నీ సవ్యంగానే జరుగుతూన్నాయి"

"బయట వాళ్ళెవరూ చేరలేదుకదూ?"

"వాళ్ళనే అడగండి" అతని స్వరంలో ఒకవిధమైన అసంతృప్తి ప్రతిధ్వనించింది. "రాత్రి నేను గుర్రాలకి గడ్డివెయ్యడానికి రాగానే వాళ్ళంతా ఇక్కడకి చేరుతారు. వాళ్ళ గుర్రాల్నీ పశువుల్నీ సమిష్టి వ్యవసాయక్షేత్రం అధీనం చేసినా మనవి అనే ఉద్దేశ్యం ఇంకా వదలలేదు వాళ్ళకి. బయట నిలబడ్డవాళ్ళంతా వాళ్ళ గుర్రాల్ని బాగా మేపుతానో లేదో అనిచూడడానికి వచ్చినవాళ్ళే. వాళ్ళు వచ్చి "నా గుర్రానికి గడ్డివేసేరా?", "మాపంచపు

గుర్రాన్ని బాగా మేపుతూన్నావా?" "మా ఆడగుర్రం చిక్కిపోలేదు కదా!" అని వేధించుకు తినేస్తారు.. వాటిని మేపక మడ్డి యెండకడుతున్నామనుకున్నారా! వాళ్లకి సమాధానం చెప్పలేక చచ్చిపోతున్నాను. 'గుర్రాలకి గడ్డివెయ్యడానికి మేముకూడా సహాయం జేస్తాము. ఉండు,' అంటూ వాళ్లంతావచ్చి తలొక సందెడు గడ్డి తీసుకుపోయి, యెవరి గుర్రాలకి వాళ్లు చాలాగడ్డి వేస్తూంటారు. ఇల్లా అయితే బాగులేదు. అవసరం లేనివాళ్లు ఎవళ్లూ కూడ ఇక్కడికి రాకూడదని రిజల్యూషనుఒకటి ప్యాస్ చెయ్యాలి."

"విన్నారా?" ఆండ్రీ రెప్పలు ఆర్పుతూ దేవిడోవు వైపు చూసేడు.

"వెంటనే వాళ్లనందర్నీ వెళ్ళిపొమ్మని చెప్పండి." దేవిడోవు ఆజ్ఞాపించేడు. "అవసరమైనవాళ్ళు తప్ప పైవాళ్లు యెవరూ ఇక్కడ ఉండడానికి వీల్లేదు. ఒక్కొక్క గుర్రానికి ఎంతగడ్డివేస్తారు! తూచివేస్తూటారా?"

"తూచడంలేదు. ఉజ్జాయింపుగా ఒక్కొక్కదానికి అరవూడు వేస్తూంటాను."

"అన్నిటికీ కూడా పక్కకి గడ్డి వేస్తున్నారా?"

"ఎందుకు వెయ్యడం" కోంద్రాట్ కోపంతో తల పంకించేడు. నల్లటిజుట్టు, మెడమీద చిరిగిపోయిన అతనికోటు మీదపడి చిందింది. "మన మేనేజరు అప్రోవునోవు, యాకోవు లూకిచ్ అన్నమాట, నాదగ్గరకి వచ్చి గుర్రాలుతిని దిగపెట్టినగడ్డి వాటి పక్కకి వేస్తూండు." అని చెప్పేడు. ఇది మంచి ఆజ్ఞయేనా! అతను చాలా తెలివైన వ్యవసాయదారు అనుకుంటున్నాము. చూడండి ఎల్లాంటి ఆజ్ఞలు ఇస్తున్నాడో!"

"ఏమి? దాల్లో తప్పేముంది?"

కామ్రేడ్ దేవిడోవ్! అది తప్పే. గుర్రాలు వదిలేసే గడ్డి అంతా మంచిదే. గొర్రెలకి, మేకలకి, వేస్తే ఒక్క పరకకూడా దిగపెట్టకుండా తినేస్తాయి. అల్లాంటి గడ్డిఅంతా గుర్రాలకి పక్క వెయ్యమన్నాడు. దీనినిగురించి

ఆయనతో చెప్పేను. కాని నువ్వునాకు సలహా యివ్వవచ్చేవా అని కసరి కొట్టేరు."

"మీరు చెప్పినదే బాగుంది. ఆగడ్డి పక్క వేయకండి. రేపు అతన్ని ఒకతట్టువరస చీవాట్లు పెడతాను." అన్నాడు డేవిడోవు,

"ఇంకొక విషయంవుంది: గడ్డి ఆ నూతివారనున్న మేటిలోనుంచితీసి వెయ్యమని చెప్పేరు. ఆలాఎందుకో నాకు అర్థం అవలేదు."

"యాకోవు లూకిచ్, ఆగడ్డి అంత మంచిది కాదని చెప్పేడు. ఈ శీత కాలంలో ఆ గడ్డితో మేపి, తొలకరి దుక్కులనాటికి మంచి గడ్డి ఉంచుతే బాగుంటుందని చెప్పేడు."

"ఆ ఆలోచన బాగానేవుంది. కాని ఉపయోగించే గడ్డి పక్కకి వెయ్యమనడాన్ని గురించి మాత్రం చెప్పండి"

"ఓ తప్పకుండా చెబుతాను. ఈ లెనిన్‌గ్రాడు సిగరెట్టు కాల్చి చూడండి. చాలా బాగా ఉంటుంది." డేవిడోవ్ దగ్గేడు. "నా స్నేహితులు పంపించేరు.............................. గుర్రాలన్నీ సరియైన స్థితిలో ఉన్నాయి కాదూ!"

"వందనాలు. నిప్పుకూడా యివ్వండి మరి. గుర్రాలన్నీ బాగానే వున్నాయి. మనప్యారీగుర్రం-- లాప్షినోవు దగ్గర తీసుకున్నది -- అదిమాత్రము రాత్రి జబ్బుచేసి లేవలేకపోతే వెంటనే మందులు పోసేను. అదిమినహాగా మిగిలినవన్నీ సరియైన స్థితిలోనే వున్నాయి. ఒకగుర్రపుపిల్ల రాత్రులు కూడా పడుకోకుండా నిలబడే వుంటోందిట. అసలు పడుకోవడమే లేదని చెప్పేరు. రేపు గుర్రాలకన్నిటికి ముందర కాళ్ళకి నాడాలు కొట్టించేద్దాం. బాగా అరిగిపోయి కాళ్ళు జారిపోతూన్నాయి. సరే వెళ్ళండి. అప్పుడేచాలా పొద్దుపోయింది. ఇంకా గుర్రాలదగ్గర నాకు చాలా పనుంది."

రజ్మత్నోవు డేవిడోవ్‌తో కలసి తనఇంటివైపు బయలుదేరేడు. కాని ఒక వీధి మలుపులో 'లూకా ఛిబాకోవ్' ఇంటి ఆవరణ దగ్గర రజ్మత్నోవు ఆగి డేవిడోవ్‌ని స్పృశిస్తూ అక్కడ చూడండి అన్నాడు నెమ్మదిగా.

వారికి మూడు బారల దూరంలో దడి గుమ్మం దగ్గర వొకమనిషి నీడ కనిపిస్తూంది. రజ్మెట్నోవు గభాలున అతనివైపు పరుగెత్తేడు. కుడిచేత రివాల్వరు పుచ్చుకొని, యెడమ చేతితో గుమ్మం పక్కని నిలబడియున్న ఆమనుష్యిని పట్టుగున్నాడు.

"లూకా, నువ్వేనా!"

"ఆండ్రీ రజ్మెట్నోవు! ఇల్లా వచ్చేవేమిటి?"

"ఆ కుడి చేతిలో యేమిటి ఉంది? అది యీలా యిచ్చెయ్య త్వరగా!"

"కామ్రేడ్. రజ్మెట్నోవు! యేమిటి యిదంతా?"

"ముందు అది యిచ్చెయ్య లేకపోతే కాల్చేస్తా!"

ఈ మాటలు విని దేవిడోవు కూడా వచ్చేడు. "ఏమిటి అతన్ని ఇమ్మని అడుగుతూన్నారు?" అని అడిగేడు.

"లూకా! యిచ్చెయ్య. లేకపోతే కాల్చేస్తున్నాను!" రజ్మెట్నోవు తీవ్రంగా అన్నాడు.

"ఇదుగో, తీసుగో అంత కోపంగా వున్నావెందుకు?"

"చూడండి, గుమ్మం దగ్గర చేత, యేం పుచ్చుకొని నిలబడ్డాడో! ఇంత రాత్రివేళ కత్తి పుచ్చుకొని యెందుకు నిలబడ్డావు యిక్కడ? యెవరికోసం కాచుకొని ఉన్నావు? దేవిడోవ్ కోసమా? ఏం మాట్లాడవేం, కత్తి పుచ్చుకొని యెందుకు నిలబడ్డావు? చంపడానికి చూస్తున్నావా? ఏమిరా ద్రోహీ!"

దడివార నిలబడ్డవాని చేతులో కత్తి వుండడం రజ్మెట్నోవు కాక ఇంకొకడయినట్లయితే కనుక్కో లేకపోయి ఉండును. ఆకత్తి లాక్కోవడానికి రజ్మెట్నోవ్, మీదికి వురికేడు. లూకా నిర్ఘాంతపోయి తెలివి తెచ్చుకొని తలుపు తెరచి,

"మీరు అపోహ పడుతూంటే యింక నేను వూరుకుంటే విషమిస్తుంది. అసలు విషయం యేమిటో మీకే తెలుస్తుంది. ఆండ్రీ స్తెఫినోవిచ్;

నా వెనక రండి!"

"ఎక్కడికి?"

"గొర్రెల దొడ్లోకి"

"ఎందుకు?"

"రండి, కత్తి పుచ్చుకొని నేను గోడ్డవారి యెందుకు నిలబడ్డానో మీకే తెలుస్తుంది."

"నడవండి చూసివద్దాం" అంటూ డేవిడ్లోవు లూకా దొడ్లోకి ముందుగా నడుస్తూ రజ్నటోవ్ తో

"నా వెనక రండి." అన్నాడు.

గొర్రెల పాకలో ఒక బల్లమీద లాంతరు వెలుగుతూంది. పక్కనే పిడకలపోగు వుంది. లూకా భార్య కూస్సుని యేదో చేస్తూంది. గుండ్రటి ముఖం, విశాలమైనకళ్ళు, తీర్చి దిద్దినట్లున్న కనుబొమలు, మొత్తంమీద ఆమె అందమైనదే. కొత్తవాళ్ళని చూడగానే ఆమె గభాలున లేచి నిలబడింది. ఆమె యెదుట రెండు బిందెల నీళ్ళు పక్కన గోడవార నీళ్ళతో నున్న పళ్ళెము ఉన్నాయి. కుడిచేతివైపున మూలలో ఒక బలిసిన పంది గడ్డిమీద నిలబడి యెదుటనున్న పెద్ద తొట్టెలోని కుడితి తాగుతూంది.

"మూలకారణం యేమిటో యిప్పుడు చూడండి." లూకా ఒకమాటకి ఒక మాటకి సంబంధం లేకుండా అని పందికేసి చూపించేడు. "ఈ పందిని రహస్యంగా చంపెయ్యడానికి నిశ్చయించేము. నా భార్య దానికి కుడితి పోస్తూంది. నేను దానినికిందపడత్రోసి చంపుదాం అనుకుంటున్నాను. ఇంతలో వీధులో యెవరివో మాటలయేయి. వీధులో యెవరైనా నేను పందినిచంపడం కనిపెడుతున్నారేమోనని అనుమానం కలిగింది. ఇప్పుడు నేనున్నట్లే చొక్కా చేతులు పైకి తీసి, తుండుగుడ్డ వొకటి కప్పుకొని చేతిలో కత్తితో దగ్గరకు వెళ్ళేను. మీరు కనుపించేరు. నేను యెందుకు నిలబడ్డానను కున్నారు అక్కడ? ఎవరినైనా చంపడానికి వెళ్ళేవాడు చేతులు యెత్తిపి బట్ట కప్పుకొని వెడతాడా?" లూకా పైమీది తుండుగుడ్డ తీసేసి వెకిలిగవ్వు నవ్వి,

భార్యవైపు తిరిగి “యెందుకు యింకా అక్కడ నిలబడ్డావు? ఆ పందిని బయటికి తోలెయ్యి.” అన్నాడు.

“దీనిని చంపకు, ఇప్పుడే పోకమీటింగు అయి వస్తున్నాము; జంతువుల్ని వేటినీకూడా చంపడానికి వీలులేదు.” అన్నాడు రజ్మట్నోవు.

“అల్లాగే లెండి ఇంక చంపను. నా మనస్సు తిప్పేసేరు.........” అక్కడినుంచి యింటికి వచ్చేవరకూ దోవపొడుగునా డేవిడోవ్ అండ్రీతో వేళాకోళం ఆడుతూనే వచ్చాడు.

“సమిష్టి వ్యవసాయ క్షేత్రపు చైర్మన్ ప్రాణాలు రక్షించేరు! ఒక విప్లవ వ్యతిరేకిని నిరాయుధునిగా చేసేరు! దెబ్బకి రెండుపక్షులు! ఓహోహో!!”

“పంది ప్రాణాలు కాపాడేను!” రజ్మట్నోవు పరిహాసంగా జవాబు చెప్పేడు.



# పదిహేడవ ప్రకరణము.

## చికిత్స.

మరునాడుదయం గ్రెమ్యాచీ 'న్యూక్లియస్' సమావేశమయింది. ఆ సమావేశములో, గ్రెమ్యాచీ స్టాలిన్ సమిష్టి వ్యవసాయ క్షేత్ర సభ్యుల జంతువులనన్నిటిని సమాజపరం చెయ్యాలని తీర్మానించ బడింది. పశువులు, గుర్రాలు, గొర్రెలు మొదలయినవే కాకుండా కోళ్ళు, బాతులుకూడ సమాజపరము చెయ్యాలని తీర్మానించబడింది.

మొదట కోళ్ళు, మొదలయిన వాటిని కూడా సమాజపరం చెయ్యాలనే తీర్మానాన్ని దేవిడోవ్ తీవ్రంగా ప్రతిఘటించేడు. కాని నగుల్నోవ్ యొక్క పట్టుదలవల్ల రజ్మెట్నోవ్ కూడ అతనిని సమర్థించడంవల్ల కొంతసేపటికి అంగీకరించేడు.

అంతేకాకుండా జంతువధ పూర్తిగా ఆపు చెయ్యడానికి పార్టీ సభ్యులందరూ గ్రామములో ప్రతి యింటికి తిరిగి తీవ్ర ప్రచారం చెయ్యాలని కూడ నిశ్చయమయింది. ఎన్ని చెప్పినా వినకుండా జంతువులను చంపేవారి మీద అప్పటివరకు యేమియు చర్య తీసికొనక, ప్రచారంవల్ల ఎటువంటి ఫలితం కలిగేది పరీక్షించి చూడడానికి నిశ్చయించేరు.

"ఈలా అయినట్లయితే పశువులు, కోళ్ళు, చంపడం తగ్గుతుంది. లేకపోయినట్లయితే వేసవినాటికి గ్రామంలో యెక్కడాకూడ ఒక్క ఆవుఅరుపు కాని కోడికూతగాని వినబడదు." అన్నాడు నగుల్నోవ్ ఉత్సాహంగా, తీర్మానాలు వ్రాసిన కాగితం మడచి పెడుతూ.

పశువులు, గుర్రాలు, అంతక్రితమే సమాజపరంచేసి ఉండడంచేతను, 'జంతువులన్నిటిని సమాజ పరం చెయ్యాలి.' అన్న తీర్మానంవల్ల ఒక్క పందులు, గొర్రెలుమాత్రం సమాజపరం చెయ్యవలసి రావడంచేత సమిష్టి వ్యవ

సామూహిక క్షేత్ర సభ్యుల సాధారణ సమావేశంలో ప్రతిఘటన లేకయే ఆ తీర్మానం ఆమోదించబడింది. కొన్ని కోళ్ళనుకూడ సమాజపరం చెయ్యాలి అన్న సవరణమీదమాత్రం తీవ్రమయిన చర్చ జరిగింది. ఆసవరణకి స్త్రీలు అందరూకూడ ప్రతికూలురే. చాల చర్చ జరిగినమీదట అతి కష్టంమీద వాళ్ళుకూడ అంగీకరించేరు. దానివల్ల కలిగే కష్టసుఖాలు బాగా విప్పిచెప్పి, ఆడవాళ్ళని అంగీకరింప జేసినవాళ్ళలో ముఖ్యుడు నగుల్నోవ్.

"సోదరీమణులారా! కోళ్ళమీద, బాతులమీద మీ మమకారం వదలి పెట్టండి. ఇంతవరకూ మాకు ప్రోత్సాహం యిచ్చి ముందుకు నడిపించినమీరు యికపైకూడా అటువంటి ప్రోత్సాహం యిస్తారని తలుస్తాను. కోళ్ళనికూడా సమిష్టి వ్యవసాయ క్షేత్రంలోనే వుండనివ్వండి. వచ్చే వేసవినాటికి 'ఇంకు బేటరు' ఒకటి కొందాం; దానివల్ల కొద్దికాలంలో వందలకొలది కోడి పిల్లల్ని ఉత్పత్తి చెయ్యవచ్చు. ఆ 'ఇంకుబేటరు' అనేది కృత్రిమంగా వేడి కలిగించి గుడ్లని పొదిగే ఒకవిధమైన యంత్ర సాధనం. అందుచేత మీరు పట్టుదల వదులెయ్యమని కోరుతున్నాను. సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో ఉన్నప్పటికీ అవి యెప్పటికీ కూడా మీవే. కాని సమిష్టి వ్యవసాయ క్షేత్రంయొక్క సంరక్షణలో మాత్రం ఉంటాయి. అసలు యిప్పుడు మీకు కోళ్ళ వుపయోగం యేమివుంది? ఇప్పుడవి యెల్లాగా గుడ్లుపెట్టవు. వేసవివరకూ వాటితో మీరు యెంత బాధ పడాలో ఆలోచించండి: దొడ్డింతా తిరుగుతూ యేం వల్లినా తినేస్తూంటాయి. ఎవరూ చూడకుండా యే మూలమూలనో గుడ్లుపెడతాయి. లేకపోతే యే మానుపిల్లేనా పొంచుని మీదపడి చంపెయ్యవచ్చు. ఒకటేమిటి, అనేక బాధలున్నాయి. ప్రతిరోజూ వాటి గూళ్ళలోకి దూరి యే కోడి గుడ్లు పెట్టిందో అని చూస్తూండాలి. వాటికి గోమారు పట్టకుండా చూస్తూండాలి. వాటివల్ల శ్రమతప్ప మీకు యేమీ లాభం లేదు. కాని అవి సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో యెల్లావృద్ధిపొందుతాయో తెలుసునా? మహా ఆనందంగా ఉంటుంది! మన '[illegible]' వంటి యే ముసలివాడినో వాటిని చూస్తూండమని ఏర్పాటు చేస్తాము. అతడు వాటిని మేపుతూ కాల

క్షేపం చేస్తూంటాడు. బరువు పనులు చెయ్యలేని ముసలివాళ్ళకి అటువంటి తేలిక పనులు చెబితే మహా సంతోషంతో శ్రద్ధగా చేస్తారు. అందుచేత మీరంతా మా సలహా అంగీకరించ వలసినదని కోరుతూన్నాను."

ఆడవాళ్ళంతా నవ్వేరు. వాళ్ళలో వాళ్ళు కూడబలుక్కొని చివరకు అంగీకరించేరు.

సమావేశం పూర్తి అయిపోగానే నగుల్నోవు, దేవిడోవులు గ్రామంలో ప్రతి యింటికి వెళ్ళి చూడడానికి బయలుదేరేరు. వారి విచారణనిబట్టి ప్రతి యింట్లోను, కొద్దో, గొప్పో మాంసం వున్నట్లు తేలింది. ఆఖరికి వాళ్ళు ఖూకర్ ఇంటికి వచ్చేటప్పటికి మధ్యాహ్నం భోజనాల వేళ అయింది.

"ఇతడు మొదటినుంచీ సమిష్టి వ్యవసాయ క్షేత్రం కావాలని అన్న వాళ్ళలో ఒకడు. ఇతడు దేనినీ కూడా చంపి యుండడు." అన్నాడు నగుల్నోవు, ఖూకర్ యింటి గుమ్మాలు యెక్కుతూ దేవిడోవుతో.

వాళ్ళు లోపలికి వెళ్ళేటప్పటికి ఖూకర్ కాళ్ళు ముడుచుకొని వెల్లకిలా పడుకొని వున్నాడు. కోటు గడ్డం వరకూ పైకి మడిచివేసి వుంది. పెద్ద కుండపిడత నోటి పెట్టుగిన్నెలతోసహా అతని పొట్టమీద బోర్లించివుంది. పొట్టకి రెండుపక్కలా రెండు గ్లాసులు జలగల్లా అంటిపెట్టుకొని వున్నాయి. దేవిడోవు, నగుల్నోవులు రావడం అతడు చూడలేదు. వణుకుతూన్న చేతులు గుండెలమీద పెట్టుకొని చచ్చినట్లు పడియున్నాడు. కళ్ళు గుంటలుపట్టి వున్నాయి. నగుల్నోవుకి ఆ యింట్లో శవం కుళ్ళిన వాసన వేస్తూన్నట్లు అనిపించింది. ఖూకర్ భార్య గడ్డబొద్దులా స్టౌ పక్కని నిలబడియుంది. మమిఛికా యేదో గొణుగుతూ మంచం చుట్టూ తిరుగుతూంది. ఆ జిల్లా అంతటా ఆమె పేరు యెరగని వాళ్ళు యెవరూ లేరు. విరిగిపోయిన యెముకలు అతకడంలోనూ, గాయాలు కుదర్చడంలోనూ, ఒకటేమిటి — అన్నివిధాల రోగాలు కుదిర్చడంలోనూ, చాలా నేర్పరి. వీటి అన్నిటికంటేనూ, కడుపు దింపడంలో సిద్ధహస్తురాలు. అటువంటివి ఆమె చేతిమీదుగా యెన్ని అయేయో లెక్కలేదు. ఇప్పుడు ఖూకర్ రోగం కుదర్చడానికి వచ్చింది ఆమెయే.

డేవిడోవు యిల్లు నాలుగుమూలలా కలియచూసి "తాతా! క్షేమంగా వున్నావా. ఆ పొట్టమీద పెట్టింది యేమిటి!" అన్నాడు.

"అబ్బా! పొట్ట నరాలు బిగపట్టేయి. — చచ్చిపోతున్నాను." అని అతి ప్రయత్నంమీద సమాధానం యిచ్చేడు. వెంటనే సన్నని కంఠంతో మూలుగుతూ "ఈ పిడత తీసియ్యి! నిన్నే, ముసలిముండా! మాట్లాడవేం" అన్నాడు.

"అంత తొందరపడితే యెల్లాగ? ఒక్క నిముషంఆగు." అని ఘూకర్ తో నెమ్మదిగా చెబుతూ చర్మాన్ని గట్టిగా అంటిపెట్టుకొని యున్న కుండ పిడత లాగటానికి ప్రయత్నం చేస్తోంది.

కాని ఘూకర్ పెద్ద గోల పెడుతూ ఆమెని కాలితో తన్నిపారేసి, రెండు చేతులతోనూ కుండ గట్టిగా పట్టుకున్నాడు. డేవిడోవు అతని సహాయానికి గబగబా వచ్చేడు; స్టౌ దగ్గర పడియున్న కర్ర తీసుకొని ఆ ముసలి దానిని గెంటేసి కుండమీద ఒక్క దెబ్బ కొట్టేడు. కుండ ముక్కలుముక్కలయిపోయింది. గాలి రయ్యిమని లోపల ప్రవేశించింది. ఘూకర్ వొక్క సారి వెక్కి వొగరుస్తూ, "అబ్బ; బతికేను" అనుకున్నాడు. రెండు పక్కల నున్న గ్లాసులు లాగి పారేసేడు. డేవిడోవు పగిలిపోయిన కుండ పెంకులమధ్య ఎత్తుగా కనిపిస్తూన్న అతని బొడ్డుచూసి, పకపకా నవ్వుతూ అక్కడనున్న బెంచీమీద కూలబడ్డాడు. కళ్ళ నీళ్ళు కమ్మేయి. టోపీ కింద పడిపోయి నల్లటి అతనిజుట్టు నుదురుమీద పడింది.

తనకుండ బద్దలు కొట్టడంచేత మమిఖికా వెర్రి ముఖంవేసి యేడవడం మొదలెట్టింది. ఘూకర్ కోటు సరి చేసుకొని మంచము మీదనుంచిలేచేడు.

"ఏమిరా! ముసలి పీనుగా!" ఆమె యేడుస్తూ మధ్య మధ్య తిట్టడం మొదలెట్టింది. "ఇవి అన్నీ యిల్లా బద్దలుకొడతావురా! నీవంటివాళ్ళకి ఉపకారం చెయ్యబోతే ఇంతకంటె యెక్కువ చేస్తావా!"

"ఇదిగో వెంటనే యిక్కడనుంచి వెళ్ళిపో!" ఘూకర్ వీధిగుమ్మం వైపు చూపించేడు; "ప్రాణం పోతుందేమో అనుకున్నాను అప్పుడు. ఆకుండ

నీనెత్తికేసి బద్దలు కొట్టవలసింది. ఎందుకని ఊరుకున్నాను. నా కళ్ళయెదుట నుంచి వెళ్ళిపో. లేకపోతే చంపేస్తాను. నాకు కోపం రానంతసేపే, వచ్చిందంటే వెనకా ముందూ చూడను."

మమిభికా వీధి గడప దాటగానే "ఏమిటి యిది అంతా?" అని అడిగేడు.

"రెండురోజులనుంచి వీధిలోకి అడుగుపెట్టలేను. ఒక్కసారిగా విరోచనాలు వెడుతూన్నాయి. పొట్టంతా అప్పడంలా అయిపోయింది. బాగా చిక్కిపోలేదూ నేను?"

"మాంసం దిట్టంగా తిన్నావాఏమిటి?"

"మాంసం........,"

"నీ కొత్తదూడని చంపేసేవా?"

"ఆ దూడ చచ్చిపోయింది....... అదిఎందుకూ ఉపయోగించింది కాదు......."

మకార్ అసహ్యంతో ఘూకర్ని నిలువల్లా చూసేడు.

"అరి పిశాచమా! చంపేసేవా! ఆకుండ కాదు, పెద్ద సీపా పెట్టవలసింది నీపొట్టమీద; ఉబ్బర పూర్తిగా లాగేసును. తొందరపడకు—రేపే, సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో నీ సభ్యత్వం రద్దుచేసేస్తాం. ఎందుకోసం చంపేవు దూడని?"

"మకార్! బుద్ధిగడ్డితింది. తెలియక చేసేను. మాముసలిది నన్ను ప్రోత్సాహంచేసింది. ఈ ఒక్కసారికి దయదలుచు.........కామ్రేడ్ దేవిడోవ్! మనఇద్దరికి ఎంతో స్నేహం, నన్ను సమిష్టి వ్యవసాయక్షేత్రంలోనుంచి తొలగించరు కాదూ? నేనుచేసినపనికి ఫలితం యిదివరకే అనుభవించేను ......."

"డేవిడోవ్! అతనితో మాట్లాడడంఏమిటి, రండి." నగుల్నోవ్ చెయ్యి విసిరేడు. "ఘూకర్! తుపాకికిపూసే కొవ్వులో ఉప్పుకలిపి తాగు, నింపాదిగా ఉంటుంది. ఎప్పుడు చూసినా ఏదోరోగంతో బాధ పడుతూనే ఉంటావు."

"వేళాకోళంచేస్తున్నావా నన్ను?" అన్నాడు ఘూకర్.

"అబద్ధంకాదు. నేనుచెప్పేది నిజమే. పూర్వం మేము సైన్యములో పనిచేసేటప్పుడు కడుపు నొప్పికి అల్లా చేసేవాళ్ళం."

"నేను మనిషిని కాదనుకుంటున్నావా? జీవంలేని వెధవ తుపాకీని మెరుగుపెట్టే కొవ్వు మింగమంటున్నావా? నాకు ఇష్టంలేదు! చావనైనా చస్తానుకాని అదిమాత్రం మింగను!"

రోగంకుదిరి ఘూకర్ ఆ మరునాడే ఊళ్ళోకి బయలు దేరేడు. దోవలో కనపడినవాళ్ళందరితోను, డేవిడోవ్, నగుల్నోవ్ తనని చూడడానికి వచ్చేరని వేసవి పల్లికలను గురించి, సమిష్టి వ్యవసాయక్షేత్రపు ఇతర విషయాలను గురించి సలహాలు అడిగి వెళ్ళిపోయేరని అతినమ్మకంగా కోసేడు. ఆఖరున ఒక్క నిముషం ఆగి నోటిలో సిగరెట్టుతీసి నిట్టూర్పు విడిచేడు.

"ఈ మధ్య నాకు సుస్తీగావుంది; అందుచేత చూడడానికి వచ్చేరు. నాసలహాలేకుండా ఒకనిముషం వ్యవహరించలేరు. నాజబ్బు తగ్గడానికిసలహా యిచ్చేరు. "తాతా అశ్రద్ధచెయ్యక త్వరగా రోగం కుదుర్చుగో. ఈ వెధవ రోగం యిప్పుడు పట్టుగుందేమిటి? నువ్వు లేకపోతే చెయ్యి తెగకొట్టినట్టుగా వుంది మాకు." అన్నారు. 'నూక్లిస్'మీటింగుకి వచ్చి అవసరమైన సలహా లిమ్మనడం తప్ప, వాళ్ళు నన్ను ఇట్టే శ్రమపెట్టరు. ఎంత అవసరమో అంతే చెప్తాను కాని, డబ్బాలాగ వాగడం అంటే నాకు అసహ్యం. సాధారణంగా నా సలహా వాళ్ళు తీసిపారెయ్యరు. నేనంటే మంచిగురి వుంది." అని ఎదటి వాళ్ళు తనమాటలు ఎంతవరకు నమ్ముతున్నారా అన్నట్టు వాళ్ళముఖంలోకి చూసేడు.

---

# పదునెనిమిదవ ప్రకరణం.

## గుడ్డల పంపకము.

'గ్రెమాచీలాగ్' లో సమిష్టి వ్యవసాయ క్షేత్రం ఏర్పరచిన కొత్తలో ఉండే అల్లకల్లోలం మళ్ళీ ప్రారంభం అయింది. జంతువులను చంపడంకూడ ఆగిపోయింది. రెండురోజుల వరకు సమిష్టి వ్యవసాయ క్షేత్ర సభ్యులు, వారి గొర్రెలు, మేకలు, కోళ్లు మొదలైనవాటినన్నిటిని తీసుకొనిపోయి సమిష్టి వ్యవసాయ క్షేత్రముయొక్క అధీనంచేస్తూనే ఉన్నారు. గ్రామమంతా పశువుల అరుపులతోను, కోళ్ల కూతలతోను దద్దరిల్లింది.

నూటఇరువదిమంది రైతులవరకు సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో సభ్యులుగా చేరేరు. వారందరు మూడుదళాలుగా విభజింప బడ్డారు. సమిష్టి వ్యవసాయ క్షేత్రపు మేనేజిమెంటు కమిటీ, భాగ్యవంతుల నుంచి స్వాధీనము చేసుకొనిన దుస్తులన్నిటిని బీదకోసక్కులకు పంచిపెట్టడానికి యాకోవ్ లూకుచ్ ను నియమించింది. దుస్తులు అవసరమున్న బీదకోసక్కుల జాబితాఒకటి కమీషను చేత తయారుచేయ బడింది. దానినిబట్టి కావలసినవారికి అందరకి దుస్తులను సప్లయి చేయుటకు తగినన్ని లేవని తేలింది.

భాగ్యవంతుల దగ్గరనుంచి స్వాధీనము చేసుకొన్న దుస్తులను, యాకోవ్ లూకుచ్ టిటాక్ ఇంటిదగ్గర పంచిపెట్టడం ప్రారంభించేడు. ఉదయంమొదలు రాత్రిపొద్దుపోయేవరకు ఒక్కటే గోల. కోసక్కులు తమ చిరిగిపోయిన పాతబట్టలు, అక్కడేగాదిదగ్గర చాటుకు వెళ్ళి విప్పేసి, మంచిబూట్లు, రంగురంగులకోట్లు, జాకెట్లు తొడుక్కొంటున్నారు. ముందు భారపుపనికి నియమింపబడిన బీదకోసక్కులకు, వారికిఅవసరమైన మంచిమంచి దుస్తులు, బూట్లు ప్రత్యేకముగా సప్లయి చెయ్యబడ్డాయి. అటువంటివాళ్ళు సంతోషంతో బుజాలు ఎగరేస్తూ తమయేరుకొన్న దుస్తులు సంతృప్తితో ఇటు

నటు తిరగేసి చూస్తూ, అక్కడే అంతమందియెదుట, చిరుగుల తోను, టాకీలతోను నిండియున్న పాతబట్టలు వదిలేసి మూటకట్టి, కొత్తవి తొడుగుతున్నారు. లుబిష్కిన్‌కి జాకెట్లు, ట్రౌజర్లు, బూట్లు ఇవ్వవలసినదని డేవిడోవ్ లూకిచ్‌తో చెప్పేడు. యాకోవులూకిచ్ ధుమధుమలాడుతూ పెట్టెలో నుంచి ఒక మేటెడు బట్టలు తీసి లుబిష్కిన్ ముందుపడేసి "నీకు ఏం కావలెననిఉందో అవన్నీ తీసుగో!" అన్నాడు.

లుబిష్కిన్ పెదవులు అదిరేయి. ఆ బట్టలన్నీ తిరగేసి చాలాసేపటికి ఒకజాకట్టు ఏరేడు. అప్పటికి అతనికి ముచ్చెమటలూపోసేయి. జాకెట్టు ఇటు, అటు తిరగేసి పోట్లుఏమైనా ఉన్నాయేమోనని చూసేడు. అతని చుట్టూ చేరి చూస్తూన్నజనంలో గడబిడ ప్రారంభమయింది.

"త్వరగా కానియ్యి; నీమనమలుకూడా తొడుక్కోనేవరకు ఉండాలి!"

"కళ్ళు మూసుకొని చూస్తూన్నావా ఏమిటి! ఇంతకిత్రం తిరగేసినదే కామా!"

"సాయంకాలానికేనా నీ ఏరడం పూర్తిఅవుతుందా!"

"పావెల్! అదితియ్యి బాగుంది!"

"నేనివ్వను; ఇంకొకటి చూచుకో నువ్వు."

లుబిష్కిన్ ముఖం గీసిన కందగడ్డలా ఎర్రగా ఉంది. మీసాలు కొరుకుతూ చుట్టూమూగినజనంకేసి బెదురుచూపులు చూస్తూ కొంతసేపటికి రెండవ జాకెట్టు ఏరేడు. తీరా, తొడిగి చూసేటప్పటికి సరిపోయిందికాదు. అందుచేత అదిపారేసి మళ్ళీ పోగుమీదపడి వెతకడం మొదలెట్టేడు. తీర్థంలో ఆటవస్తువుల దుకాణం పిల్లలుఎంతఆతురతగా, సంతోషంగా చూస్తారో అంతసంతోషంతో తన్మయుడైపోయి, చివరకు ఏదితీసుకోడానికీ నిశ్చయంచేయలేకుండా ఉన్నాడు. మధ్యాహ్నానికి బూట్లు, ట్రౌజర్లు, ఏరడంఅయింది. అవితొడిగి, లుబిష్కిన్ ముటముట్లాడుతూన్న యాకోవు లూకిచ్‌కేసి తిరిగి "రేపు ఉదయంవచ్చి మంచి కోటు యేరుకుంటాను." అన్నాడు.

కిర కిర లాడుతూన్న కొత్తబూట్లు, అందమైన ట్రౌజర్లు తొడుక్కునే

టప్పటికి లుబిష్కిన్ అంతకంటె పది సం॥లు చిన్నవాడులా కనిపిస్తున్నాడు. అక్కడినుంచి తిన్నగా రాజ వీధిలోకి వెళ్ళి వీధివెంటపోయే ప్రతివానిని ఆపి మాట్లాడుతూ నెమ్మదిగా యింటికిబయలుదేరేడు. కనిపించిన వాళ్ళందరితోను ప్రగల్భాలుకొడుతూ యింటికి వచ్చేటప్పటికి అతనికి మూడు గంటలు పట్టింది. ఆసాయంకాలానికి వూళ్ళోఅంతా "లుబిష్కిన్ సైన్యంలో చేరి ముందు వేషం వేసినట్లు ఉన్నాడు. ఈ వేళ రోజంతా అతను బట్టలు యేరుతూనే వున్నాడు. మంచిబట్టలు, కొత్తబూట్లు తొడిగి యింటికి వెడుతూన్నాడు. కొంగలా కులుకుతూ నడిచేటప్పటికి మూడు గంటలసేపు పట్టింది యింటికి వెళ్ళడానికి— కాళ్ళు నెప్పులు లేవో యేమిటో" అని చెప్పుకోడం మొదలెట్టేరు.

దెమ్కా ఉషాకోవ్ భార్య చైతన్యం లేకుండా నడిపోయినందుచేత, తన కోసం వేరే తీర్చవలసి వచ్చింది. ఆమె పూర్వము టిటాక్ భార్యకు చెందిన ఊలు 'స్కర్టు' తొడుక్కొని ఉంది. కాళ్ళని కొత్త బూట్లు వున్నాయి. చాల ఖరీదుచేయు అందమైన ఉత్తరీయం ధరించింది. ఈ కొత్త బట్టలు ధరించిన తరువాత ఆమెని చూసినవాళ్ళు 'డెమ్కా భార్య అంత అందవికారమైనది కాదు. బాగానే ఉంటుంది.' అనుకున్నారు. అంతవరకూ కడుపునిండ తిండి, ఒంటినిండా బట్ట లేక గర్భ దరిద్రం అనుభవించిన ఆమె సమిష్టి వ్యవసాయ క్షేత్రపు సంపద చూడగానే ఆసంతోషం తట్టుకోలేక కొయ్యబారిపోయింది. యాకోవ్ లూకిచ్ ఆమెముందు చాల విలువైన బట్టలు పడేసి, కావలసినవన్నీ తీసుకోమని చెప్పినప్పుడు, తగిన పోషణలేని ఆమెముఖంలో రక్తం యెలా వుంటుంది! వరసగా ప్రతి సం॥రం కాన్పు రావడంచేత, తీరని దరిద్రంచేత ఆమె యవ్వనం, ఆరోగ్యం అందం క్రమంగా నశించిపోయేయి. పిల్లల్ని చింకిరి గుడ్డలలో చుట్టబెట్టి ఆమె సం॥రం పొడుగునా పల్చటి, చిరిగిపోయిన ఒకే స్కర్టుతో కాలక్షేపం చేసేది. ఆ ఒక్క వస్త్ర ఉతికి ఆరేసుకొనినప్పుడు ఆరోజు అంతా గుడ్డ లేకయే యింట్లో కూర్చుని ఉండేది.

"ఒక్కసారి ఆగండి. ఈవస్త్రం తీసుగోను నేను................

యిదిమార్చి......పిల్లలకి కావలసిన దుస్తులుయేవైనా.........మిషాక్క ..........దునియా............" అని హీన స్వరంతో, అక్కడనున్న బట్టలపోగు కేసి ఆతురతతో చూస్తూ అంది.

అక్కడనే నిలబడియున్న దేవిడోవుకి ఆమెను చూసేటప్పటికి కడుపు తరుక్కుపోయింది. తిన్నగా ఆమె దగ్గరకి వెళ్ళి,

"ఏమమ్మా! మీకు యెంతమంది పిల్లలు?" అని అడిగేడు.

"ఏడుగురు." డెమ్కా భార్య కళ్ళు పైకి యెత్తకయే నెమ్మదిగా సమాధానం చెప్పింది.

"పిల్లలకు పనికివచ్చే దుస్తులు యేవైనా ఉన్నాయా?" దేవిడోవు యాకోవు లూకిచ్‌ని అడిగేడు.

"ఆ-- ఉన్నాయి."

"ఆమె పిల్లలకి కావలసినవి, ఆమె యెన్ని అడుగుతే అన్నీ ఇయ్యి."

"అన్ని యిస్తే ఆమె భాగ్యవంతురాలై పోతుందే!"

"ఏమిటీ -- అన్నావు? అనతగిన మాటేనా అది?" దేవిడోవు కోపంతో మండిపడ్డాడు. యాకోవు మారు మాటాడకుండా పెట్టె తీసివంగేడు.

డెమ్కా ఉషాకోవు నిశ్శబ్దంగా ఆమె వెనక నిలబడి ఊపిరి బిగపట్టి యిదంతా చూస్తున్నాడు. దేవిడోవ్ ఆఖరున అన్నమాటలు వినగానే అతని వైపు చూసేడు. ఆమెల్ల కళ్ళల్లోనుంచి గిఱ్ఱిన నీళ్ళు తిరిగి రెండు చుక్కలు రాలేయి. అతడు అక్కడినుంచి బయలుదేరి చుట్టూచేరిన జనాన్ని ఎడమ చేతితో వొత్తిగిస్తూ కుడిచేతితో రెండు కళ్ళూ కప్పగొని వీధిగుమ్మంవైపు బయలుదేరేడు. కళ్ళనీళ్ళు కనబడకుండా చెయ్యి అడ్డంపెట్టి, యెక్కడా ఆగకుండా వీధులోకి వెళ్ళిపోయేడు. కానిఅతనిచెయ్యి తప్పించుకొని కన్నీటి చుక్కలు బొటబొట కారుతూనే వున్నాయి.

మధ్యాహ్నం బాగా పొద్దు వాలిపోయినతరువాత ఘూకర్ అక్కడికి వచ్చేడు. కానిఅక్కడ ఆగకుండా సమిష్టి వ్యవసాయక్షేత్ర కార్యాలయంలోకి వెళ్ళి హడావిడిగా "కామ్రేడ్ దేవిడోవు! యేం చేస్తున్నారు" అన్నాడు.

"తాతా! నింపాదిగా ఉన్నావా?"

"నాకో చీటి వ్రాసి యివ్వండి."

"చీటి దేనుని?"

"నాకుకూడ బట్టలు ఇయ్యాలని"

"ఎందుకు నీకు యివ్వడం?" డేవిడోవ్ పక్కని కూర్చునియున్న నగుల్నోవు కనుబొమ్మలెత్తి చూస్తూ అన్నాడు. "గిత్తదూడని చంపేసి చాలా శ్రమపడి వున్నావనా?"

"మకార్! నాటి సంగతులన్నీ తవ్వుతారెందుకు? ఆ మాట యెత్తకోకండి. ఎందుకు యివ్వడం అనడంలో అర్థంయేమిటి? ఆ 'టిటాక్'ని తరిమి ఆస్తి అంతా పూచిక పుల్లకూడా పోకుండా జాగ్రత్తపెట్టి చివరకు నానా బాధలు పడ్డవాడెవడు? నేను, కామ్రేడ్ డేవిడోవ్ మాత్రమే! అయనకి రేవునెత్తి బద్దలైంది అంతే; అదేమీ లెక్కలోనిది కాదు. ఆ కుక్క నా Sheep skin ఏం చేసిందో చూడలేదూ? అలుకు గుడ్డకైనా పనికిరాకుండ పేలికలు చేసేసింది. సోవియటు ప్రభుత్వంకోసం, సర్వం త్యాగంచేసిన నన్ను అనవలసిన మాటేనా అది? ఆ Sheep skin ప్రాణ ప్రదంగా చూసుకుంటున్నాను: అది నాభార్యది. ఇంతవరకూ దానికి చెప్పకుండా దాచేను. గాని లేకపోతే యీపాటికి నన్ను ఏం చేసియుండునో!"

"అప్పుడు నువ్వు పారిపోకుండా మాతోటే వున్నట్లయితే నీ Sheep skin ఆకుక్క చింపెయ్యకుండా వుండియుండును."

"ఆసమయంలో పరుగెత్తకపోతే యెల్లాగ? ఆగాడుసిముండ టిటాక్ భార్య ఏం చేసిందో చూసేవా? ఆ కుక్కని నా మీదికి పురికొల్పి 'వాడిని పట్టుగో. ముక్కలు ముక్కలు చేసి పారెయ్యి. వీళ్ళందరికంటె యెక్కువ వాడు వీడే!' అని అర్చింది."

"ముసలితనం వచ్చినా యింకా అబద్ధాలు ఆడడం మానలేదు నువ్వు" అన్నాడు మకార్.

"కామ్రేడ్ డేవిడోవ్! మీరు చెప్పండి."

"అది నాకేమీ గుర్తు లేదు.........."

"ఆమె అల్లా అనడంమాట నిజమే, ఏమీ అబద్ధంలేదు! ఆ కుక్క పిశాచంలా మీద పడడానికి వస్తూంటే నేను వీథులోకి వచ్చేసిన మాట నిజమే. సాధారణపు కుక్క అది — పెద్దపులికూడా దానికంటె నయమే!"

"కుక్కని నీ మీదికి యెవ్వరూ వదిలిపెట్టలేదు. ఇదంతా వొట్టి కల్పన."

మకార్! నీకేమీ జ్ఞాపకం లేదు. ఆ కంగారులో భయపడి మనస్సు చెదిరిపోయింది నీకు; ఎల్లా జ్ఞాపకం వుంటుంది! క్రిందపడిపోయిన నామీద పడ్డ ఆకుక్క నన్ను దొడ్డిఅంతా యెల్లా యీడ్చింది! ఆవిషయాలన్నీ నాకు జ్ఞాపకం వున్నాయి. అప్పుడు ఆకుక్క కసక నన్ను పట్టుకోనకుండా వున్నట్లయితే ఆనాడు అక్కడే నన్ను చంపేసివుండును. ఇంకా భూమిమీద నూకలు వున్నాయి బతికిపోయేను. శుద్ధ మొండివాళ్ళల్లో ఒకడిని! వెనక ముందు చూడను కోపం వచ్చిందంటే."

నగుల్నోవు ముఖం చిట్లించి డేవిడోవుతో "వెంటనే అతనికి చీటి వ్రాసి యిచ్చి యిక్కడనుంచి పంపెయ్యండి" అన్నాడు.

కాని ఛూకర్‌కి బాతాఖానీ కొడుతూ కూర్చుందం అనేకాని మొదట తను వచ్చిన పనిధోరణి పోయింది.

"మకార్? చిన్నతనంలో నేను యెల్లా వుండేవాడినో నువ్వు ఎరగవు; దొమ్మలాట వచ్చిందంటే............"

"చెవులు తడకలు కడుతూన్నాయి నీ వాగుడు వ్రాసిద్దూ! నీ సంగతి అనేకసార్లు విన్నాను నేను. ఇనప గిన్నె వొకటి ఇయ్యమని చెప్పమా? మళ్ళీ కడుపు నొప్పివస్తే కాచుకోనడానికి పనికొస్తుంది."

ఛూకర్ ముఖం చిన్నపుచ్చుకొని డేవిడోవు వ్రాసి యిచ్చిన చీటి పుచ్చుకొని వెళుతూన్నాననికూడా చెప్పకుండా గబగబా వెళ్ళిపోయేడు. కాని యాకోవు లూకిచ్ అతని చీటి తీసుకొని మంచి గొర్రెచర్మం ఒకటి

ఇయ్యగానే ఆముటముట్లాడడం పోయి వెనకటికళ మళ్ళీ వచ్చింది. చింతాకు లాంటి ఆకళ్ళు సంతృప్తి వెలిబుచ్చుతూన్నాయి. కోసమ్మ-లందరి యెదుట ఆ గొర్రెచర్మం ఒకమూల పట్టుకొని పైకెత్తి చూస్తూ, కంఠం సవరించుకొని, "చూసేరు యెలాంటి గొర్రెచర్మమో! స్వయంగా కష్టపడి సంపాదించేను యిది. టిటాక్ ఆస్తిస్వాధీనం చేసుకోవడానికి వెళ్ళినప్పుడు అతడు డేవిడ్సోవుని తలుపు గర్జింది పుచ్చుకొని కొట్టడం మీకందరికీ తెలియనే తెలుసును. డేవిడ్సోవు చచ్చిపోయేడనుకున్నాను. అంతే, మరుక్షణంలో ఒక్క పరుగున వెళ్ళి టిటాక్ను కొట్టి తరిమేసి మా స్నేహితుని కాపాడేను. ఆ రోజున నేనే కనక లేకపోయినట్లయితే డేవిడ్సోవు యీపాటికి చచ్చిపోయి వుండును."

"అయితేనూ — ఊళ్ళో అందరూను, నువ్వు కుక్క తరుముకొని వస్తే పారిపోయేవనీ, అది మీదపడి పంది పిల్లిలా నీ గొర్రెచర్మం పట్టుకొని పీకి చింపేసిందనీ అనుకుంటున్నారే!" అని అడిగేడు వొకడు.

"అవన్నీ వట్టి అబద్ధాలు. వాళ్ళకి మంచీ — చెడ్డా—యేమైనా వుంటే కాదూ! నోటికి వచ్చినట్లల్లా వాగుతూంటారు. యుద్ధం తినే పెద్ద కుక్క నన్ను కరవడమా! తెలివితేటలు లేవు—ఒక ఆక్షేపించడం కూడా రాదు." భూకర్ తమాషాగా ఆవిషయం మార్చివేసి వేరేవిషయంలోకి దింపేడు.



## పంధొమ్మిదవ ప్రకరణము.

## ఆచరణలో చిక్కులు.

రాత్రి.........

గ్రిమాచీలాగ్ కు ఉత్తరదిశగా అనేక పర్వతాలు, లోయలు, మహారణ్యములు, నదులు దాటి అనేక వందల మైళ్ళదూరమున సోవియట్ యూనియన్ ముఖ్యనగరం ఉంది. పట్టణం అంతటా వేలకొలది ఎలక్ట్రిక్ లైట్లు వెలుగుతూన్నాయి. నిశిరాత్రివేళ చంద్రకాంతినికూడ ధిక్కరిస్తూ చాలదూరము పైకి చిమ్ముతూన్న యెలక్ట్రిక్ లైట్ల కాంతి నేత్రానందంగా ఉంది.

మాస్కోనగరం గ్రిమాచీలాగ్ కు ఉత్తరంగా తొమ్మిది వందలమైళ్ళ దూరమున వుంది. రైళ్ళ కూతలతోను, మోటార్ల హారన్ ధ్వనులతోను ట్రాముల బరబర ధ్వనులతోను పట్టణమంతా ప్రశాంతంగా వుండవలసిన ఆ నిశిరాత్రి సమయంలోకూడ — అల్లకల్లోలంగానే కనిపిస్తూంది. లెనిన్ సమాధివెనుక క్రెమ్లిన్ ప్రాసాదం దగ్గర యెర్రజండా ఆకాశంలో పటపట కొట్టుగుంటూ ఎగురుతూంది. క్రిందనున్న యెలక్ట్రిక్ లైట్ల కాంతి ప్రతిఫలించి ఆ పతాకం రక్తరంజితంగా కనిపిస్తూంది. నిలుకడ లేకుండా వీస్తూన్న గాలికి నలుదిక్కుల యెగురుతూన్న ఆజండా విప్లవజ్వాలలు నలుమూలలా రేగి సహస్ర నాలుకలతో ప్రజ్వల్లి ప్రపంచ విప్లవానికి సిద్ధము కండని హెచ్చరిస్తూండా అన్నట్లు వుంది.

కోండ్రాట్ మైదనికోవు రెండు సంవత్సరాలక్రితం మాస్కోలో అఖిల రష్యా సోవియటుల సమావేశానికి వచ్చేడు. ఒకరోజు రాత్రి రెడ్ స్క్వేర్ లోకి వెళ్ళేడు. అతడు లెనిన్ సమాధికేసి, చాలాయెత్తునఆకాశములో యెగురుతూన్న యెర్రజండాకేసి విజయగర్వంతో చూస్తూ టోపీ తీసి చేత పట్టుకొని నిలబడ్డాడు. ఆ వొడుకునూలు జాకెట్టుతో చట్టితలతో తన్మయుడైపోయి చాలాసేపటివరకూ అలాగే నిలబడిపోయేడు.

కాని గ్రిమాచీ లాగ్‌లో రాత్రిలందు గజగజలాడించే చలి, ప్రశాంత మైన ప్రకృతి తప్ప ఆ గందరగోళం ఉండేది. చుట్టూకనుచూపుమేరవరకు, మంచుతో కప్పబడిన బీడుభూములు వెన్నెల రాత్రిలందు తళతళ లాడు తూంటాయి. ఎక్కడా నిలబడడానికి అవకాశం దొరకని చీకట్లు లోయల లోనూ, పర్వతాల పక్కన, చెట్లగుబురులలోనూ నిలబడి వున్నాయి. సప్తర్షి మండలం పశ్చిమాన అస్తమిస్తూనట్లుగా వుంది. గ్రామ సోవియటు దగ్గరనున్న పొప్లారు చెట్టు మసగగానున్న పిశాల ఆకాశంలోకి చేతులుజాపి నిలబడి యుంది. కరిగినమంచు, మర్మర ధ్వనులతో ప్రవహిస్తూ నదిలో పడుతూంది. ఆ నిశ్శబ్దంలో దుప్పి మేతమేస్తూ చిన్న రొబ్బనొకదానిని విరిచిన ధ్వని కూడ వినిపిస్తూంది. ఉండి యుండి చెట్లకొమ్మలనుంచి జారుతూన్న మంచు ముక్కలు నేలమీదపడి అవుతూన్నధ్వని ఆ నిశీథ నిశ్శబ్దములో అంతరించి పోతూంది.

నిశ్శబ్దము.........

తూర్పు తెల్లవారేముందు మాత్రము ఉత్తరాన్నుంచి వీచే గాలితో పాటు క్రమ క్రమంగా ప్రకృతిలోకూడ చైతన్యం కలుగుతుంది. రాత్రి అయిపోయి పగలు వస్తున్నందుకు సంతోషిస్తున్నాయా అన్నట్లు నదిపక్కన ఆకులు రాలిపోయి మోళ్ళలా నిలబడియున్న చెట్లు ఊగుతూన్నాయి. రాత్రి అంతా గడ్డిమేట్లదగ్గర గింజలు యేరుకు తిటూన్న పిట్టలు కలకల ధ్వనులతో యెగిరిపోతున్నాయి. తల్లుల దగ్గరకు వెళ్ళడానికి దూడలు 'అంబా' యని అరుస్తూన్నాయి. కొత్తస్థలం అవడంచేత సమిష్టి వ్యవసాయ క్షేత్రపుకోళ్ళు, విధి విరామం లేకుండా కూస్తున్నాయి. ఇళ్ళమీదనుంచి పొగ చుట్టలు చుట్టలుగా లేస్తూంది.

గ్రిమాచీ అంతటా రాత్రిలందు కంటిమీద కునుకు లేకుండా మేలు కొని ఉండేవాడు కోండ్రాట్ మైదనికోవు వొక్కడే. పెద్ద చుట్ట నోట పెట్టి యెంతకీ తెగని ఆలోచనలతో తల బరువెక్కినా అలాగే ఆలో చిస్తూంటాడు.

అర్ధరాత్రి కోండ్రాటెక్‌కి యెలక్ట్రిక్ లైట్లతో దేదీప్యమానంగా వెలుగుతూన్న మాస్కో నగరము, రక్త కాంతులీనుతూ క్రెమ్లిన్ మీద యెగురుతూన్న యెర్ర జండా, సోవియటు యూనియన్ వెలుపలనున్న విశాల ప్రపంచం అంతటను దుర్భర దారిద్ర్యంతో కృంగిపోతూ బక్కచిక్కిన శరీరాలతో, కళ్ళనీళ్ళతో, దీనత్వం తోపిస్తూన్న కూలీలు, కళ్ళల్లో మెదులుతూన్నారు. చిన్నప్పుడు అతను యేడుస్తూంటే ఊరుకోపెట్టడానికి అతని తల్లి అన్న మాటలు జ్ఞాపకం వచ్చేయి.

“కోండ్రాటెక్ యేడ్వకు— దేవుడికి కోపం వస్తుంది. ప్రపంచంలోని బీదవాళ్ళంతా ప్రతిరోజూ యిల్లా యేడుస్తూ, సమస్తం కొద్దిమంది ధనవంతులు స్వాధీనం చేసుకొని తమబోటి మిగిలిన ప్రజాసామాన్యాన్ని అందర్నీ పీడుస్తున్నారని భగవంతుడికి మొరపెట్టుతూనే వున్నారు. కాని భగవంతుడు బీదవాళ్ళని ఓర్పు వహించి వుండమన్నాడు. అందుచేత బీదవాళ్ళూ, అనాథలూ, యేడ్చినప్పుడు కోపం వచ్చి, వాళ్ళ కన్నీళ్ళన్నీ పోగుచేసి పొగమంచుచేసి తన్నూ—మున్నూ కనిపించకుండా సముద్రంమీద వదలేస్తాడు. దారి తెలియక సముద్రం మీదనుంచి వెళ్ళే వోడలు ఆ మహా సముద్రంలో మారు దారుల పడిపోయి, చివరకు యే కొండకో తగిలి బ్రద్దలయి ప్రజలంతా చచ్చిపోతారు. ఒక్కొక్కప్పుడు ఆ కన్నీళ్ళని వుప్పటి మంచుగాచేసి చేలమీద కురిపిస్తాడు. అందుచేత ఆ చేలన్నీ మాడిపోయి గొప్ప కరువులు, మహమ్మారి మొదలయినవి వచ్చి జన నాశనం అయిపోతుంది. తెలిసిందా—అందుచేత మనబోటి బీదవాళ్ళు యెప్పుడూ యేడవకూడదు. ఏడుస్తే దానివల్ల నష్టం మనకే కామూ ................................. కోండ్రాటెక్ భగవంతుడిని ప్రార్థిస్తూండు! ఆ ప్రార్థనలు దేవుడు త్వరగా అందుకుంటాడు” అంది.

“అమ్మా, మనం బీదవాళ్ళమా? నాన్న కూడా బీదవాడేనా?” చిన్న కోండ్రాటెక్ తల్లిని అడిగేడు.

“అవును నాయనా — మనం బీదవాళ్ళమే” అని అతనితల్లి జవా

వచ్చింది. కోండ్రాటీ సిలువవద్దరకు వెళ్ళి మోకరిల్లి భగవంతుణ్ణి ప్రార్థించి ఆయన కోపగిస్తాడేమోననే భయంతో కళ్ళనీళ్ళు తుడిచేసుకున్నాడు.

కోండ్రాటీ ఒక డాన్ కోసక్కు కొడుకు. ఇప్పుడు సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో సభ్యుడు; సమిష్టి వ్యవసాయ క్షేత్రం యేర్పాటుచేసిన ఆ మొదటి రోజులలో అతడు ఆలోచిస్తూ కూర్చుంటే ఆ రాత్రులు యెంతకీ తరిగేవి కావు. అతని తండ్రి సైన్యంలో పనిచేసేటప్పుడు 'ఇవనోవో-వోజ్నెసెన్స్కు'లో సమ్మె చేసిన నేత మిల్లు కూలీలను గుర్రాలతో తొక్కియు, సన్నీలతో పొడిచియు, అనేక విధాల బాధించి సమ్మె రూపుమాపి మిల్లు యజమానులకు సహాయం చేసేడు. అతని తండ్రి చచ్చిపోయేడు. కోండ్రాట్ పెరిగి పెద్దవాడయి, 1920 సం॥రం పోలీసు విప్లవవ్యతిరేకుల్ని నరికి పోగులు పెట్టేడు. మిల్లు యజమానుల ఆధిపత్యమును నిలబెట్టుటకు ప్రయత్నించే 'రాంగెల్' సైన్యాలతో పోరాడి, కూలీ ప్రభుత్వమైన సోవియటు ప్రభుత్వాన్ని నిలబెట్టేడు.

కోండ్రాట్‌కి దేవుడంటే నమ్మకం చాలా కాలము క్రిందటే పోయింది. ఇప్పుడు ప్రపంచ ప్రజాసామాన్యాన్ని దాస్య శృంఖలాలనుంచి విడిపించి అభివృద్ధి మార్గానికి నడిపిస్తూన్న కమ్యూనిస్టు పార్టీని వొక్కదానినే నమ్ముతాడు. అతడు తన గుఱ్ఱము, ఎద్దు, ఆవు, చివరకు కోళ్ళనికూడా సమిష్టి వ్యవసాయ క్షేత్రం ఆధీనం చేసేడు. కష్టపడి పనిచేసుకొనే ప్రతివ్యక్తికి జీవితావసరములకు లోపము లేకుండా సమాన స్వాతంత్ర్యము కలిగి యుండడమే అతని ముఖ్యాశయము. సోవియటు ప్రభుత్వానికి అతనికి అవినాభావ సంబంధం యేర్పడింది. కాని అతనికి రాత్రులు నిద్రయేలేదు. తన స్వంతఆస్తి అనుకునేవాటి నన్నిటిని సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి యిచ్చేసినప్పటికి వాటిమీద ఆకాంక్ష వదలకపోవుటయే దీనికి కారణం.

అంతకుక్రితంవరకు అతనికి తెల్లవారుఝాము మొదలు చీకటి పడేవరకు ఊపిరి తిరగకుండా పని యుండేది. ఉదయాన్నే లేచి దూడలపాక బాగు చేసి అన్నిటికి గడ్డివేసి ఝాముపొద్దు యెక్కేక ఊరిబయట నదికి తోలుకు

పోయి నీళ్ళుపెట్టి తోలుకువచ్చేవాడు. మళ్ళీ మధ్యాహ్నము తోటలోనుంచి గడ్డి తీసుకువచ్చి వేసి పక్కలు తేలేలా మేపేవాడు. రాత్రికూడా మెలకువ వచ్చినప్పుడల్లా దూడల పాకలోకి వెళ్ళి అన్నిటి దగ్గర గడ్డి ఉందో లేదో చూసి, చెదిరిపోయిన గడ్డిఅంతా పోగుచేసి వేస్తూండేవాడు. పశువుల్ని చూసుకొని అవ్యాజమైన ఆనందంతో అతని హృదయం ఉప్పొంగిపోయేది. కాని ఇప్పుడు అతని దొడ్డిఅంతా బావురుమంటూంది. సంరక్షణ చేసేటందుకు ఆ పశువులు యేమీ లేకపోవడంచేత యేమీ వుబుసుపోవడంలేదు. పశువుల కొట్టంఅంతా ఖాళీగావుంది. ఆఖరికి రాత్రిళ్ళు ఒక్క కోడికూతకూడా వినిపించడం లేదు. ప్రతి ఝాముకి కూతకూస్తూండే కోడి లేకపోవడం చేత అతనికి రాత్రి యెంత పొద్దుపోయినదీకూడా తెలియక 'రాత్రి యెంతకీ తరగదేమి?' అనిపించేది.

సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో పశువుల్ని సంరక్షణ చెయ్యడానికి అతనివంతు వచ్చినప్పుడు మాత్రం వెనకటి మాంద్యం అంతా వదలిపోయి నూతనోత్సాహం వచ్చేది! ఉదయాన్ని లేవగానే కళావిహీనంగా ఉన్నదొడ్డి, విచారకరమయిన భార్యముఖము చూడకుండా తప్పించుకోవడానికి, బయటికి వెళ్ళిపోతూండేవాడు.

ఇప్పుడు అతనిభార్య పక్కని పడుకొని నిద్రపోతూంది. అతనికూతురు 'క్రిష్టిష్కా' వేరే మంచముమీద పడుకొని నిద్రపోతూ, "నాన్నా...... ...............చూడు...................యెంత బాగుందో............." అని పలవరించింది. అగ్గిపెట్టికి ఒకదానికి చక్రాలుపెట్టి బండిచేసి యిస్తే, ఆమె చిన్న బొమ్మని దాన్లోపెట్టి, బండి యీడ్చుకుంటూ, యెంతో మురిసిపోతుంది. ఆ రోజల్లా దాన్ని యీడ్చుకుంటూ తిరుగుతుంది. ఆమర్నాడు మళ్ళీ ఇంకో కొత్తరకం ఆటవస్తువుయిస్తే కాలక్షేపం చేస్తూంటుంది.

కొండ్రాట్ ఆలోచనలు వేరు. ఆ ఆలోచనలకి అంతులేకుండా వలలో చాపలా కొట్టుకుంటున్నాడు. "ఎంత ప్రయత్నం చేసినా యీ మమకారం వదలడం లేదు. దీనికి కారణం యేమిటి? నేను తబేలాలో తిరిగే

టప్పుడు అన్ని గుఱ్ఱాలని మామూలుగా చూస్తూ వెడతాను. కాని నా గుఱ్ఱం దగ్గరకు వెళ్ళి కత్తిరించిన దానియెడమచెవి, గడ్డిమీదనుంచి తోక వరకున్న నల్లటి చారిక చూడగానే యెక్కడ లేని ఆనందం కలుగుతుంది. మిగిలిన గుఱ్ఱాల న్నిటికంటే, దానికి మంచి గడ్డి వెయ్యాలని అనిపిస్తుంది. ప్రతీవాళ్ళూ అంతే. వాళ్ళ గుఱ్ఱాలమీద వుండే ప్రేమ, శ్రద్ధ మిగిలిన వాటిమీద లవలేశమైనా ఉండదు. కాని నిజంచేత అవి 'ఇతరులవి' కావు. మనవి అందరివీను..........................అసలు చాల మందికి వాటి సంరక్షణే తెలియదు— మొన్న దేనా యెరిగి వుంటేనా! నిన్న కుర్ఘునోవ్ వంతు వచ్చింది. అతను చుట్ట కాలుస్తూ కూర్చుని, గుఱ్ఱాలకి నీళ్ళు పెట్టడానికి ముక్కుపచ్చలు ఆరని కుర్రకుంకని ఒకణ్ణి పంపించేడు. వాడు వొక గుఱ్ఱంమీద జీనుకూడా లేకుండా యెక్కి, మిగిలినవాటి నన్నిటిని నది దగ్గరకు పరుగెత్తించేడు. గుఱ్ఱాలన్నీ నీళ్ళు తాగేయో లేదో — ఇంతలో యేదో పుట్టి మునిగిపోయినట్లు వాటినన్నిటిని మళ్ళకొట్టి తబేలాకి తరుముకొచ్చాడు. ఇల్లా చేసేడని యెవరిదగ్గరేనా అంటే పళ్ళు యికిలించి 'నీ మాత్రం శ్రద్ధవుందా మాకు యెవరికేనా!' అంటారు. యెవళ్ళమట్టుకు వాళ్ళే ఆస్తి పోగుచేసుకోవాలనుకోవడంలో వస్తుంది యీ పేచీ అంతా. పైవాళ్ళగుర్రాలు యెల్లాపోతే మనకెందుకు? అనే కుచ్ఛితపుబుద్ధి వదలదు. నిన్న 'కుర్ఘునోవ్' నీళ్ళు పెట్టడంలో చూపించిన అశ్రద్ధనిగురించి డేవిడోవుకి చెప్పడం మరచి పోకూడదు. గుఱ్ఱాలని యింత అశ్రద్ధగా చూస్తే వేసవినాటికి యెందుకేనా పనికి ఉపయోగిస్తాయా? కోళ్ళవిషయం యేంచేస్తున్నారో రేపు వుదయం వెళ్ళిచూడాలి; అప్పుడే 7కోళ్ళు చచ్చిపోయేయని చెబుతూన్నారు ఆడవాళ్ళు. ఇల్లా అయితే యేమేనా వుందా! ఇంత హడావిడిగా కోళ్ళనికూడా తీసుకువెళ్ళడం యెందుకు? ఇంటికి వొకొక్క కోడినైనా వదిలెయ్య వలసింది, గడియారం లేనిలోటు లేకుండా. క్రిష్టిప్కా ఆ చిట్టిపాదాలకి బూట్లు లేకుండా తిరుగుతూంది. కొందం అనుకుంటే కో ఆపరేటివ్ షాపులో ఏమీ లేవన్నారు. మనం యెల్లాగైనా కాలక్షేపం చెయ్యవచ్చుగాని చంటిపిల్లలకి

మాత్రం తప్పకుండా వొక జత బూట్లు కొని ఇయ్యాలి. దేవుడోవుని అడగ డానికి మొహమాటం నాకు. సరే యీ శీతకాలం యెల్లాగో గడచిపోతే మళ్ళీ సం॥రాన్నుంచి యేమీ అవసరమే వుండవు."

పంచ వర్ష ప్రణాళికను పూర్తిచెయ్యడానికి ప్రజలందరు యెంతటి శ్రమనైనను లెక్క చెయ్యక పనిచేస్తూండడం జ్ఞప్తికి వచ్చి, కోండ్రాక్ట్ గుప్పెళ్ళు బిగించి పశ్చిమదేశాలలోని కెమ్యూనిస్టులు కాని కూలీలతో మనస్సు లోనే వాదించడం మొదలెట్టేడు. "మీ యజమానులు చూపించిన కొద్ది లాభాలకు ఆశపడి, మమ్మల్ని నట్టేట పడిలేశారు! మీ బాగు చూసుకొని మమ్మల్ని దగాచేసేరు. మీరు సోవియటు ప్రభుత్వం యెందుకు యేర్పాటు చేసుకోలేదు? మీరు యింత వెనక పడి ఉండడానికి కారణం యేమిటి? మీ జీవితాలు కనక దుర్భరం అయినట్లయితే విప్లవం యీపాటికి తీసుకువచ్చే యుందురు. కాని కడుపు యింకా బాగా మండడం లేదులావుంది. సరే, తొందర పడకండి, కొద్దికాలంలో మీ యజమానులే తెరిపిస్తారు మీకళ్ళు. ప్రపంచం అంతా మా మీద కత్తి కట్టి యుండడంచేత ఆర్థిక పునర్నిర్మాణములో యెంత శ్రమపడవలసివస్తూందో చూస్తున్నారా! ఒకపక్క మాడుతూ వంటినిండా గుడ్డకూడా లేకుండా సగం చిరిగిపోయిన బూట్లతో పళ్ళుకొరుకుతూ ఆలాగే పనిచేస్తున్నాము. ఇంతశ్రమపడి మేము సోషలిజం స్థాపించిన తరువాత, మీరు యేమీ శ్రమలేకుండా అది అనుభవించడానికి రావడానికి మీకు సిగ్గులేదూ!"

ఇల్లా ఆలోచిస్తూనే కొంతసేపటికి నిద్రపోయేడు. నోట్లోని చుట్టజారి చొక్కామీద పడడంచేత అది కాలి బొర్రి పడిపోయింది. నిప్పువేడి తగిలి అతడు ఉలికి పడి లేచి అతనికున్న ఆ వొక్కచొక్కా కాలిపోయినందుకు తిట్టుకుంటూ సూది, దారము కోసం చీకట్లోనే తడుములాడడం మొదలెట్టాడు. లేకపోతే ఉదయాన్ని 'అనా' ఆ బొర్రి చూసిందంటే రెండుగంటలవరకూ సాధించి చంపుతుంది. కాని యెంత సేపటికి సూది దారము దొరకలేదు.

మళ్ళీ కొంతసేపటికి నిద్రపోయేడు.

ఉదయాన్నే లేచి, అతడు దొడ్లోకి వెళ్ళేడు. అకాత్తుగా పెద్ద గోడవ వినిపించింది. సమిష్టి వ్యవసాయ క్షేత్రపు కోళ్ళన్నిటినీ వొకచోట ఉంచడంచేత అవి అన్నీ యెడతెరిపిలేకుండా కుయ్యడం మొదలెట్టేయి. కళ్ళు బాగా విప్పారి చూస్తూ రెండు నిముషములు తదేకదృష్టితో వాటి కూతలు విని, చిరునవ్వు నవ్వుకుని "చెవులు ఘుమ్మపడేలా యెల్లా కూస్తున్నాయో!" అనుకున్నాడు 'బాగా వాయిద్యం వాయించినట్లే! ఆ చుట్టుపక్కలవాళ్ళకి యెవరికీ రాత్రులు నిద్రవుండదు. వారు అన్నీ తలొకసారి కూస్తూండేవి ఇప్పుడు యెలా కూస్తున్నాయో!" అతను కాలకృత్యాలు తీర్చుకోడానికి వెళ్ళిపోయేడు.

ఉదయం భోజనం అయినతరువాత ... సమిష్టి వ్యవసాయక్షేత్రపు కోళ్ళ దొడ్లోకి వెళ్ళేడు. అక్కడ వున్న 'అకీమ్—దెష్కిబోన్నవు';

"ఉదయాన్నే యిక్కడికి వచ్చేవేమి! దోవ తప్పిపోలేదు కదా!" అన్నాడు కొంచెం కోపంతో.

"ఒక్కసారి నిన్న, కోళ్ళని చూసి పోదాం అని వచ్చేను. ఎల్లావుంది నేమిటి, యిక్కడ?"

"నరకంలో వున్నట్లు వుంది ....................పనిలేకపోయినా సరే. ఇక్కడమాత్రం వుండలేను."

"అల్లా అంటున్నావేమి?"

"ఈ కోళ్ళు నా ప్రాణాలు తోడేస్తున్నాయి."

"ఎల్లాగ?"

"ఒక్కరోజు యిక్కడ వుండి చూడు. ఎల్లాగో నీకే తెలుస్తుంది! పిల్లని తగలెట్టా. రోజంతా దొమ్ములాటతప్ప రెండోపనే లేదువాటికి. విడిపించడానికి వాటివెనక పరిగెత్తలేక చస్తున్నాను. పుంజులేకాని పెట్టలు పోట్లాడవు అంటావు నువ్వు. కాని అవి ఒకదాని జుట్టు వొకటి పట్టుకొని వొడ్డిస్తూ పడి కొట్టుకుంటూనే వున్నాయి. ఈపనిమాత్రం నేను చెయ్యను.

ఈ రోజునసే దేవిడ్‌వ్ దగ్గరకు వెళ్ళి తేనెటీల పెంపకం నాకు నేర్ప చెప్పమని అడుగుతాను."

"క్రమంగా అవే అలవాటు పడతాయి. విసుక్కుంటే యెల్లాగ?"

"వాటికి అలవాటు అయేటప్పటికి యిక్కడే నా పని అవుతుంది. నువ్వు యేమనుకున్నా సరే కాని, మగవాళ్ళు చెయ్యవలసిన పనేనా యిది? ముసలివాడిని అవుతేమాత్రం, కోసక్కుని నేను; టర్కీ యుద్ధంలో పని చేసేను. ఇక్కడ నాకు కోళ్ళమీద సర్వ సైన్యాధిపత్యం యిచ్చేరు! ఈ పని మొదలెట్టి రెండు రోజులయిందో లేదో అప్పుడే ఊళ్ళోవాళ్ళంతా వుడికించి సంపేస్తున్నారు. నేను యింటికి వెడుతూంటే, 'కోళ్ళ తాత' అనీ 'కోళ్ళ అకీమ్' అనీ పేర్లుపెట్టి అంటున్నారు. ఇంతవరకు నలుగురిలోనూ, గౌరవంగా బ్రతికి ఆఖరికి యీ ముసలితనంలో వచ్చిముందు 'కోళ్ళతాత' అని పిలిపించుకుంటానా! నాయెత్తు ధనం పోసినా యీ పని మాత్రము నాకు వద్దు."

"అకీమ్! అభిమానం వదిలెయ్యి. ఎవళ్ళో కొంటెవెధవలు ఎల్లాపిలుస్తే లెక్క యేమిటి!"

"పోనీ, కుర్రాళ్ళు పిలుస్తే మాట్లాడక వూరుకొనే వుందును! ఆడవాళ్ళుకూడా మొదలెట్టేరు. నిన్న మధ్యాహ్నం భోజనానికి వెడుతూంటే 'నాస్టియా-డొనిటోస్కావా' నూతిదగ్గర నీళ్ళు తోడుకుంటూంది. 'తాతా కోళ్ళని బాగా చూస్తున్నావా?' అంది. 'ఆ..నాకు చేతనయినట్లు, చూస్తున్నాను.' అన్నాను. 'ఏవేనా గుడ్లు పెడుతున్నాయా?' అంది. 'కొన్ని పెడుతూన్నాయి. కాని బాగా యెక్కువగా పెట్టడంలేదు' అన్నాను. పళ్ళు ఇకిలించి యెల్లా నవ్విందే, వెధవ! 'ముక్కులనాటికి తప్పైను గడ్డేనా పెట్టేలా చూడు.' అంది. 'లేకపోతే కోడిపెట్టల్ని నీ చేత పొదిగిస్తాము జాగ్రత్త!' అటువంటి వేళాకోళాలు చేసేకాలం దాటిపోయింది నాకు. ఈ పనికూడా చాల విసుగు వేస్తుంది."

అకీమ్ యింకా యేదో చెప్పబోతూన్నాడు. కాని దూరంలో నొక

దల్చుగో లేదా? 'నీకు యిలాంటి పాడు ఆలోచన యెందుకు పుట్టింది?' అని సమాధానం చెప్పింది. అసలు విషయం యేమిటో కనుక్కునేటప్పటికి నాకు తలప్రాణం తోకకి వచ్చింది. వచ్చే వేసవిలో సమిష్టి వ్యవసాయ క్షేత్రపు మేనేజిమెంటు కమిటీ, గ్రామంలో 60సం॥లు దాటి, పనిచేయుటకు శక్తులేని ఆడవాళ్ళందరిచేత ......................" నగోల్నవు నవ్వలేక వుక్కిరి బిక్కిరి అయేడు. "...................... గుడ్లని పొదిగేటందుకు తగిన యంత్రసామగ్రి లేకపోవడంచేత, ఆపని వాళ్ళకి వొప్పచెప్తారుట! వాళ్ళకి కోపం పట్టశక్యం గాకుండా వుంది. ఆ 'కుల్యానా' కంఠం పోయేటట్లు తెగ అరిచేసింది. 'ఏమిరా! గొంగ్రము దా కొడకా! గుడ్లు పొదిగేయంత్రాన్నా నన్ను! మీరంతా వచ్చి వ్యనమాడినా సరే నాచేత ఆపని చేయించలేరు. చీపురుకట్ట పెరిగి దగ్గరకు వచ్చిన వాళ్ళందర్నీ వీపు చిట్లగొట్టి, చివరకు జైల్లోకైనా పడి చచ్చిపోతాను.' వాళ్ళందరికంటె గట్టిగా అరుస్తూ నేను వుండుకున్నాను. 'కుల్యానా! ఆపనిమాత్రం చెయ్యకు. మువ్వ పడి చచ్చిపోయేటందుకు సరిపోయినంత నీకు లేదులే మదిలో. ఇవన్నీ అబద్ధాలు. భాగ్యవంతులు కల్పించేరు.' కామ్రేడ్ దేవిడోవ్! చూసేరా యెటువంటి పన్నాగం పన్నేరో! మనపని భగ్నం చెయ్యడానికి యిటువంటి పుకార్లు పుట్టిస్తున్నారు. ఈ విషయం వాళ్ళకి యెవరు చెప్పేరో తెలుసుకోవడానికి ఎంతో కష్టపడ్డాను ఆఖరిగా. చివరకు ఆమె రెండురోజులక్రితం వైస్కా వాయ్‌నుంచి వచ్చిన ఒక సన్యాసిని ఆ గ్రామ టిమోఫీ బోర్షవ్ యింట మకాం చేసి, కోళ్ళని యిన్నిటిని పట్నాలకి యెగుమతి చెయ్యడానికి పోగు చేస్తున్నారనీ, కొత్తరకపు కుర్చీలు తయారుచేసి వాటిలో గుడ్లుపెట్టి పైన్నుండి వేసి అరవై సం॥ములు దాటిన ఆడవాళ్ళనందర్నీ వాటిలో బలవంతంగా కూర్చోపెట్టి గుడ్లు పొదిగిస్తారనీ, బలవంతంగా కూర్చోపెట్టినా వినని వారిని కుర్చీలలో కూర్చోపెట్టి కట్టేస్తారనీ' చెప్పిందిట."

"ఆ సన్యాసిని యెక్కడ ఉంది?" అని నగోల్నవు ఆతురతగా అడిగేడు.

"దానికి తెలుసును ఆమాత్రం! అంత తెలివి తక్కువది కాదు! అతి నష్టకరంగా అబద్ధాలు చెప్పి, రెండో కంటి వాడికి తెలియకుండా పారిపోయింది."

"ఇలాంటివాళ్ళని పట్టుకొని వెంటనే జైళ్ళలో పారెయ్యాలి. నా చేతిలోనుంచి జారిపోయింది. దొరికినట్లయితే గుడ్డలు వూడతీసి, కొరడాతో తోళ్ళు వూడేటట్లు కొడదును. సోమయాజులు పైర్ సన్ అయిపోయుండకూడదా. వూళ్ళోకి కొత్తవాళ్ళు యెందుకు వస్తున్నారో యేం చేస్తున్నారో తెలుసుకోకుండా అంతా గుడ్డిదర్బారులా వుంది. ఈలా వున్నాయి పరిస్థితులన్నీ!"

"వస్తే రానీ అస్తమానూ యెవరు కనిపెట్టుకుని చూడకలరు!" దావిదోవ్ పెద్దకోటుతొడిగి పైన గొర్రెచర్మం కప్పుకొని 'టేబిలు' ముందు కూర్చుని, సమిష్టి వ్యవసాయ క్షేత్ర సభ్యుల చేత ఆమోదించబడిన, వేసవి చల్లికల 'ప్లాను' ను చూస్తున్నాడు. తల పైకి యెత్తకుండానే అతను ఇలా అన్నాడు.

"అపనిందలు మోపడంతనేది శత్రువులు మనమీద పూర్వంనుంచీ ఉపయోగిస్తున్న ఆయుధమే. సోమరిపోతుల్లా యిలా తిరుగుతూ మన పని అంతా పాడుచెయ్యడానికి ప్రయత్నిస్తూంటారు. ఇప్పుడు మేం కోళ్ళ విషయంలో చేసినట్లు, అప్పుడప్పుడు తెలివితక్కువ పనులుచేసి వాళ్ళకి అవకాశాలు కలగచేస్తూంటాము........"

"కోళ్ళ విషయంలో యేం చేసేము?" అన్నాడు నగుల్నోవు ముక్కులు పెద్దవిచేసి.

"కోళ్ళనికూడ సమాజపరం చెయ్యాలన్నాము."

"దాల్లో తప్పు లేదు."

"అంతా తప్పే; ఏమీ సందేహం లేదు. అతి స్వల్పమైనదానికోసం ప్రజలకు బాధ కలిగించేము. ముందు వేసవి చల్లికలకి కావలసినవన్నీ సిద్ధము చేసుకోనకుండానే తొందరపడి యీ కోళ్ళని సమాజపరం చెయ్యాలనటం

శుద్ధ తెలివి తక్కువ. నన్ను నేనే నిందించుకోవాలి. నేను అక్కడికి వెళ్ళగానే జిల్లా కమిటీ మనం ఇయ్యవలసిన ధాన్యపుపన్ను యింకా యెందుకు యివ్వలేదని అడుగుతుంది........."

"కోళ్ళని సమాజపరం చెయ్యడంలో తప్పేముందో చెప్పండి. సభ్యులందరూకూడ అంగీకరించేరు. అంగీకరించలేదూ!"

"సభ్యులంతా అంగీకరించేరా, లేదా అన్నది కాదు మనకి కావలసింది." దేవిడోవు ముఖం చిట్లించేడు. "సమిష్టి వ్యవసాయ క్షేత్రం బలపరచి, గ్రామములోని రైతులనందర్నీ సభ్యులుగా చేర్చి, తరువాత వ్యవసాయం సాగించడం మీదే యిప్పుడు మన దృష్టి అంతా కేంద్రీకరించాలి గాని, కోళ్ళనికూడ సమాజపరం చెయ్యాలన్న చిన్న విషయంమీద చాలమందిని మనకు ప్రతికూలురనుగా చేసుకోవడం మంచిది కాదని మీకు తెలియదూ! కోళ్ళవిషయం మనం చేసినపని రాజకీయదృష్ట్యా తప్పటడుగని ఘంటాపథంగా చెప్పగలను. ముమ్మాటికీ పొరపాటే. నిన్న రాత్రి సమిష్టి వ్యవసాయ క్షేత్రమును గురించి వొక పుస్తకం చదువుతూంటే యీ విషయం తట్టింది. మన యీ సమిష్టి వ్యవసాయ క్షేత్రం, కో-ఆపరేటివ్ అసోసియేషను అన్న విషయం జ్ఞాపకం ఉంచుకోండి. కాని దానిని యిప్పుడు 'కమ్యూన్'గా మార్చడానికి ప్రయత్నం చేస్తున్నాము. ఆ మాట నిజమేనా! అది అతివాద పద్ధతి. సావకాశంగా ఆలోచించండి. నేనేకనక మీస్థితిలో వున్నట్లయితే (మీరే దీనిని తీర్మానము నకుపెట్టి మా అందరిచేత వొప్పించేరు.) చేసిన పొరపాటుని అంగీకరించి కోళ్ళు, బాతులు, యెవరివి వారికి యిచ్చేస్తాను. బోల్షివికు చేసిన పొరపాటు గుర్తించడానికి యెన్నడూ వెనుదీయడు. మీరు యీ పని చెయ్యకపోయినట్లయితే నేను పట్నంనుంచి తిరిగి వచ్చిన తరువాత అయినా ఎవరివి వాళ్ళకి యిప్పించేస్తాను. ఇక నేను వెళ్ళాలి. సెలవు."

అతను టోపీ పెట్టుకొని భాగ్యవంతుల దగ్గరనుంచి స్వాధీనపరచుకొన్న మంచి గొర్రెచర్మం వొకటి, చలిగాలి తగలకుండా చెవులకడ్డంగా కప్పుకొన్నాడు. డాక్యుమెంటుకేసు చేతపట్టుకొని రెండడుగులు వేసి ఆగి

"దేశం అంతటా యిటువంటి దొంగ సన్యాసులు అనేకమంది తిరుగుతూ న్నారు. మనల్ని గురించి లేనిపోని అబద్ధాలు అన్నీ కల్పించి చెప్పి ఆడవాళ్ళని ముసలివాళ్ళని మనకి వ్యతిరేకుల్నిగా చెయ్యడానికి ప్రయత్నించడమే వాళ్ళ ఉద్దేశ్యము. ఇప్పుడు మనం ప్రారంభించిన సమిష్టి వ్యవసాయ క్షేత్ర నిర్మాణము అత్యంత ముఖ్యమైనది. ఇంకా బాల్యావస్థలోనే వుంది. ప్రజా సామాన్యమంతా మనకి సహాయం చేస్తే నేగాని ఆ పని జయప్రదంగా సాగదు. ముసలివాళ్ళు, ఆడవాళ్ళు, యెందుకని అశ్రద్ధచేయక వాళ్ళుకూడ మన వైపుని వుండేలా చూడాలి. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో వాళ్ళఅవసరంకూడా వుంది. అందుచేత దానికి అనుకూలంగా యెత్తుగడలు వన్నుతూం డాలి." అని పెద్దపెద్ద అంగలు వేస్తూ వెళ్ళిపోయేడు.

"మకార్! రా, యెవళ్ళకోళ్ళని వాళ్ళకి యిచ్చేద్దాం. డేవిడోవు చెప్పినదే సబబుగా కనిపిస్తూంది." సమాధానంకోసం రజ్మట్నోవు నగుల్నోవు వైపు చూసేడు. మకార్ కిటికీలో కూర్చుని, ఒక చేతితో కోటు బొత్తాలు వూడతీస్తూ, రెండవచేతివేలుమీద టోపీ గిరగిరా తిప్పుతూన్నాడు. పెదవులు కదులుతూన్నాయి. ఇల్లా మూడు నిముషాలు గడచిపోయింది. మకార్ అకాత్తుగా తలయెత్తి రజ్మట్నోవుకేసి చూసేడు. ఇద్దరి దృష్టి యేకమయింది.

"రా, వెడదాం." అన్నాడు నగుల్నోవు. "మనంచేసినది పొరపాటే. ఏమీ సందేహం లేదు. యేమో అనుకుంటున్నాం— డేవిడోవు చాలా అసాధ్యుడు!"

డేవిడోవు స్లెడ్జి యెక్కేటప్పటికి కోండ్రాట్ మైదన్నికోవ్ అతని దగ్గరకు వెళ్ళి, చేతులు తిప్పుతూ తీవ్రంగా యేదో చెబుతూ నిలబడ్డాడు. బండివాడు తొందరపడుతూ, కళ్ళేలు చేతపుచ్చుకొని, కూర్చునే పెత్తె కిందనున్న కొరడాకర్ర తీసేడు. డేవిడోవు పెదవులు కొరుకుతూ అంతా శ్రద్ధగా వింటున్నాడు. రజ్మట్నోవు బయటికి వచ్చేటప్పటికి 'అతనికి యీ క్రిందమాటలు వినబడ్డాయి.

"అనవసరంగా కంగారు పడకండి! ప్రతి విషయం అంత తీవ్రంగా తీసుకోడం అనవసరం. ఇదే ప్రారంభదశ కనక కొన్ని లోపాలు వుంటాయి. నిజమే. అవి క్రమక్రమంగా సవరించుకుంటాం. శిక్షణ విధానం మేర్పాటు చేసి యేదళానికి ఆదళపు నాయకుల్ని బాధ్యులుగా చేద్దాం. సరే వెళ్ళండి."

ఒక్క కొరడాదెబ్బతో గుర్రాలు అదిరిపడ్డాయి. స్లెడ్జి గేటు దాటి వీధిలోకి వెళ్ళిపోయింది. తెల్లటి మంచులో స్లెడ్జి వెళ్ళిన బాట మాత్రం కనిపిస్తూంది.

కోళ్ళ దొడ్డిలో వందలకొలదీ కోళ్ళు తిరుగుతూన్నాయి. ముసలి ఆకిమ్ చేత కర్ర కొంకటి పుచ్చుకొని ఆ దొడ్లో వాటిని కాస్తూన్నాడు. గాలికి అతనిగడ్డం యిటూ ఆటూ యెగురుతూంది. 'కోళ్ళ తాత' దోవలో అడ్డం వచ్చిన కోళ్ళని కాలి ఫెల్టు బూట్లతో పక్కకి తోస్తూ, ఆ దొడ్లో తిరుగుతూ, అతని బుజంమీదనున్న సంచీలో నుంచి తీస్తూవున్న ధాన్యపు గింజలు ధారగా పోస్తూన్నాడు. కోళ్ళన్నీ పరుగెత్తివచ్చి ఆ గింజల్ని యేరుకొని తింటూ, మధ్య మధ్య కూస్తూన్నాయి.

ఆ దొడ్లోనే గడ్డిమేటి దగ్గర యేర్పరచిన చిన్న ఆవరణలో బాతులు, గుంపులు గుంపులుగా చేరివున్నాయి. అవి రెక్కలు రెప రెపలాడిస్తూ, 'క్లక్' 'క్లక్' అని కూస్తున్నాయి.

పాకవార చాలమంది జనం గుమిగూడి వున్నారు. అందరూ గుండ్రంగా గుమిగూడి ముందరకివంగి, వారి మధ్యనున్న దానికేసి ఆతురతగా చూస్తున్నారు.

రజ్మట్నోవు వాళ్ళ దగ్గరకు వచ్చి, అదియేమిటో చూడడానికి బొటన వ్రేళ్ళమీద లేచి ముందరికివంగి చూసేడు. వాళ్ళు అంతా రెప్పవాల్చకుండా చూస్తూ నెమ్మదిగా యిల్లా అనుకుంటున్నారు.

"ఎర్ర పుంజు గెలుస్తుంది."

"ఏడిసింది, అది గెల్చేది యేమిటి! చూడు, దాని ముక్కు దగ్గర యెంత దెబ్బతగిలిందో."

"అది యెంత దెబ్బ కొట్టిందో చూసేవూ?"

"నోరు తెరిచింది; అలిసిపోయింద్లే."

అప్పుడు భూకర్ మాట వినిపించింది:

"వాళ్లే యీపాటికి నోరు ముయ్యి. కాని సంగతి నీకేం తెలుసును; కొక్క నిముషం ఆగి చూడు — యేం చేస్తుందో తెలుస్తుంది. వెధవ కబుర్లు చెప్పడం కాదు."

ఆ గుంపు మధ్య రెండు పుంజులు పోట్లాడుతూన్నాయి. ఒకటి యెర్రటిది. రెండోది నలుపు—బూడిద రంగు కలసినది. వాటి శరీరాలనిండా గాయాలు; పడి రక్తం నల్లగా అట్టలు కట్టి వుంది. కిరీటపు నలుపు, యెరుపు రంగుల ఈకలు పడివున్నాయి. రెండు పుంజులూ కూడా అలిసిపోయేయి. [illegible] వేసి చూస్తున్నాయి. కాని అలాగ ఆట్టేసేపు వుండలేదు. నల్లకోడి అకస్మాత్తుగా పైకెగిరింది; దానితోపాటు యెర్రపుంజూ కూడా యెగిరింది. ఒకదానిని కొకటి పొడుస్తూ, తోసుకుంటూ, చాలాసేపు దొమ్ములాడేయి.

భూకర్ బయటి ప్రపంచాన్నంతనీ మరచి ఏకాగ్రదృష్టితో వాటికేసి చూస్తున్నాడు. అతని దృష్టి అంతా యెర్రపుంజుమీద వుంది. ఆ కోడి మీద 'మూగ్రైమిడ్' తో పందెం వేసేడు. అందుచేత అది నెగ్గుతుందా లేదా అని చూస్తున్నాడు! యింతలో యెవరో అతనిని చొక్కా పట్టుకొని వెనకకి లాగెయ్యడంచేత అతని దృష్టికి భంగం కలిగింది. భూకర్ తీవ్రకోపంతో వెనకకి తిరిగి తనని లాగినవాడి మీదకి వురకబోయేడు. కాని అమాంతంగా అతని కోపం పోయి మందహాసం చేస్తూ తనని వెనక్కి లాగిన నగుల్నావుని ఆహ్వానించేడు. నగుల్నావు ఆ పుంజుల్ని రెంటినీ విడదీసి అక్కడున్న వాళ్ల వంకకు తిరిగి "కోడి పందేలు వేస్తున్నారా యిక్కడ? ఈపాటికి మీ మీ పనుల్లోకి దయచెయ్యండి. లేకపోతే పెడ తీసుకుపోయి పొలాల్లో విడిచిపెట్టండి. వీరిలో యిద్దరు వెళ్ళి ఊళ్ళో అందరితోను యెవరి కోళ్ళను వాళ్ళని తీసుకొని పొమ్మని చెప్పండి!"

"అయితే సమిష్టి వ్యవసాయ క్షేత్రపు కోళ్ళదొడ్డి మూసేస్తారా!" కోళ్ళ దెబ్బలాట చూస్తూన్న పోకిమ అన్నాడు. అతడు సమిష్టి వ్యవసాయ క్షేత్ర నిర్మాణానికి వ్యతిరేకి. "దీనినిబట్టి కోళ్ళకి వర్గచైతన్యం లేనట్లు తెలుస్తూంది. అయితే, మకార్! సోషలిజం వచ్చినతరువాత కోళ్ళు యిల్లా పోట్లాడతాయా!"

నగుల్నోవు గుడ్లు యెర్రచేసి నిలువునా చూసేడు.

"చాలా వేళాకోళంగా ఉందే నీకు— నువ్వు యెవర్ని వేళాకోళం చేస్తున్నావో యెరుగుదువా!" అని అడిగేడు. "లెనిన్ మహామహులు సోషలిస్టు సమాజ స్థాపనకి ప్రాణాలు త్యాగపాత్రయంగా అర్పిస్తూంటే కుక్కలా తోక ముడిచి కూర్చోవడం కాక పైగా ఆక్షేపణ కూడానా? ద్రోహీ! బయటికి నడు! ఇల్లాంటి వెధవ వేషాలు వేసేవంటే, వొక్క గుద్దుకి చంపేస్తాను, జాగ్రత్త! నన్నుకూడా పరిహాసం చెయ్యడంకూడా వచ్చిందీ!"

సిగ్గుపడి చిన్నబుచ్చుకొన్న కోసక్కు ఆ దగ్గరనుంచి వెళ్ళిపోయి వొక్క సారి దొడ్డంతా కలయజూసి నిట్టూర్పు విడిచి బయటికి వెళ్ళిపోయేడు.



## ఇరువదియవ ప్రకరణము.

### నిరంకుశాధికారి.

జిల్లా కమిటీ ఆఫీసు. సిగరెట్ల పొగ చుట్టలు చుట్టలుగా లేస్తూంది. 'లైఫు రైటుకు' వొకటి 'టిక్' 'టిక్' లాడుతూంది. స్టౌ వేడికి ఆ గదంతా ఉక్కగా వున్నట్లు వుంది. రెండు గంటలకి కమిటీసమావేశం జరుగుతుంది. జిల్లా కమిటీ సెక్రెటరీ ఉక్కకి చెమట పట్టడంచేత చొక్కా బొత్తాలు వూడతీసి విసుక్కుంటూ చాలా తొందరగా వున్నాడు. అతడు దేవిడ్డోవుని కూర్చోమని వొక కుర్చీ చూపించి ఆ రోజునే క్షౌరం చేసుకోవడంచేత నున్నగా తెల్లగా వున్న గడ్డం నిమురుకొంటూ,

"ఇంక అట్టే తీరుబడి లేదు. మీపని పూర్తి చెయ్యండి త్వరగా. సరే. అక్కడ వ్యవహారాలు యెల్లా వున్నాయి! సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో యెంతమంది రైతులు చేరేరు! రైతులంతా చేరుతారంటారా? అత్యవసరంగా తెమల్చాలి." అన్నాడు.

"అంతా చెప్పా; కాని అదికాదు మనం చూడవలసింది— సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో పని యెల్లా జరుగుతూంది అన్నదే ముఖ్యవిషయం. దేశపు వ్యవసాయాన్ని గురించిన ప్లాను తీసుకువచ్చేను; చూస్తారా!"

"అక్కర్లేదు." సెక్రెటరీ గాభరాగాడి కనుబొమలు ముడేసి చూస్తూ, జేబు రుమాలుతో నుదురుమీదిచెమట తుడుచుకున్నాడు, "జిల్లా వ్యవసాయ సంఘములోని 'ఎక్స్‌పర్ట్సు'కి చూపించండి. ఆయన పరిశీలించి సిఫారసుస్తారు. నాకు తీరుబడి లేదు. రాజధానిలో కమిటీనుంచి వొక కామ్రేడు వచ్చేడు, కొద్దిసేపటిలోనే 'బ్యూరో' సమావేశమవుతుంది. కాని మీరు అంత తొందరపడి భాగ్యవంతు లందరిమీద యెందుకు కక్ష తీసుకుని యిక్కడికి పంపేరు? మీతో యేమని చెప్పేను నేను? 'మాకు పైనుంచి స్పష్టమైన ఉత్తరువులు

వచ్చేవరకూ, ఆ విషయమై మీరు తొందర పడకండి.' అని నేను స్పష్టంగా చెప్పలేదూ! భాగ్యవంతుల ఆస్తులన్నీ జప్తుచేసి వాళ్ళని ప్రవాసం పంపించేరు కాని ముందుగానే సమిష్టి వ్యవసాయ క్షేత్రం యేర్పాటుచేసి తీవ్ర కృషి చేసి వున్నట్లయితే యీపాటికి ఆపని పూర్తి అయిపోయి వుండును. Seed grain fund యెంతవరకు పోగుచేసేరు? వెంటనే ఫండుయేర్పాటు చెయ్యవలసినదని జిల్లా కమిటీనుంచి మీకు ఉత్తరువు వచ్చిందా? మరి వచ్చినట్లయితే ఆ వుత్తరువు నెరవేర్చక ఇంతవరకు యెందుకు అశ్రద్ధ చేసేరు? 'బ్యూరో' యెదుట యీరోజునే మిమ్మల్ని, నలుగుర్నీ వుంచి గురించి చర్చ పెడతాను. ఈ విషయాన్ని గురించి మీ మీద తీవ్రమైన చర్య తీసుకోవలసి వస్తుంది, అవమానం కూడాను! డేవిడోవ్! ఇల్లా చూడండి. పై వుత్తరువులు నెరవేర్చక అశ్రద్ధ చేసేరంటే దానినుండి చాలా చిక్కులు కలుగుతాయి మీకు. ఇంతవరకూ మొత్తం యెంత Seed grain fund పోగుచేసేరు? ఆ కాగితాలు చూస్తాను వుండండి." బల్లమీదనున్న గూళ్ళ కాగితం తీసి చూసేడు. "అంతేనన్న మాట! పైగా వొక్క బస్తా కూడా లేదు. ఏం, మాట్లాడరేం?"

"మీరు మాట్లాడడానికి అవకాశం యిస్తే కాదూ నేను మాట్లాడడం! Grain fund విషయంలో యింతవరకూ మేము యేమీ చెయ్యనిమాట నిజమే. ఈ రోజున నేను వెళ్ళగానే ప్రారంభం చేస్తాము. ఇంతవరకూ మేము ప్రతిరోజూ మీటింగులు పెట్టడంలోనూ, సమిష్టి వ్యవసాయ క్షేత్రం యేర్పాటుచేసి దాని సంబంధమైన పనులు చెయ్యడంలోనూ, మునిగి వున్నాము. మీకేం; వెంట వెంటనే వుత్తరవులు యిచ్చేస్తారు, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు యేర్పరచమనీ, భాగ్యవంతుల్ని తరిమివెయ్యమనీ Grain fund పోగుచెయ్యమనీ— అంతేకాని మేము చెయ్యవలసిన పని చూడరు. అన్నీకూడా నెరవేరుస్తాం; అంత తొందరపడితే యెల్లాగ? ఇంకా కావలసినంత కాలపరిమితి వుంది."

"తొందరపడితే యెల్లాగ అనడంలో అర్థంయేమేనా వుందా? రిజియనల్

ప్రావిన్షియల్ కమిటీలు యెంతఒత్తిడి చేస్తున్నాయో మీకేం తెలుస్తుంది. grain fundపోగు చెయ్యడం ఫిబ్రవరి 1వ తారీఖుకు పూర్తి అవాలి. మీరు"

"మేము 15 కిపూర్తిచేస్తాం! ఫిబ్రవరిలో చల్లికలు ప్రారంభంకావనుకుంటాను. కాదూ! ఈవేళే మేనేజిమెంటు కమిటీ సభ్యుణ్ణి ఒకణ్ణి విత్తనముల ఏరేయంత్రంకోసరకు టుబ్యాన్‌స్కాక్కి పంపించేను. అక్కడ సమిష్టి వ్యవసాయ క్షేత్రపు ఛైర్మన్ సుద్ధతాగుబోతు. మేము ఆయనకి 'విత్తనపు ధాన్యంయేరే యంత్రము మాకుఇప్పుడు పంపడానికి వీలవుతుందా?' అనివ్రాసి కనుక్కుంటే, 'ముందు కొద్దికాలంలో' అని సమాధానంఇచ్చేడు."

"ఆ కట్టుకథలకేం లెండి—ముందు మీ మాటచెప్పండి."

"గ్రామస్తులంతా పశువుల్ని చంపడం ప్రారంభిస్తే, చంపవద్దని ప్రచారంచేసి [illegible] ని మానిపించేను. కోళ్ళు మొదలైనవాటిని కూడా చంపేస్తారని నాకు భయపడి, రెండురోజులక్రిందట, చిన్నజంతువుల్ని కూడా సమాజపరంచెయ్యాలని తీర్మానించేను. కాని ఈవేళ నేను వచ్చేటప్పుడు కోళ్ళనన్నిటిని ఎవరివి వారికి ఇచ్చెయ్యమని నగుల్నోవుతో చెప్పి వచ్చేను."

"ఎందుకోసం అని?"

"కోళ్ళు మొదలైనచిన్నజంతువుల్ని సమాజపరం చెయ్యడం పొరపాటని తోచింది. సమిష్టివ్యవసాయ క్షేత్రాలలో ఇప్పుడు వాటి అవసరంలేదు."

"సమిష్టి వ్యవసాయ క్షేత్ర సభ్యుల సమావేశంలో కోళ్ళని సమాజపరం చెయ్యాలన్న తీర్మానం ఆమోదింప బడిందా?"

"ఆ—ఆమోదింప బడింది."

"అయితే దాన్లో తప్పేముంది?"

"కోళ్ళని జాగ్రత్త పెట్టే సాధనసామగ్రి ఇంకా రాలేదు. అదీకాక చాలమందికి అదిఇష్టంలేనట్టుగా కనిపించింది. ఈమాత్రంచిన్నవిషయంకోసం, ఇష్టంలేనివాళ్ళని ఎల్లాగో నయాన్నో, భయాన్నో ఒంగతీసిఒప్పించడం కూడా మంచిపనికాదు. కోళ్ళనికూడ సమాజపరం చెయ్యవలసిన అవసరంలేదు. మనంయేర్పాటు చేసేది సమిష్టివ్యవసాయ క్షేత్రంకాని 'కమ్యూన్' కాదు."

"అబ్బో, చాలా గొప్పసిద్ధాంతమే! కాని సమాజపరంచేసిన కోళ్ళని తిరిగి ఇచ్చెయ్యడం యెందుకు? అసలు మీరు వాటిమాట తలపెట్టకుండానే ఉండవలసింది, కాని తలపెట్టి వెనకంజవెయ్యడంలో అర్థంలేదు. మీరు ధాన్యపు ఫండు వసూలు చెయ్యలేదు. పోనీ రైతుల్ని అందర్నీ సమిష్టివ్యవసాయక్షేత్రాల్లో సభ్యులుగా చేర్చేరేమో అంటే అదీలేదు. చివరకు వ్యవసాయ పనిముట్లేనా మరమత్తు చెయ్యలేదు."

"పనిముట్ల మరమత్తు విషయమై ఈవేళే వడ్రంగితో చెప్పి ఏర్పాటు చేసి వచ్చేను."

"ఆ—అదిగో; నేను చెప్పేదికూడ అదే. ఈపాటికి పూర్తి చెయ్యవలసిన పనులు ఇకపైన ప్రారంభిస్తామంటున్నారు. అక్కడికి ప్రచారకదళాన్ని ఒకదాన్ని తప్పకుండా పంపించవలసిందే! ఎల్లా పనిచెయ్యాలో నేర్పుతారు."

"తప్పకుండాను! దానివల్ల చాలా వుపయోగం వుంటుంది."

"కాని ప్రస్తుతం అవసరంలేని పనిమాత్రం అతి తొందరగా చేసేరు. సిగరెట్టుఒకటితీసుకోండి." సెక్రిటరీ సిగరెట్టు పెట్టి డేవిడోవ్ వైపు జాపేడు. "భాగ్యవంతుల్ని ఎక్కించుకొని మీ బళ్ళు ఇక్కడికి వచ్చేటప్పటికి నిర్ఘాంతపోయేము. జఖర్ చింకో జి. పి. యు నుంచి, 'వీళ్ళనందర్ని నేనుఏం చెయ్యను? వీళ్ళవిషయమై నాకు పైనుంచి యేమీ వుత్తరువులు రాలేదు. వీళ్ళందరిని తీసుకువెళ్ళడానికి బళ్ళుకావాలి. ఎల్లాతీసుకు వెడతాను, ఎక్కడికితీసుకు వెడతాను?' అని రాసేడు. మీరు ఏంచేసేరో బోధపడిందా? అలా చెయ్యమని మీకు ఉత్తరువులు యివ్వలేదు, పైగా వారికోసం మేము ఏ యేర్పాటు చెయ్యలేదు............"

"నేను మాత్రం వాళ్ళని ఏంచేసుకోను?" డేవిడోవ్‌కి కోపంవచ్చింది. ఆకోపంచేత గట్టిగాను, తొందరగాను మాట్లాడడంప్రారంభించేడు. వాలిక పళ్ళమధ్యనున్న తొస్సిలో పడి మాట అస్పష్టం అయింది. "వాళ్ళని మెడకి కట్టుకుంటానా? ఖాప్రోవ్ అనే బీదరైతుని అతని భార్యని ఖూనీ చేసేరు."

"విచారణలో అది రుజువు అవలేదు." సెక్రిటరీ అతనిమాటకి అడ్డం

వచ్చేడు. "దానికి వేరే కారణం ఏదో ఉండి వుంటుంది."

"అట్టే సమర్థత లేని పరిశోధకుడు; అందుచేత ఏమీ ఆచోకీ తియ్యలేక పోయేడు. ఏవో 'ఇతర కారణాలు' వున్నాయి అంటాడు. శుద్ధ తెలివితక్కువ. అది భాగ్యవంతులు చేసిన పనే; సందేహం లేదు! సమిష్టివ్యవసాయ క్షేత్రనిర్మాణానికి ఏవో అడ్డంకులు కల్పిస్తూ దాన్లో చేరవద్దని ప్రచారం చేస్తుండేవారు. అందుచేత వాళ్ళబాధ వదుల్చుకోడానికి ప్రవాసం పంపించేము! ఇదంతా ఎందుకు పోగు చేస్తున్నారో అర్థం కాకుండా వుంది. మీరు........."

"చాలా అసందర్భంగా వుంది మీరు అనేది. కొంచెం ఆలోచించి మరీ మాట్లాడుతూ ఉండండి. అంతా కలిసి కూడబలుక్కొని ఒక నియమప్రకారం చెయ్యాలి కాని, యెవరికి తోచినట్లు వాళ్ళు ప్రవర్తించి ఎక్కడికక్కడ చెయ్యడం పనికిరాదు. భాగ్యవంతుల్ని అందర్నీ గ్రామంలోనుంచి గెంటేసి మీ సౌకర్యము మీరు చూసుకున్నారు, కాని దానివల్ల మాకు యెంతటి విషమసమస్య తెచ్చిపెట్టేరో ఆలోచించారా! ఎవళ్ళ బాగు వాళ్ళు చూసుకుంటారు అంతే; ఒళ్ళమీద వాళ్ళని తీసుక వచ్చి ఇక్కడ వదిలెయ్యకపోతే, రిజియనల్ పట్టణానికి తీసుక వెళ్ళి దిగబెట్టకపోయేగా!"

"మాకు ఒళ్ళు అవసరంగా కావలసి వచ్చేయి."

"నేను చెప్పేది కూడా అదే—నేను నా పిల్లలూ బాగుంటే మొగుడు లోకంతో పాటు. బాగా నే వుంది! దానికే వస్తానండి. ఇప్పుడు మీరు చెయ్యవలసిన పనులేమిటంటే—ధాన్యపు పథకం పూర్తిగా పోగు చెయ్యడం, వల్లికల నాటికి వ్యవసాయ పనిముట్లు సిద్ధం చెయ్యడం. రైతుల్ని అందరినీ సమిష్టివ్యవసాయ క్షేత్రంలో సభ్యులుగా చేర్చండి. మీ సమిష్టివ్యవసాయ క్షేత్రం ఒక్కటీ విడిగా వుంటుంది. ఈ జిల్లాకంతకీ మారుమూల అయిపోయింది, వేటితోను కలపడానికి అందుబాటులో లేదు." మోచేతులు టేబులుమీద ఆని రెండు చేతులలోను తల పెట్టి ఒక్క నిముషం వరకు నిశ్శబ్దముగా ఉండి మారు కంఠంతో మళ్ళీ చెప్పడం ప్రారంభించేడు:

"జిల్లా వ్యవసాయ సంఘపు ఆఫీసుకి వెళ్ళి మీ ప్లాను నిశ్చయించేయిం

వండి. అక్కడినుంచిభోజనశాలకువెళ్ళి భోజనం చెయ్యండి. లేకపోతేమీరు భోజనానికి ఆలస్యముగా వెళ్ళినట్లయితే, అక్కడదొరకదు, అందుచేత తిన్నగా మాయింటికి వెళ్ళి అక్కడతినండి. ఒక్కనిముషం ఆగండి చీటివ్రాసిఇస్తాను.”

అతడు గబగబా కాగితంమీద రెండు అక్షరాలుబరికి డేవిడోవ్‌కి ఇచ్చేడు. అంతటితో మళ్ళీ తనకాగితాలు తిరగేసిచూస్తూ, డేవిడోవు వైపు చెయ్యి జాపేడు.

“తరువాత వెంటనే గ్రామాచీలింగ్‌కి వెళ్ళిపొండి. సెలవు. మీవిషయమైబ్యూరోలో ఎదట తీసుకువస్తాను. ఏమో చెప్పలేను. బహుశా అల్లాచెయ్యనులెండి. పనులన్నీ కొంచెంచురుకుగా సాగించండి. లేకపోతే తీవ్రచర్యలకు లోను కావలసి వస్తుంది మీరు!” అన్నాడు.

డేవిడోవ్ బయటికివచ్చి ఆకాగితంవిప్పి చూసేడు. ఊదా పెన్సిలుతో కలిపి వ్రాతలో ఇలావ్రాయబడి వుంది.

“లిజా! ఈ చీటి తీసుకొనివచ్చిన వారికి మారుమాటాడకుండా వెంటనే భోజనంపెట్టి పంపవలసినదని తెలియచేస్తున్నాను.”

జి. కార్పిన్‌స్కీ.

“ఛీ! తిండితినకుండానైనా వెళ్ళిపోతాను కాని ఈ ఆర్డరు చూపించి భోజనంచెయ్యను.” అనుకుంటూ డేవిడోవ్ జిల్లావ్యవసాయ సంఘ కార్యాలయానికి వెళ్ళిపోయేడు.



# ఇరువదియొకటవ ప్రకరణము.

## తోలకరికి ప్లాను.

ప్లానుప్రకారము స్ప్రింగుకి (మార్చి ఏప్రిల్ మే) 1180 ఎకరాలభూమి దున్నవలసియుండెను. ఇందులో 225 ఎకరాలబీడును సేద్యంలోకితీసుకురావలసియుండెను. 'ఆటమ్' లో (ఆగస్టు సెప్టెంబరు అక్టోబరు) ఆప్రాంతరైతులు 1600 ఎకరాలభూమి సేద్యంచేశారు. అందులో 440 ఎకరాలభూమిలో రైచల్లేరు.— స్ప్రింగులో సేద్యం చెయ్యడానికి అంచనా వేసినభూమిలో 1670 ఎకరాల భూమి గోధుమకి, 440 ఎకరాలు 'రై' కి, 220 ఎకరాలు బార్లీకి, 125 ఎకరాలు 'ఓట్లు' కి, 165 ఎకరాలు మొక్కజొన్నకి, 420 ఎకరాలు జొన్నకి 110 ఎకరాలు 'సన్‌ఫ్లోర్' కి, 32 ఎకరాలు జనుముకి నిర్ణయించబడింది. ఈ 3182 ఎకరాల భూమి కాక 232 ఎకరాల యిసుకభూమి పుచ్చకాయలు పండించడానికి వేరుచెయ్యబడింది.

ఫిబ్రవరి 12వ తారీఖు సమావేశమైన 'ఉత్పత్తి సమావేశము' లో 40 మంది సమిష్టివ్యవసాయక్షేత్రప్రముఖులు హాజరయ్యేరు. Seed grain fund పోగుచేయుట, పొలాల్లో పనిచేసే కూలీలకు రోజువారీగా చేసేపని నిర్ణయము చేయుట, పల్లికల కాలంలో పనిముట్లు మరామతు వెంటనే జరిగేయేర్పాటు చేయుట మొదలైనవిషయాలమీద సమగ్రమైనచర్చ జరిగింది.

ఆస్ట్రోవ్‌నోవ్ సలహామీద ప్రతి ఎకరానికి 15 కుంచాల చొప్పున మొత్తం 1000 బస్తాలు grain fund కి కేటాయింపు చెయ్యాలని డేవిడోవు ప్రపోజుచేసేడు. వెంటనే పెద్దగోల బయలుదేరింది. ఒకరిమాట ఒకరు వినిపించుకోకుండగా టిటాక్ ఇంటికప్పు యెగిరిపోయేలా అరవసాగేడు.

"అది చాలాయెక్కువ."

"అసలు అంతపోగుచెయ్యడం అసంభవం."

"ఇంతవరకు, బొందుయిసగ భూమిలోకూడ యెకరానికి అన్ని విత్తనాలు చల్లలేదు."

"ఎవరేనా వింటే నవ్విపోయేరు!"

"ఎకరానికి 10 కుంచాలుఅయితే యెక్కువ."

"ఆగండి! ఆగండి! ఈగోలయేమిటి!" రెండోదళం నాయకుడైన లుబిష్కిన్ గట్టిగా కేకేసేడు. "మాటవినబడకుండగా ఇల్లాగోలపెడతే యెల్లాగ?"

"నీకుతోచినంతసేపు మాట్లాడు! యెవరువద్దన్నారు!"

"నాభిదగ్గరనుంచి చించుకొని యెల్లా అరుస్తున్నారో! యింతకంటె పశువులునయం. ఇగ్నాట్! ఎద్దులా అల్లా రంకెవేస్తున్నావేమి? చాలాశ్రమపడ్డావు. ఈపాటికి తగ్గు."

"నీతక్కువేముంది, చెవికోసినమేకలా నువ్వుమాత్రం అరవడంలేదు!"

"లుబిష్కిన్ ని మాట్లాడనియ్యండి."

"ఈగోలకి చెవులు తడతలు కడుతున్నాయి."

చాలసేపటివరకు గోలతగ్గనేలేదు. కాని కొంతసేపటికి బాగాఆర్చేవాళ్ళకి ప్రాణంవిసిగి కొంచెంతగ్గేరు. వెంటనే డేవిడోవ్ విపరీతమైన క్రోధంతో గర్జించసాగేడు.

"సమావేశం యెక్కడేనా ఇల్లావుండడంచూసేరా? ఒకరిమాటఒకరికి వినబడకుండా అరుస్తే వుపయోగంయేమిటి? ఒకరితరువాత ఒకరు అంతా మాట్లాడండి. సంతగోల పెట్టినందువల్ల యేమీలాభం లేదు. కొంచెం మెదడు పయోగించాలి." కొంచెంనెమ్మదిగా మళ్ళీప్రారంభించేడు. "ప్రాక్రామిక కూలీలదగ్గరనుంచి మీరు మీటింగులు ఎల్లా జరుపుకోవాలో నేర్చుకోవాలి. మేము ఏపాక్టరీలోగాని, క్లబ్బులోగాని మీటింగు జరుపుతుంటే ఎంతప్రశాంతంగా సక్రమంగాజరుపుకుంటాము! ఒకరుమాట్లాడుతుంటే మిగిలినవాళ్ళంతా వింటూంటారు. కాని మీరు అంతాఒక్కసారిగా మాట్లాడి ఒకరిమాట ఒకరికి వినబడకుండా చేస్తూన్నారు."

"ఒకరు మాట్లాడుతున్నపుడు ఇతరులెవరేనా గోలపెట్టేరంటే ఈకర్ర

"నేను దూడలపాకలో పడుకోవలసిన పని లేదు. మీరునన్ను కేకలు వెయ్యవలసిన అవసరం లేదు. ఆమాత్రం ధైర్యం వుంటే, ఆ పశువుల్ని తిరిగి తోలుకురండి చూద్దాం. మాటలకీ చేతలకీ చాలాదూరం."

ఆ రోజంతా వాటికోసం అంతటా గాలించేసేరు. చివరికి సాయం కాలానికి దిట్టమైన కొపలాక్రింద ఆపశువులు స్టెప్పీలో వొకమూలమూల మేస్తూండడం చూసేరు. లుబిష్కిన్, అగాఫన్, మూడవదళం తాలూకు మరి ఆరుగురు సభ్యులు కలిసి గుఱ్ఱాలమీద స్టెప్పీలోకి వెళ్ళేరు. దూరాన్ని వొక వాలులో మేస్తూన్న యెడ్లని చూడగానే లుబిష్కిన్ ఆగిపోయి తన దళాన్ని రెండు భాగాలుగా విభజించేడు.

"అగాఫన్, నువ్వు యీ ముగ్గురితోనూ ఆ పల్లంలోనుంచి వేగంగా వచ్చి వాళ్ళ కుడివైపుకి కమ్ముకురా. నేను యెడమ వయిపుకి వస్తాను. లుబిష్కిన్ తుమ్మెద రెక్కలలాంటి మీసాలు వడేస్తూ, "గుఱ్ఱాల్ని అదలించండి! నా వెనక్కాలే గేలప్ మీద రావాలి!" అని ఆజ్ఞాపించేడు.

చివరకి పేచీ అవుతేగాని ఆ విషయం పరిష్కారం అవలేదు. ఎడ్లని కాపలా కాస్తూన్నారు. లుబిష్కిన్ మేనత్తకొడుకు జఖార్ అనేవాడు,మరి ముగ్గురూ కలసి 'మిష్కా ఇగ్నటినోనక్'ని కాలు పట్టుకుని గుఱ్ఱంమీది నుంచి క్రిందకి లాగేసేరు. ఆ పడడంలో అతనికి వొళ్ళంతా కొట్టుకుపోయింది. ఇదిచూసి [illegible] శృతిమించుతూందని లుబిష్కిన్ చేతిలోనున్న కొరడాకొద్దీ జఖార్‌ని తోలూడేలా కొట్టేడు. మిగిలినవాళ్ళుకూడా ఆగొడ్ల కాపలావాళ్ళని తరిమేసి పశువుల్ని అన్నింటినీ వూళ్ళోకి తోలుకుపోయేరు.

దేవిడోవు పశువులకొట్టాలు, గుఱ్ఱపుసాలలు, గాత్రులందు తాళాలు వేసి, వంతుల ప్రకారము సమిష్టి వ్యవసాయ క్షేత్ర సభ్యులు కాపలా కాస్తూండాలని ఆజ్ఞాపించేడు. ఇంత జాగ్రత్త తీసుకున్నాకాని మొత్తం రెండురోజులలో రాజీనామాలు యిచ్చిన సమిష్టి వ్యవసాయ క్షేత్ర సభ్యులు యేనుకాళ్ళ యెడ్లు, మూడు గుర్రాలను తీసుకొనిపోయేరు. ఊళ్ళో పెద్ద వాళ్ళు కనిపెంచకపోతే యెవరు యెత్తుకుపోయినదీ తెలిసిపోతుందని చిన్నపిల్ల

ల్ని యిచ్చి వాటిని స్టెప్పీలోకి దూరంగా తోలేసేరు.

పొద్దస్తమానూ రైతులు సమిష్టి వ్యవసాయ క్షేత్రపు ఆఫీసులోనూ, గ్రామ సోవియటులోనూ, యెడతెరపి లేకుండా వుంటూన్నారు. వాళ్ళు సమిష్టి వ్యవసాయ క్షేత్రపు భూముల్ని, బలవంతంగాఆక్రమిస్తామని మేనేజిమెంటుకి బహిరంగంగానే చెప్పడం మొదలెట్టేరు.

"వెంటనే మాకు భూములియ్యండి. లేకపోతే యెవళ్ళ భూముల్ని వాళ్ళం దున్నుకుంటాము." అని దేవిడోవుని వొత్తిడి చేసేరు.

"అందరకీ భూములిస్తాము; అంత తొందర పడితే యేలాగ. రేపటి నుంచి ప్లాట్లు యేర్పాటు చెయ్యడం ప్రారంభిస్తాము. ఆస్ట్రొవ్నోవు దగ్గరకి వెళ్ళండి. ఈ విషయం అంతా అతను చూస్తూన్నాడు." అని దేవిడోవు వాళ్ళని కొంచెం శాంతపరచేడు.

"ఏలాంటి భూమి యిస్తారు,— అది యెక్కడ యిస్తారు?"

"ఎక్కడ ఖాళీగావుంటే అక్కడ."

"అయితే దూరముగా పొలిమేరలో యెక్కడో గాని ఖాళీగా లేకపోతే?"

"కామ్రేడ్ దేవిడోవు, యేమిటి యిదంతా! ఊరికి దగ్గరగావున్న భూములన్నీ వుచ్చేసుగుని యెక్కడో దూరంగా వున్న భూములిస్తారా? ఎడ్లనివ్వకపోతే ఆవుల్ని కట్టుగుని వ్యవసాయం చేస్తామనుకున్నారా? పోనీమా భూములేనా యిస్తారేమో అనుకుంటే అవన్నీ స్వాధీనం చేసేసుగుని యెక్కడో దూరంగా వున్న భూములిస్తారా! ఆహా — ప్రజాస్వామ్యం అంటే యిలాగేవుంది!"

సమిష్టి వ్యవసాయ క్షేత్రపు భూమి అంతా వొక్కచోట వుండాలి కాని ముక్కల ముక్కలకిందవుంటే వీలు వుండదనియు, అదియుకాక అంత క్రితం చేసిన యేర్పాటులన్నీ మార్పు చెయ్యడానికి వీలులేదనీ, దేవిడోవు వాళ్ళతో చాలసేపు వాదించి, విపులంగా చెప్పేడు. చివరకి చేసేదిలేక వాళ్ళంతా ధుమధుమలాడుతూ లేచిపోయేరు. ఇంతలో మరో గుంపు లోప

లికి తోసుకువచ్చింది.

"మాభూములు మాకివ్వక యీజబర్దస్తీ యేమిటి? ఇల్లా చెయ్యడానికి నీకు యేమి హక్కుంది? అయితే మమ్మల్ని వ్యవసాయం చేసుగోనివ్వరన్న మాట. కామ్రేడ్ స్టాలిన్ చెప్పినది యిదేనా? మీరు మా పశువుల్ని తిరిగి యివ్వకపోవడమేకాక, పైగా భూములుగూడా ఆక్రమించుకొని కూర్చున్నారని పయికి తెలియచేస్తాము. మీ ధోరణి చూస్తే మేముబ్రతిగి వుండడం మీకు యిష్టంలేనట్టుంది."

"యాకోవు లూకచ్! ఆ పాడుచెరువు అవతలనున్న భూమి ప్లాట్లుక్రింద విడతీసి అందరికీ యిచ్చెయ్యి. ఆలస్యం చెయ్యక ఆ విషయము రేపు వుదయాన్నే చూడు."

"రుప్పా- రుటూర్రివున్న ఆ చిట్టడవేనా?" అన్నారు వాళ్ళు.

"అది బీడు. చిట్టడవి యేలా అవుతుంది? పదిహేను సంవత్సరాల క్రితంవరకూ సేద్యంలోనే వుండేది." అన్నాడు. యాకోవు లూకుచ్.

దానితో మళ్ళీ వాళ్ళు చెలరేగేరు.

"ఆ పాడుభూమి మాకక్కరలేదు."

"ఆభూమి అయినా యేంపెట్టి దున్నుతాం.? ఏమిటి యీ భాగోతము అంతా!"

"మాకు సేద్యంలో వున్న మంచిభూమి కావాలి."

"పోనీ ఆభూమి అయినాసరే వ్యవసాయం చేసుగుంటాము, మాదూడలను యిచ్చెయ్యండి."

"ఈ దౌర్జన్యమంతా స్వయంగా స్టాలినుకి తెలియచేద్దాం రండర్రా!"

"మమ్మల్ని అందరినీ తిండి లేకుండాచేసి మాడ్చి చంపుదమనా?"

ఆడవాళ్ళుకూడా కోపంతో వుడికిపోతూన్నారు. దానికి తగ్గట్లుగా కోసక్కులు వెనకనుంచి రెచ్చగొట్టడంతో మరీ రెచ్చిపోయేరు. అంతవరకూ వోపిక పట్టియున్న దేవిడోవుకికూడా కోపం ఆగక,

"ఉన్నవాటిలో మంచి భూములన్నీ మీకు యిచ్చెయ్యమంటారా?

అదిమాత్రం యెన్నడూ జరుగదు. సోవియటు ప్రభుత్వం సమిష్టి వ్యవసాయ క్షేత్రాల అభివృద్ధికి కావలసిన సౌకర్యాలు కలగచేస్తుంది. కాని వాటికి వ్యతిరేకులయిన మీవంటివారికి కాదు. వెంటనే యిక్కడినుంచి లేచిపొండి. మీ యిష్టం వచ్చినట్లు చేసుకోండి." అనితీవ్రంగా అన్నాడు.

అక్కడా, అక్కడా కొంతమంది కోసక్కులు తమ భూములు దున్నుకోడం ప్రారంభించేరు. కాని లుబిష్కిన్ వాళ్ళనందరినీ బయటికి గెంటేసి సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి స్వాధీనం చేసేడు. యాకోవు కొలతకి కావలసిన పరికరాలు తీసుకొని రెండు రోజులలో పాడుచెరువు అవతలనున్న భూమి ప్లాట్లక్రింద విడతీసి యెవరివాటును వారే స్వంతంగా వ్యవసాయం చేసుగుంటానన్న వారికందరికీ పంచి యిచ్చేడు.

మార్చి 25వ డెమ్కా ఉషాకోవు దళం యిసుగ భూమి దున్నడానికి బయలుదేరింది. దేవిడోవు పనిచెయ్యడానికి సమర్థులయిన సమిష్టి వ్యవసాయ క్షేత్ర సభ్యుల్ని అందరిని దళనాయకుల ఆధీనం చేసేడు. ముసలివాళ్ళలో కూడా చాలామంది అరక పట్టడం అంటే, గుంటక తోలడం అంటే, మొదలయిన సులువైన పనులు చెయ్యడానికి వాళ్ళతోకూడా వెళ్ళేరు. మూడు కాళ్ళ ముసలి అకిమ్ బెస్క్లిబ్నోవు కూడా విత్తులు చల్లడానికి వెళ్ళేడు. దేవిడోవు ఘూకర్‌ని సమిష్టి వ్యవసాయ క్షేత్రపు ఆఫీసులో వుండడానికి నియమించేడు. అంతా సిద్ధం అయింది. కాని వర్షాలవల్ల పని ఆగిపోయింది. రెండు రోజులపాటూ గ్రెమాచీలాగ్‌లో యేళ్ళు, కోళ్ళు యేకమయాలా వర్షం కొట్టికొట్టి కురిసింది.

సమిష్టి వ్యవసాయ క్షేత్ర సభ్యత్వానికి రాజీనామాలు యిచ్చేవాళ్ళంతా యిచ్చేసేరు. ఇంకస్థిరమయినవాళ్ళెవరో వాళ్ళుమాత్రం నిలబడ్డారు. అందరికంటె ఆఖరున రాజీనామా యిచ్చినది, ఆండ్రీ భార్య మేరియా పొయార్కొవా. క్రమంగా, వాళ్ళిద్దరికీ మనస్పర్థలు కలిగేయి. మేరియాకి మతంమీద భక్తి హెచ్చింది. లెంటు 40రోజులు వుపవాసంవుండి మూడవ వారంనుంచి ప్రతిరోజు చర్చికి వెళ్ళి వెనక చేసిన పాపం పోవడానికి దేవుణ్ణి

ప్రార్థిస్తూ, ప్రసాదం తీసుకుంటూండేది. ఆండ్రీ యెన్ని తిట్టినా లెక్క చెయ్యక మాట్లాడక వూరుకునేది. ఒకరోజు రాత్రి, ఆండ్రీ బాగా ప్రొద్దు పోయి యింటికివచ్చేటప్పటికి గదిలో దేవుడుపట్టి దగ్గర దీపం వెలుగుతూంది. వెంటనే తనుచేసేపని మంచిదా, చెడ్డదా అని ఆలోచన అయినా చెయ్యకుండానే ఆ గదిలోకి వెళ్ళి దీపం ఆర్పేసి, దాన్లోని చమురు చేతులో వేసుగుని, కాలినున్న బూట్లకి పట్టించేసుగున్నాడు. తరవాత ఆదీపపుసెమ్మె విరిచి అవతల పారేసేడు.

"మూర్ఖప్రముండలకి యిదంతా చాదస్తం అనీ, అదొక పిచ్చిఅనీ యెన్నిసార్లు చెప్పితే యేమిలాభం. వాళ్ళుమాత్రం ఆకర్రబొమ్మని పూజించడం, దీపాలు పెట్టి నూని తగలెయ్యడం మాత్రం మానరు. ఆఖరికి దీన్నిపట్టుగుని చావకొడితేకాని మానేటట్టు లేదు. ఈ మధ్య రోజూ చర్చికి వెడుతూంది యేదో వుంది దీనిలో."

అతను అన్నట్లు నిజంగా యేదో వుంది! మార్చి 26వతారీఖున మెరీనా తన సమిష్టి వ్యవసాయ క్షేత్ర సభ్యత్వానికి రాజీనామా యిచ్చేసింది 'దానిలో వుండడం దేవుడికి అపచారం చెయ్యడం' అన్న మిషతో.

"అయితే నువ్వు ఆండ్రీతో కాపురం చెయ్యడం లేదూ? అదిమాత్రం తప్పుపని కాదేమో!" అని అడిగేడు లుబిష్కిన్ చిరునవ్వు నవ్వుతూ. "లేకపోతే అది మనస్సంతృప్తికోసం చేసేదికనక తప్పుకాదులావుంది!"

అప్పటికీ మేరీనా మాట్లాడక వూరుకుంది.

ఇంతలో గ్రామ సోవియటునుంచి ఆండ్రీ అతికోపంతో పరుగెత్తుకు వచ్చేడు. చొక్కా చేతితో నుదుటి మీద చెమట తుడుచుగుంటూ, దేవిడోవు, యాకోవు లూకిచ్ అందరూ వుండగానే,

"మెరీనా నన్ను నాశనం చెయ్యకు; నలుగురిలోనూ తలవంపులు తేకు! ఇప్పుడు నువ్వు యెందుకోసమని రాజీనామా యిస్తున్నావు? నిన్ను పువ్వుల్లో పెట్టి పూజిస్తున్నానే. వాళ్ళు నీ ఆవుని యివ్వనే యిచ్చేసేరు .........., ఇంకా యేం కావాలంటావు? రాజీనామా తీసేసుకో" అన్నాడు.

"ఇంక అలాంటి మాటలేమీ చెప్పనక్కరలేదు." నాదగ్గర. అంది మెరీనా కోపంగా. "నేను వొక్క నిముషంకూడా దానిలో వుండదల్చుకో లేదు. అందుచేత మళ్ళీ నన్ను అడగనక్కరలేదు. సమిష్టివ్యవసాయక్షేత్రంలో వుండడం నాకు యెంతమాత్రం యిష్టంలేదు. నా నాగలి, బండి అవీ పారెయ్యండి. వెళ్ళిపోతాను."

"మెరీనా! తొందరపడకు, జాగ్రత్తగా ఆలోచించుకో. లేకపోతే మనం యిద్దరం విడిపోవలసివస్తుందిసుమా!"

"ఛీ అవతలకిపో నీకుంప తెగ! నిన్న రాత్రి ప్రక్కసందులో మలాష్కా ఇగ్నటియస్నోవాతో నిలబడిన దెవరు, నువ్వు కాదూ! పైగా నన్ను వొదిలి పెడతానని బెదరిస్తూన్నావా! నువ్వు లేకుండా నేను బ్రతకలేకపోయినప్పుడు చూస్తానులే. నీకు యీ వుద్దేశ్యం చాలా కాలమునుంచి వున్నదన్న సంగతి నాకూ తెలుసును."

"మెరీనా అల్లా అని యెవరు చెప్పేరునీకు! నా జన్మలో యింతవరకు యెప్పుడూకూడ మలాష్కాతో పక్క సందులో నిలబడి మాట్లాడలేదే! ఇంతకీ సమిష్టి వ్యవసాయ క్షేత్రంలోనుంచి విడిపోవడానికీ దానికీ సంబంధం యేమిటి?" ఇంక యేమి మాట్లాడడానికీ తోచక ఆండ్రీ రెండు చేతులతోను తలపట్టుకుని వెర్రిమొహం చూస్తూ నిలబడ్డాడు.

"ఆండ్రీ! ఆరాక్షసిముండని బ్రతిమాలుతున్నావేమిటి!" అని లుబిష్కిన్ కలగచేసుకున్నాడు. "'రెడ్ పార్టిజాన్'వు ఆమాత్రం గౌరవం నిలపెట్టుకో వద్దూ! పైవాళ్ళు యేమనుకుంటారు! వెర్రిమొహంవేసుకు చూస్తూ, దానికి యేదో నచ్చ చెప్పబోతావేమిటి, ఊచి పుచ్చుకుని రెండు కొట్టక! చచ్చీలా కొడితే యీ పొగరు అంతా అణిగిపోను!"

దెబ్బతిన్న తాచులా మెరీనా చర్రున లేచి చొక్కా చేతులు పైకి యెగతోస్తూ, లుబిష్కిన్ మీదకి వెళ్ళింది.

"ఏమిట్రా—నెలతక్కువ వెధవా, ప్రతివిషయంలోనూ నువ్వేకలగచేసుకుంటావేమిటి! ఒళ్ళు కొవ్వుపట్టి యేడుస్తున్నావు! తాట వొలుస్తాను రా!

బ్రిగేడు లీడరువుకదా అని యెవరికీ భయం లేదు యిక్కడ! నీవంటి చవటల్ని అనేకమందిని తుక్కు తుక్కు చేసేసేను."

"ముందు నిన్ను తుక్కుచేస్తాను రా! ఒళ్ళుపొగరెక్కి యేడుస్తున్నావు" అని లుబిష్కిన్ పయికి గంభీరంగా అన్నాడేకాని పరిస్థితులు యేలా పరిణమిస్తాయో కాపలాలో వుంటే మంచిదనే వుద్దేశ్యంతో వెనకతగ్గి గోడని చేరబడి నిలబడ్డాడు. టుబ్యాన్స్కోయ్ మిల్లుదగ్గర మెరీనా వొక దిట్టమయిన కోసక్కుతో దొమ్ములాడడం లుబిష్కిన్‌కి జ్ఞాపకం వచ్చింది. మిల్లులోనున్న వాళ్ళంతా చుట్టూచేరి సరదాగా చూస్తూంటే, కొద్దిసేపట్లోనే మెరీనా ఆ కోసక్కుని క్రింద పడతోసి గుండెలమీద కూర్చుని లేవకుండా నొక్కిపెట్టి "నాయనమ్మా, ఆడదానిమీద పడుకుని నువ్వు యేమీ చెయ్యలేవు!"అని వూపిరి తీసుగుని మళ్ళీ "నీవంటి ఊనాపి ఆడదానికిౖంద పడుకుని ఒగర్చడానికితప్ప యెందుకూ పనికిరాడు." అంటూ అతనిమీదినుంచి లేచి దొమ్ములాటలో రుమాలు వూడిపోవడంచేత చెదిరిపోయిన జుట్టు సవరించుగుంటూ మిల్లులోకి వెళ్ళిపోయింది. ఒళ్ళంతా దుమ్ము, పేడపట్టుకున్న ఆకోసక్కు నెమ్మదిగాలేచి చిన్నబుచ్చుకున్న మొహంతో వెళ్ళిపోవడం లుబిష్కిన్‌కి కళ్ళలో మెదిలింది. అందుచేత లుబిష్కిన్ తగుజాగ్రత్తలో నిలబడి పయికి మేకపోతు గాంభీర్యంగా,

"నామీదికి రావద్దు, వొస్తే మాత్రం మాటదక్కదు. జాగ్రత్త" అని అదమాయించేడు.

"ఒరేయ్—చచ్చు వెధవ! నాదెబ్బ యెప్పుడూ రుచి చూ ద లే దు లావుందే!" అంటూ మేరియా మహాకోపంతో గాను పయికి లాగేసి లుబిష్కిన్ మీదకి వెళ్ళింది. ఆమె గులాబిరంగు మదమలు దృఢంగా మిసమిసలాడుతూ పచ్చగానున్న శరీరము, లుబిష్కిన్ కళ్ళముందు తళుక్కుమంది. లుబిష్కిన్ కూడా అతనికాలంలో అనేకమంది ఆడాళ్ళని చూసేడుగాని మెరీనా శరీరపు జిగ జిగ, దారుఢ్యము చూసేటప్పటికి గుండెలు పీచు పీచు మన్నాయి. ఇంకఅక్కడ నిలుచుంటేలాభంలేదని "ఆడది కాదు యిది రాకాసి

కాని! యెల్లావుందో దీన్ని తగలెయ్యా" అని తిడుతూ చల్లచల్లగా బయటికి జారేడు.

డేవిడోవు కడుపు వుబ్బేలా నొక్కేసినవ్వు. లుబిష్కిన్ వెనక్కాలే రజ్మట్నోవు కూడ బయటకు వెళ్ళి భడేలున తలుపు తేసేసి లేచిపోయేడు. ఇంక కోపంచేత వొళ్ళు తెలియకుండా కేకలేస్తూన్న మేరియాని సద్దుబాటు చెయ్యడానికి యాకోవు లూకుచ్ నొక్కడుమాత్రం మిగిలేడు.

"ఊరికే ఆలా కేకలేస్తావేమిటి సబవు, సందర్భం లేకుండా! ఎంత సిగ్గు! గౌను పయికి యెత్తెయ్యడమా! పోనీ పెద్దవాడిని నేను వున్నాననేనా చూడద్దూ!"

"ఆట్టే వాగక నోరుముయ్యి!" అంది గుమ్మంకేసి వెడుతూ. "నీపెద్ద మనిషి తగవా నాకు తెలియదూ! క్రిందటివేసవిలో మనం గడ్డితెచ్చుకుంటూన్నపుడు నాతో యేమన్నావో జ్ఞాపకం లేదూ! అంతా అందరే మీరు. తోడి కొంగలు."

ఆమె విసవిసా నడుస్తూ వెళ్ళిపోయింది. యాకోవు లూకుచ్ తల పంకిస్తూ, మెరీనా దృష్టి దాటిపోయేవరకూ ఆమెవయిపే చూస్తూ నిలబడి పోయేడు. ఇంకో అరగంటకి మెరీనా మొదటిదళం ఆధీనంలోనున్న తన నాగలి, గొర్రు, మొదలైనవి బండీలో వేసుకుని పొలుకర్రి పట్టుకుని లాక్కునిపోవడం అతనికి కనబడింది. వర్షంరావడంచేత అప్పుడే చేలలోనుంచి తిరిగివచ్చిన డేమ్కా ఉషాకోవు అదిచూచి, ఆమె వెనక్కాలే కొంచం దూరంగా తగుజాగ్రత్తలో వెళ్ళి,

"మెరీనా! యేయ్! నిన్నే, పొకార్కోవా! మాట్లాడవేం! మెరీనా. ఆసామానంతా నా స్వాధీనంలో వుంది. అది నువ్వు తీసుకుపోవడానికి వీలు లేదు." అన్నాడు.

"ఆ— వీల్లేక యేం చేస్తుంది!"

"ఏం— తెలియలేదూ అవన్నీ సమాజపరం చెయ్యబడ్డాయని! ఆట్టే పేచీపెట్టక అవన్నీ యిలా యిచ్చెయ్యి. లేకపోతే నీమీద చోరీనేరంమోపి

కేసు పెట్టవలసి వస్తుంది, జాగ్రత్త. డేవిడోవు అనుజ్ఞ లేనిదే నీకేమీ యివ్వడానికి వీలులేదు."

"వీలులేకపోవడానికి నిన్ను అడిగి యేడిసినవాళ్ళెవరు!"

డెమ్కా యేంచెయ్యడానికి తోచక చేతులు పిసుక్కుంటూ నిలబడ్డాడు. మెరీనా తిరిగి అయినా మాటాడకుండా బండి లాక్కుపోయింది.

"దాన్ని గెంటేసి బండి లాక్కోవలసింది, ఆపాడు మోతుతనం వదిలిపోను. ఇప్పుడు ఆబండి తీసుకురావడం యెలాగ! ఆ రాక్షసి ముండని నిగ్రహించి బలవంతంగా లాక్కురాలేం." అనుకుంటూ యాకోవులూకిచ్ పక్కసందులోకి మళ్ళేడు.

ఆ మరునాడే రజ్మెట్నోవు అతని రైఫిలు, తూటాలు మొదలయినవన్నీ తీసుకుని మెరీనా యింటినుంచి వెళ్ళిపోయేడు. మెరీనాని వొదిలిపెట్టడానికి చాలా కష్టంగానే వుంది. కాని యేంచేస్తాడు. యేదో వ్యాపకం పెట్టుకుని ఆ విచారం మరచిపోవడానికి సాధ్యమయినంతవరకూ వొంటరిగా వుండడము మానేసేడు. అందుచేత పిచ్చాపాటీ మాట్లాడుతూ కాలక్షేపం చెయ్యడానికి నగుల్నోవు దగ్గరకు బయలుదేరేడు.

చీకటి పడింది. వాన కురిసి వెలిసింది! చెదిరిపోతూన్న మేఘాలలోనుంచి బయటకు వచ్చిన చంద్రుడు పశ్చిమాకాశంలో దీపకళికలా వెలుగుతూన్నాడు. ప్రవాహపు చప్పుడుతప్ప అంతటా నిశ్శబ్దంగావుంది: మోకాళ్ళదాకా దిగిపోతూన్న ఆబురదలో అతికష్టంగా నడుస్తూ, ఆండ్రీ యేదో ఆలోచిస్తూ వెడుతూన్నాడు.



## ముప్ఫైయొకటో ప్రకరణము.

### ఛూకర్.

సమిష్టి వ్యవసాయ క్షేత్రపు ఆఫీసులో శాశ్వతంగా బండి తోలేవాడుగా వుండడానికి ముసలి ఛూకర్ మహా సంతోషంగా అంగీకరించేడు. యాకోవ్ లూకిచ్ అతనికి కులక్‌లనుంచి స్వాధీనం చేసుకొన్న, మేనేజిమెంటు కమిటీ సభ్యులు తిరగడానికి వుపయోగించుకుంటూన్న రెండు గుఱ్ఱాలను వప్పచెప్పి,

"వాటిని కంటిని రెప్ప కాచినట్లు కాయాలిసుమా! బాగా మేపుతూ యెక్కువగా పరుగెత్తించక జాగ్రత్తగా చూస్తూండు. ఆ బూడిదరంగు గుఱ్ఱంవుంది చూసేవూ— అది అసలు టిటాక్‌ది. ఒకటోరకం గుఱ్ఱం. ఆడపా తడపా యెప్పుడోతప్ప వీటికి అట్టే పనివుండదు. అందుచేత వీటిని ఆడగుర్రాలమీద దాటిస్తూండవచ్చు. వీటి పూచీఅంతా నీది. జాగ్రత్త." అని చెప్పేడు.

"అన్నిసార్లు చెప్పేదియేమిటి!" అని ముసలిఛూకర్ జవాబు చెప్పేడు. "గుఱ్ఱాలని సంరక్షించడం నాకుచేతకాదనుకున్నారా? నాజీవితంలో అనేక మరేయి యీలాంటివి, నా చేతులలోంచి యెన్ని గుఱ్ఱాలు వెళ్ళేనో హద్దూపద్దూ లేదు."

కాని నిజంచేత జన్మకల్లా శివరాత్రి అన్నట్లు అతని చేతులలోనుంచి రెండు గుర్రాలుమాత్రం వెళ్ళేయి. అందు వొకదాన్ని ఆవుని పిరాయింపు యిచ్చి పుచ్చుగున్నాడు. ఇంక రెండవదాని విషయం ............ ఇరవై సంవత్సరాల క్రితం బాగా తప్పతాగి వయొస్క్వాయ్‌నుంచి తిరిగివస్తూ, దోవలో వొక గిప్సీ దగ్గర 30రూబులకి కొన్నాడు ఆగుర్రాన్ని!

అతను కొనేముందు దాన్ని చూసేటప్పటికి ఆగుర్రం బాగా పూటుగా

పేదరంగు, వేలు చెవులు అదీ అతనికి బాగానే అనింది. "ఆ వాలకం అదీ మంచి వేగంగానే పోతుంది. ఏమీ అనుమానం లేదు." అనుకున్నాడు కడుపులో. ఘూకర్ దోవ పొడుగునా అగిస్సీతో బేరం ఆడుతూనే వున్నాడు దానిని ఏలాగయినా కొనాలని. బేరంఆడడం, యిద్దరికీమధ్యవున్నరకం పోదలెయ్యడం, మళ్ళీ బేరమాడడం—ఇలాగ నలభైసార్లేనా జరిగింది.

"బంగారంకాని గుఱ్ఱమాయిది? దీనిమీదకూర్చుని కళ్ళుమూసుకున్నావంటే చెట్టూ, పుట్ట యేమీకనిపించనంత వేగంగా పరుగెత్తుతుంది. నాగుఱ్ఱమని నేను పొగడుకోడం కాదుకాని వాయువేగ మనో వేగాలతో పోతుంది." అంటూ ఒట్లు పెట్టుకుంటూ గిస్సీ అగుఱ్ఱాన్ని తెగ పొగడేడు.

"దంతాలన్నీ వూడిపోయేయి. ఏమీ అంతఅందగాడు మొహంకూడా కాదు. డెక్కలు బాగా అరిగిపోయేయి. పొట్టచూస్తే పాణకలావుంది. ఏమిటో దీన్ని ఊరికే పొగడుతూన్నావు." అదేమీమంచిదికాదని యేలాగైనా సాధ్యమయినంత తక్కువకి కొట్టెయ్యాలని ఘూకర్ వుద్దేశ్యం.

"పళ్ళు వుంటే యేమిటి— లేకపోతే యేమిటి! గడ్డితక్కువ తింటుంది. అంతేకాని దానివలన నష్టంలేదు. మంచి నడికయస్సులో వుంది. ఏదో రోగం చేత వూడిపోయేయి కాని, పళ్ళు— ముసలితనంచేత కాదు. అందగాడు మొహం కాదంటావు. గుఱ్ఱానికి పరుగుండాలికాని అందం యెందుకు— ఆడుక్కు తినడానికి! డెక్కలుకూడా యికముందు యెదిగి బాగుంటాయి. ఇది యింట్లో వుంటేచాలు యింకేమీ అక్కరలేదు. దానిపొట్ట పాణకలా వుంది అన్నావు. అది బలంచేతకాని, మరేమీ కాదు. స్వారీ తీసిందంటే భూమి వొణుకవలసిందే యేమనుకున్నావో!............ ఏయ్ తాతా! నువ్వు యిచ్చే 30 రూపాయిలకే గొప్ప పందెపుగుఱ్ఱం రావాలని నీఆశ. కాని బ్రతికి వున్నదేదీ రాదు ఆఖరికి. చచ్చిపోయినదయితే దాని మాంసం వూరికేనే దొరుకుతుంది."

మొత్తంమీద యేలాగయితేం అగిస్సీ ఘూకర్ని బుట్టలో పెట్టేడు. పీకులాడి పీకులాడి చివరకు 30రూపాయిలకి గుఱ్ఱం యిచ్చేసి 'వొదలిపోయింది

రా బాబూ' అని తల తడిమి చూసుకున్నాడు గిప్సీ.

ఛూకరు కళ్ళెం చేతపుచ్చుకునేటప్పటికి గుర్రంలో వుండే వెనకటి చురుకుతనం కాస్తాకూడా పోయింది. ఛూకరు దాన్ని గెంటీ, కొట్టీ యెంతో ఆర్భాటం చేస్తే ఆఖరికి ఆగుర్రం అడుగులో అడుగేస్తూ, 'ఈదరోగోడా' అంటూ నడక ప్రారంభించింది. ఇదంతా చూసి గిప్సీ పళ్ళికిలించి పకపకా నవ్వేడు.

"ఏయ్! తాతా, అల్లాటప్పా గుర్రం కాదది. నాదగ్గర 40యేళ్ళు పని చేసింది. ఆఖమపక్షం యింకో అన్నేళ్ళైనా పని చేస్తుంది నీదగ్గర. అయితే— ఒక్కటపనుంది. వారానికి వొక్కరోజుకంటె యెక్కువ మేపుతూండకు; లేకపోతే దానికి పట్టపగ్గాలుండవు. మాలండ్రి సుపేనియానుంచి యీప్రాంతానికి వలస వచ్చినప్పుడు దీనిమీదనే వచ్చేను. అతనికి అది ఫ్రెంచి సైన్యాలు మాస్కోనుంచి తిరిగి పారిపోయేటప్పుడు దొరికింది. నీయెత్తు బంగారము పోసినా దొరకదు ఆలాంటి గుర్రం!" ఛూకరు గుర్రాన్ని యీడ్చుకుపోతూంటే ఆగిప్సీ యింకా యేమిటో అన్నాడు. గిప్సీదగ్గర పక్కనేవున్న గుడారంముట్టూను పిల్లలు గోలపెడుతూన్నారు. ఆడాళ్ళు వొక్కటే నవ్వు. కాని ఛూకర్ యిదేమీ లెక్క చెయ్యక నెమ్మదిగా గుర్రాన్ని లాక్కుపోతూ "యీగుర్రం యెలాంటిదో కొంతసేపటికి నాకే తెలుస్తుంది. నాదగ్గర బాగా డబ్బున్నట్లయితే యీలాంటి గుర్రాన్ని కొనకపోదును. ఆగిప్సీ నాకు మల్లేనే సరదా అయినవాడు. వేళాకోళపు మనిషి. సరే, యేదో వొకటి. మొత్తంమీద గుర్రం అంటూ సంపాదించేము. రేపు ఆదివారం నేనూ, నా పెళ్ళాము కలసి యీగుర్రంమీద జిల్లా పట్టణానికి సంతకి వెళ్ళివొస్తాము." అనుకున్నాడు.

కాని యింకా అతడు టుబ్యాన్‌స్కోకి వెళ్ళకుండానే వొకచిత్రము జరిగింది. ఏదాలాభాల వెనకతిరిగి చూచి, యేంచూసేడో విస్తుపోయేడు. అంతకిత్రంవరకు పెద్దపొట్టాదీ మంచిబలిసివున్న గుర్రం డొక్కలు లోతుకుపోయి పొట్ట బాగా తీసిపోయి ఒక్కచిక్కిపోయి వుంది. అరగంట సేపట్లో

గుర్రం సగం అయిపోయింది. "ఆ! యేమిటిది, ఆశ్చర్యంగా వుంది!" అనుకుంటూ కళ్ళెం జారవిడిచి యెల్లా వున్నవాడు అలా నిలబడిపోయేడు. నిషా అంతా చేత్తో తీసేసినట్లు వొక్కసారిగా పోయింది. గుఱ్ఱం వెనక్కి వెళ్ళి చూసేక అంతగా చిక్కిపోవడానికి కారణం బోధపడింది అతనికి. బాగా మెలితిప్పబడియున్న తోక క్రిందనుంచి, ముక్కలు ముద్దలయీలా మర్యాసన, పురుష్ ఉస్ అని ధ్వనిచేస్తూ, పిచ్చికారీలోనుంచి కొట్టినట్లు వొస్తూంది. "అదీ కారణం." అంటూ రెండు చేతులతోనూ చెలపట్టుగుని నిట్టూర్పు వదిలేడు. కానివెంటనే లేని బలం తెచ్చుగుని గుర్రాన్ని ముందరకి లాక్కుపోవడం ప్రారంభించేడు. టుబ్యాక్ సాక్ వెళ్ళేసరికూ దోవపొడుగునా పారుతూనేవుంది గుర్రం విధివిరామం లేకుండా. ఘూకర్ నెమ్మదిగా యెల్లాగో గ్రిమాచీలాగ్ చేరుకొనే వుండునుగాని టుబ్యాక్ సాక్ దగ్గరకు వెళ్ళేక అవుళ్ళోవున్న తన బంధువులు స్నేహితులు చూస్తూంటే గుర్రాన్ని కళ్ళెం పుచ్చుకు లాక్కుపోతే బాగుండదని తోచి ఆకొంత దూరమయినా గుర్రముమీద యెక్కి నెమ్మదిగా వెడదం అనుకున్నాడు. అతనిలో విపరీతమయిన అహంభావం రేకెత్తి "ఘూకర్ యేమో బీదవాడను కుంటున్నాం. స్వంతంగా గుర్రాన్నికూడా సంపాదించేడే!" అని అందరు ఆశ్చర్యపోతూంటే తను దర్జాగా గుఱ్ఱం మీద వెడుతూ వాళ్ళకి తన గొప్పతనం అంతా చూపించాలనుకున్నాడు. "ఛల్! ఛల్! నిన్ను తగలెయ్యా, అస్తమానూ వెంకితనమే!" అంటూ గుర్రాన్ని అదమాయించి తను యెరిగిన కోసక్కు వొకడు పక్కయింటి తలుపుతీసి బయటికి రావడం ఓనకంటు పరకాయించి గుఱ్ఱం కళ్ళెం బిగలాగుతూ తన దర్జాఅంతా ప్రదర్శించడానికి ప్రయత్నించేడు. కాని బాగా ముసలితనంవచ్చి అడుగుతీసి అడుగు వెయ్యలేని స్థితిలో వున్న ఆగుఱ్ఱంకి పెంకితనం చెయ్యడానికి వోపిక వుంటేకాదూ! ముడికాళ్ళూ అదీ తల వేళ్ళాడేసి నిలబడింది.

"ఇతని యెదుటనుంచి గుర్రాన్ని గేలప్ తీయిస్తూ, వెళ్ళిపోయి వుండవలసింది." అనుకున్నాడు ఘూకర్. ఎముకలన్నీ బయలుపడి అస్థి పంజరంలా

వున్న ఆగుర్రం నడ్డిమీదకి వొక్క యెగురు యెగిరేడు. కాని దురదృష్ట వశాత్తు వెంటనే పెద్ద పరాభవమయింది. ఆవిషయాన్ని గురించి టుబ్యాక్ స్టో ప్రజలేకాక జిల్లా జిల్లా అంతాకూడ యిప్పటికీ చెప్పుగుంటూంటారు. ఛూంకర్ పైకి యెగిరి గుర్రం నడ్డిమీద పొట్ట మోపేడో లేదో వెంటనే గుర్రం యిటూ అటూ వూగింది. కడుపులో గడగడ ధ్వనితో రయ్యిమని పిచ్చికారీలోనుంచి వొదిలినట్లు పారుతూ తైటగిల పడింది. ఆ సందడిలో ఛూంకర్ తొట్రుపడి, రోడ్డుమీద పడిపోయేడు. వెంటనే ఆగుర్రాన్ని నిలువునా చీరెయ్యాలన్నంత కోపంవచ్చి గభాలున లేచేడు. కాని తనకు జరిగిన యీపరాభవం అంతా ఆకోనక్కు చూడడంచేత అతనిదగ్గర యేలాగైనా తన ప్రతిష్ట నిలపెట్టుకోడానికి "ఛీ! నిన్నుతగలెయ్యా! వొళ్ళు కొవ్వెక్కి యేడుస్తున్నావు. నీ రోగం కుదురుస్తానుండు" అంటూ గుర్రాన్ని రెండు కాళ్ళతోనూ గబగబ తన్నేడు. అది నెమ్మదిగా లేచి నిలబడి అంతక్రితం యేమీ జరగనట్లు రోడ్డుపక్కనున్న పచ్చగడ్డి రెండు నోళ్ళు లాగి నమలడం మొదలెట్టింది.

ఇదంతా చూస్తూ నిలబడివున్న కోనక్కు శుద్ధ కోతలరాయుడు, హాస్యగాడూను. ఇంటి ఆవరణ దాటి ఛూంకర్ దగ్గరకివచ్చి ముసిముసి నవ్వు నవ్వుతూ "ఛూంకర్! క్షేమమా. ఇల్లా యెక్కడనుంచి వస్తున్నావు—ఈ గుర్రాన్ని కొన్నావా!" అన్నాడు.

"ఆ—మరేనోయ్. శుద్ధ పెంకిరకం. ఎముకలు కొరికేస్తూంది. మనం దానిమీద కూర్చోబోతే చాలు. ఆమటుకుని పట్టికొట్టి క్రింద పడతోస్తుంది. ఇంతమటుకు దీనిమీద యెక్కి స్వారీ చేసిన వాడెవడూ లేడనుకొంటాను."

ఆకోనక్కు గుర్రంచుట్టూ రెండుసార్లు పరిశీలనగా తిరిగి, పళ్ళూ అవీ చూసి యేమీ యెరగనట్లు అతి అమాయికంగా,

"ఈ వాలకం అవీచూస్తే మంచి మేలుజాతి గుర్రంలా కనిపిస్తుంది. పళ్ళుతీరునిబట్టి 50 యేళ్ళుదాటుతాయనే తోస్తుంది. అయినా యిప్పటికీఅది లొంగడంలేదంటే అసలు అజాతి తరహా అల్లాంటిది" అన్నాడు.

కోసక్కు మాటలువిన్నాక ఘూకరుకి కొంచెం ధైర్యంచిక్కి, "ఇన్నటీ పోర్ఫిరిచ్! అయితేను, యిది చూస్తూండగా అంతట్లోనే చిక్కిపోయింది యెందుచేత? నడిపించి తీసుకువస్తూంటే నాకళ్ళయెదుటే అత్యాశ్చర్యకరంగా మంచు కరిగిపోయినట్లు కరిగిపోయిందిఅంటె వొళ్ళూ. ముక్కులు బొద్దిలయీలా వెధవ పొడుకంపు కొడుతూ, దోవపొడుగునా రోడ్డంతా తెగ పారింది." అన్నాడు.

"అసలు యెక్కడ కొన్నావు దీన్ని? గిప్సీలదగ్గర కాదుకదా?"

"అవును. వాళ్ళదగ్గరే. యిక్కడే కొద్ది దూరంలో కొంతమంది మకాం చేసేరు."

"ఆ— అంచేతనే అది చిక్కిపోయింది." అంటూ గుర్రాలని గురించి, గిప్సీలను గురించీ బాగా తెలిసిన అకోసక్కు చెప్పడం ప్రారంభించేడు. "వాళ్ళు దీన్ని నీకు అమ్మేముందు బాగా గాలికొట్టివుంచేరు. ఏగుర్రమైనా బాగా ముసలితనంచేత చిక్కిపోయి వున్నట్లయితే దాన్ని అమ్మేముందు ముడ్డిలో వొక కిక్కిసగొట్టం పెట్టి పక్కలు బాగా తేలి, బలిసిన గుర్రంలా కనిపించేటంతవరకూ వొకరివెనక వొకరు వరసగా వూది, అప్పుడు ఆగొట్టం లాగేసి, వెంటనే గాలిపోకుండా, గడ్డి మెలిపెట్టి కుక్కేస్తారు. నువ్వుకొన్న యీగుర్రం అలాంటిదే. ఆగడ్డి దోవలో యెక్కడో వూడి పడిపోవడంచేత, యీలా చిక్కిపోయింది. వెనక్కి వెళ్ళి అది యెక్కడ పడిపోయిందో వెతికి తీసుకురా, మనం యిద్దరం కలిసి బాగా గాలికొట్టి వెనకటికిమల్లే చేద్దాం."

"అమ్మ— లంజకొడుకులు యెంత దగాచేసేరు." అంటూ ఘూకర్ ఆగిప్సీలని పట్టుకోవడానికి వెనక్కి పరుగెత్తేడు. కాని తీరాఅతడు అక్కడకు వెళ్ళి చూసేటప్పటికి, ఆగుడారాలూ లేవు, గిప్సీలూ లేరు. అంతక్రితం వాళ్ళు వంట వండుకున్న చోటునుంచి బూడిదరంగు పొగ యింకా లేస్తూనే వుంది. కాని, దూరాన, వేసవికాలం అవడంచేత బాగా కాలివున్న రోడ్డుమీది నుంచి ధూళిరేగి, గాలితాకుడుకి నలుమూలలా చెదరి మాయం అయిపోతూంది. గిప్సీలు అతిచిత్రంగా మాయం అయిపోయేరు. ఘూకర్ రాగాలెడుతూ

వెనక్కి తిరిగి వచ్చేడు. ఇతని ధ్వనిఅవగానే ఇగ్నాటీపోర్ఫిరిచ్ యిట్లోనుంచి బయటికి మళ్ళీ వచ్చేడు. "నేను దానిపొట్టకింద చేతులుపెట్టి కిందపడిపోకుండా పట్టుకుంటాను, నువ్వు యెక్కు" అని సలహా యిచ్చేడు. సిగ్గుచేత, విచారంచేత కుంగిపోయివున్న ఘూకరు, ఆకోసక్కి సలహా అంగీకరించి, యేలాగో తంటాలుపడి దానిమీద కూర్చున్నాడు. ఈపర్యాయం గుర్రం వెనకటిలా పడిపోలేదు. గేలప్ తీస్తూన్నట్లు మొదట ముందరికాళ్ళు రెండూ పైకి యెత్తి తరవాత వెనక కాళ్ళతో తన్నింది. ఈమాదిరిగా ఘూకరుని ఆవీధి చివరవరకూ తీసుకుపోయింది. కాని యీగేలప్ తియ్యడంలో ఘూకరు టోపీ కింద పడిపోయింది. కడుపుకి వొళ్ళంతా సలగకొట్టినట్టయి, కడుపులో వికారము కలిగింది. "అయ్యబాబో! యీగుర్రంమీద కూర్చోడం నావల్ల కాదు." అనుకుని గుర్రందిగి, పడిపోయిన టోపీ తీసుగోడానికి వెనక్కి వెళ్ళేడు. కాని వొక సందులోనుంచి చాలామంది జనం తనకేసి పరుగెత్తుకొని వస్తూండడం చూసి టోపీ తీసుగోకుండానే వెనక్కి పరుగెత్తి గుర్రాన్ని గబగబా వూరి బయటకు లాక్కుపోయేడు. అయినప్పటికి పిల్లలు అతన్ని వొదిలిపెట్టక వెంట తగిలి గాలిమర వరకూ తరుముకుపోయి, అక్కడతో వదిలిపెట్టి వెనక తిరిగేరు. మళ్ళీ ఆగుర్రాన్ని యెక్కాలన్న వాంఛే కలగలేదు ఘూకరుకి. గుర్రాన్ని యీడుస్తూ అడ్డపడి, గుట్టలు, మెట్టలూదాటి కొంతదూరం ప్రయాణము చేసేటప్పటికి అలుపు వచ్చి, కళ్ళెం వదిలేసి గుర్రం [illegible] వెళ్ళి తోలడము ప్రారంభించేడు. తను అంతా శ్రమపడి కొన్న గుర్రం గుడ్డిదన్న సంగతి అప్పటికికాని అతనికి తెలియనేలేదు. మిట్టలు, పల్లాలు, బోదులు యేవిఅడ్డము వచ్చినా తప్పుగోకుండా అడ్డపడి [illegible] పడుతూ, లేస్తూ యిల్లాగే ప్రయాణం సాగించింది. కొసదాక అయినా ముక్కుకి సూటిగా నడవడం కాదు. తమాషాగా పక్కల్లకొట్టడం మొదలెట్టింది. ఈకొత్తవిషయం తెలుసుగున్నాక ఘూకర్ విస్తుపోయి దాన్ని దాని యిష్టంవచ్చినట్లు వదిలేసి చూస్తూ నిలబడ్డాడు. అది గానుగ యెద్దు తిరిగినట్లు విధివిరామం లేకుండా తిరగడము మొదలెట్టింది. ఈ తిరగడంచూసి అది దాని జీవితమంతా తిరుగుడుకాట

లాగడంలోనే గడిపి ఆఖరికి ఆపనిలోనే గుడ్డిదికూడా అయిపోయి వుంటుందని ఛూకరు వూహించేడు.

ఇలాంటి గుర్రాన్ని తీసుగుని పట్టపగలు గ్రిమాచీలాగ్ వెడితే అంతా ఆక్షేపిస్తారని అక్కడా అక్కడా మేపుతూ సాయంత్రింవరకూ కాలక్షేపం చేసి, బాగా చీకటి పడ్డతరువాత చడీ చప్పుడూ లేకుండా తోలుకుపోయి దొడ్లో కట్టేసేడు. అలాంటి పచ్చి గుర్రాన్ని కొన్నందుకు ఛూకర్ని అతని భార్య బాగా దేహశుద్ధిచేసి బుద్ధిచెప్పే వుంటుంది కాని ఆచీకటిలో యెవరికీ మాత్రిం కనిపించలేదు. క్రిమంగా కొన్నిరోజులకి ఆగుర్రానికి గజ్జిపట్టుకుని చర్మంఅంతా పాకి చూసేటందుకుకూడా అసహ్యం కలిగించేటంత వికృతంగా తయారయి చచ్చిపోయింది. ఛూకరు దాని చర్మం వొలిచి అమ్మేసి ఆవచ్చిన కొద్ది సొమ్ముతో అతనూ అతని స్నేహితుడు లూకాటీవు కలిసి తాగేసేరు.

ఛూకర్ చేతులలోనుంచి యెన్ని గుర్రాలు వెళ్ళినవీ అతనిని బాగా యెరిగిన యాకోవులూకిచ్‌కి తెలుసును. అయినాకానీ ఛూకర్‌కి ఉగ్గుపాల నాటినుంచీ అలవాటయిన అబద్ధం ఆడడం, కోతలు కొయ్యడం మానలేక పోయేడు.

ఇవన్నీ యెందుకు మనకి— అదిమొదలు ఛూకరుకి బండి తోలడము, గుర్రాలని కాయడం, యింకా వుద్యోగాలూకూడ వొక్కసారిగా లభించేయి. అతను ఆవుద్యోగాలు ఉండగా బాగా నిర్వహించలేదని చెప్పడానికి వీలులేదు. కాని బండితోలుతూ చీటికీమాటికీ ఆపుతూంటాడనీ, వేగంగా తోలలేడనీ నగుల్నోవుమాత్రిం వాదించేవాడు. ఇద్దరూ బండియెక్కి ఆఫీసు ఆవరణదాటి రోడ్డుమీదికి వచ్చేరోలేదో యింతలోనే "హోవ్! హోవ్!" అంటూ కళ్ళేలు బిగించి బండీ ఆపుతాడు. "ఏం, యెందుకూ ఆపేవు?" అని నగుల్నోవు అడుగుతే "ఆపకపోతే యెల్లాగ! గుర్రాలకిమాత్రిం శ్రమ కాదూ?" అని నగుల్నోవుకి విసుగెత్తి కొరడాతీసి గుర్రాలని వొక్క దెబ్బకొట్టేసరికీ యీలవేస్తూ దర్జాగా కూస్తుంటాడు. ఆవూళ్ళో కోసక్కులిద్దరిదగ్గర ఛూకరు "బండి

తోలేవాడు ముందరిచెక్కమీద కూర్చుని బండి తోలుతూంటే, ప్రయాణీకుడు లోపల దిండ్లు అమర్చుగుని కులకడానికి యివేమీ జారుప్రభుత్వపు రోజులుకావు. చూడు— యిప్పుడు నేను బండి తోలుతూన్నాను. కాని దేవిడోవుతో సమానస్థాయాగా బండిలో కూర్చుంటున్నాను. ఎప్పుడేనా చుట్ట కాల్చుకోవాలని వున్నప్పుడు చుట్టచుట్టుగుంటూ వొక్కసారి కళ్ళేలుపుచ్చుకోమని దేవిడోవుని అడుగుతాను. అతను కళ్ళేలు తీసుగుని అల్లా వొక అరగంటో, గంటో బండి తోలుతూంటే నేను ప్రకృతిని చూస్తూ హాయిగా కూర్చుంటాను." అని ప్రగల్భాలు కొడతూంటాడు. ఎంత దిట్టంగా పొగమంచు పట్టివున్నా ప్రతిరాత్రి విడకుండా అప్పుడప్పుడు లేచి గుర్రాలను చూస్తూండాలని అక్కడే పడుకోడానికి వెడుతూండేవాడు. ఇల్లా వారము రోజులు అయిన తరువాత వొకరోజున అతనిభార్య, ఛూకరుని "ప్రతిరోజూ యెవరో ఆడాళ్ళు నీదగ్గరకి వస్తున్నారుట కాదూ!" అని అడిగి వొళ్ళు హూనమయేలా చావకొట్టి వొదిలిపెట్టింది. ఎవరో కొంతమంది పిల్లలుచెప్పేరుట ఆమెకు యీవిషయం. కాని ఛూకరు అది నిజమనికాని అబద్ధమనికాని యేమీ అనక ఆరోజుమొదలు యింటిదగ్గరే పడుకుంటూ రెండు మూడుసార్లు వెళ్ళి గుర్రాలని చూసి వస్తూండేవాడు.

ఛూకరుకి బండికట్టడం వొక్క అరగంట ప్రకరణ. బండికి పూన్చడానికి గుర్రాలని రెంటినీ తీసుగువచ్చేటప్పుడు అక్కడవున్న గుర్రాలేవయినా సకిలిస్తే వాటిని నడ్డిమీద తట్టుతూ "హుష్! హుష్! మిమ్మల్ని తగలెయ్య యెందుకే అలా సకిలిస్తారు. అదీమీకువల్లే మొగగుర్రమేకాని ఆడదికాదు." అంటూ యేదో జాప్యం చేస్తూ, మొత్తంమీద ఎల్లాగయితేం— బండికట్టి, యెక్కేక "యేదో మన అదృష్టం బాగుందికనక కడుపులో చల్ల కదలక్కర్లేకుండా హాయిగా కూర్చోడానికి వీలయిన పని దొరికింది." అనుకుంటూంటాడు.

మార్చి 27వ తారీఖున దేవిడోవు తను చెప్పిన ప్రకారం మొదటిదళం నాగటి చాళ్ళకి అడ్డంగానే కంప లాగుతూన్నారో లేకనిలువుగా లాగుతూ

న్నారో చూడడానికి బయలుదేరుదం అనుకుంటూన్నాడు. ఇంతలో పోయరును వొకదానిని బాగుచెయ్యడానికి వెళ్ళిన ఇన్స్పెక్టర్ షాలీ గబ్బా సమిష్టి వ్యవసాయ క్షేత్రపు ఆఫీసుకి పరుగెత్తుకు వచ్చేడు.

“మొదటిదళం చాళ్ళకి నిలువునా కంపలాగుతూన్నారు. పని పట్టి దండుగతప్ప దానివల్ల ఏవీ లాభంలేదు. ఇంకా కావలిస్తే మీరుకూడా చూడండి. సరిగ్గా పని చెయ్యమని మీరు చెబుతేకాని వినరు వాళ్ళు. నేను చెబుతే వెధవ మెల్లకన్నూ వాడూ ఆ వుపాకోవు ‘మహా తెలిసినవాడిలా ప్రతిదాన్లోనూ వేలెట్టుకుపోయి తిత్తి వూడుకో— నిన్నెవరేనా అడిగినప్పుడు చెపుదుగానిలే సలహా— దయచెయ్యి’ అన్నాడు. కుక్క కాటుకి చెప్పుదెబ్బ అన్నట్లు ‘వెధవ మెల్లకన్నూ నువ్వూ మాటలు తిన్నగా రానియ్యి. మెడగుళ్ళు విరిచేసిపోయేను’ అన్నాను. దానితో చెయ్యీ చెయ్యీ కలుపుగోడము వరకూ వచ్చింది.”

దేవిడోవు ఘూకర్‌ని కేకేసి బండి సిద్ధం చెయ్యమన్నాడు, కాని అరిడు యెంతకీ తెమల్చక పోవడంచేత తనుకూడా వెళ్ళి సహాయం చేసేడు. ఇద్దరూ బండియెక్కి బయలుదేరేరు. ఆకాశం అంతా మబ్బులు కమ్మేసేయి. ఉక్కచూస్తే యికనో యిప్పుడో వర్షం కురిసేటట్లు కనిపిస్తూంది. మొదటిదళం పనిచేస్తూన్న భూములు వూరుకి చాలా దూరంలో పొలిమేర దగ్గర వున్నాయి. ఊరుకీ అక్కడకీ 5, 6 మైళ్ళు వుంటుంది. ఆ దళం వరి చల్లడానికి భూమి అంతా దున్ని సిద్ధం చేస్తూంది.

“తాతా! త్వరగా పోనివ్వాలి!” అన్నాడు దేవిడోవు, బాగా మూసుగుపోయిన ఆకాశంకేసి చూస్తూ.

“వేగంగానే తోలుతూన్నాను. అప్పుడే గుర్రం యెలా అలసిపోయినదో చూడండి.”

ఎదర సాలోపుమీద ముందు మేస్టరు నడుస్తూంటే అతని వెనక వొక్కటే వరసలో స్కూలుపిల్లలు, వాళ్ళ వెనకాల నీటిపీపాలు తీసుకుపోతూన్న నాలుగు బళ్ళూ కనిపించేయి.

"అరుగో! పిల్లలంతా ఎలకల్ని చంపడానికి పోతూన్నారు." అని ఛూకరు వాళ్ళకేసి చూపించేడు.

సంతోషాన్ని వెలిగక్కుతూన్న కళ్ళతో డేవిడోవు వాళ్ళకేసి చూసేడు. బండి వాళ్ళ సమీపానికి వెళ్ళగానే అతడు ఛూకరుని బండి ఆపమని జోళ్ళైనా లేకుండా వట్టికాళ్ళతో నడుస్తూన్న యేడేళ్ళ కుర్రాడినొకడిని "ఏయ్, అబ్బాయి— మాట" అని పిలిచేడు.

"ఎందుకు?" అన్నాడు ఆకుర్రాడు తలమీదనున్న టోపీ వెనక్కి సర్దుకుంటూ.

"ఎన్ని యెలకల్ని చంపేవు నువ్వు?"

"పథ్థానుగు"

"నీ పేరెవరు?"

"ఫియోడోట్ డిమిడిచ్ ఉషాకోవు."

"సరదాగా బండిలో కూర్చుందువుగాని రా. నువ్వుకూడా రా." డేవిడోవు తలకి జేబురుమాలు చుట్టుగున్న ఓపిల్లకేసి చెయ్యి విసిరేడు. ఇద్దర్నీ బండిలో కూర్చోపెట్టుగుని ఛూకరుని బండిపోనిమ్మని ఆకుర్రాడితో సంభాషణ మొదలెట్టేడు.

ఏన్నోక్లాసు చదువుతూన్నావు!"

"ఒకటో క్లాసు."

"ఒకటోక్లాసా! అయితే శుభ్రంగా చీమిడి చీదుకోకుండా అలాగే వుండడం!"

"చీదుకోలేను. రొంప పట్టింది."

"చీదుకోలేకపోవడం యేమిటి!— నేను తీస్తాను యిలారా!" డేవిడోవువేళ్ళు బ్రీజరుకి తుడుచుగుంటూ నిట్టూర్పు విడిచేడు. "రేపో యెప్పుడో సమిష్టి వ్యవసాయ క్షేత్రపు ఆఫీసులో నాదగ్గరకిరా. ఛాకొలెట్లు పెడతాను. ఎప్పుడేనా ఛాకొలెట్లు తిన్నావా!"

"లేదు."

"సరే, ఆఫీసుకి రా. అక్కడ మందుకూడా యిప్పిస్తాను."

"ఒస్తాను. కాని ఛాకొలెట్లు నాకు అక్కర్లేదు."

"అక్కర్లేదూ? ఏం— ఎందుచేత?"

"పళ్ళన్నీ కదిలిపోయి వూడిపోతున్నాయి. అప్పుడే కిందపళ్ళు రెండు వూడిపోయేయి. చూడండి!" ఆకురాత్రిడు నోరు తెరచి వూడిపోయిన కింద పళ్ళు రెండూ చూపించేడు.

"అయితే తోస్సివాడవు అన్నమాట నువ్వు."

"అవిగో మీవీ తోస్సపళ్ళే."

"ఒబ్బో, అసాధ్యుడివులా వున్నావే! కనిపెట్టేవూ నువ్వు."

"నాకు మళ్ళీ కొత్తపళ్ళు వొస్తాయి. మీకు రావు."

"ఆ— నీకు తెలియదు; నాకూ వొస్తాయి కొత్తపళ్ళు.

"ఉత్తగి. అబద్ధం ఆడుతున్నారు. ముసలాళ్ళకి పళ్ళు రావు. అసలు పళ్ళు లేకపోయినా నేను యెలా కరుస్తాననుకున్నారు!"

"ఎల్లా కరవకలవు?"

"అబద్ధంఅయితే నానోట్లో వేలు పెట్టండి. ఎల్లా కరుస్తానో చూపిస్తాను."

దేవిడోవు నవ్వుతూ చూపుడువేలు అందించేడు. వెంటనే "అబ్బ!" అంటూ వెనక్కి లాక్కున్నాడు. వేలు పైన పళ్ళుదిగిన ఆనవాళ్ళు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

"ఫీయొడోట్! నేను కరవగలనో లేదో చూడు." అన్నాడు దేవిడోవు. ఆకురాత్రిడు కొంచెం సేపు అనుమానించి గభాలున బండిలోనుంచి కిందికిపురికి వొంటికాలిమీద నిలబడి, చప్పట్లుకొడుతూ "కరుస్తారేంమీరు! యెల్లాకరుస్తారో కరవండి చూద్దాం" అన్నాడు.

దేవిడోవు పకపకానవ్వుతూ ఆపిల్లనికూడ నెమ్మదిగా బండిలోనుంచి దింపేసి, వాళ్ళకేసిచూస్తూ నిలబడ్డాడు. సంతోషంచేత అతని హృదయం తబ్బిబ్బు అయిపోయింది. కళ్ళు చెమ్మగిలేయి. "ఇప్పుడు మనంపడే పాటంతా

వాళ్ళ సౌఖ్యంకోసమే." అనుకుంటూ ఆలోచించసాగున్నాడు. "తండ్రి కోసమని టోపీ పెట్టుకుని పరుగెత్తుతున్న యీ ఫిమొనోట్ వొక్క-యేబై సంవత్సరాలలో యెలక్ట్రిక్ నాగలితో దున్నుతూంటాడు. పల్లె వచ్చి పోయింది మొదలు నేను చెల్లెళ్ళకి సంరక్షణచేస్తూ వంట వండుకుని గుమాస్తా ఫ్యాక్టరీకి వెళ్ళి పనిచేసినట్లు యీనాడు అంతకష్టపడక్కరలేదు. మానవుడు సుఖం అనుభవించడం అంటూవుంటే యీ ఫిమొనోట్ లాంటివాళ్ళే అనుభవిస్తారు. ఏమీ అనుమానం లేదు." దిగంతాలవరకూ వ్యాపించిన స్టెప్పి వొక్క-సారి కలయచూసేడు. దూరాన ముక్కు-డెండ్లలో తూలుతూ దున్నుతూన్న రైతు వొకడు కనబడ్డాడు. హృదయంలోని ఆవేదన, సానుభూతి, ఆగక నిట్టూర్పు రూపంలో బయలుపడ్డాయి. "ఇలాంటి కష్టమయిన పనులన్నీ యంత్రాలే చేసేస్తాయి ముందునుంచి. ఆరోజులు వొస్తే పల్లెలు యిప్పటిలా దరిద్రపుటి క్కుల్లేవు. అప్పటివరకూ నేను బ్రతికియుండి చూస్తానా! దేవిడోవు—అప్పుడే నడివయస్సుకూడా దాటిపోయిన నీకుకూడా యింకా అప్పటివరకూ బ్రతికి వుండాలని వుందా! అవ్వే—అంతవరకు బ్రతకవు. నీ స్మారక చిహ్నం గా గ్రామాచీలాగ్ వ్యవసాయ క్షేత్రంమాత్రం మిగులుతుంది. క్రమంగా అదిఅభివృద్ధిపొంది 'కమ్యూన్'గా మారుతుంది. అప్పుడు వాళ్ళంతా దాన్ని వ్యాటిలోవ్ లాక్స్కిత్ సైమియన్ దేవిడోవు పేర పిలుస్తారు......" అతని ఆలోచనలకి అతనికే నవ్వొచ్చింది.

"భూకేసు! యింకా యెంతసేపటికి వెడతాము""

"మూడో సాలోపు దాటుతే వెళ్ళిపోయినట్లే!"

"వృథాగా యెంతభూమిబీడుపడిపోయిందో చూడు. ఇట్లా అవుతే దేశానికి దరిద్రంకాక మరేముంటుంది. ఇంకో రెండు పంచవర్ష ప్రణాళికలు పూర్తి అయేటప్పటికి యిదంతా సేద్యంలోపెట్టి ఫ్యాక్టరీలు కడుతూంటాము యిక్కడ నువ్వు యింకో దశపాటు బ్రతికినట్లయితే యీ గుర్రప్పుబండి మూల పారేసి, మోటారు నడుపుతావు."

భూకేసు పెదవి విరిచేడు.

"అంతెందుకూ, దానా సాకు! 40యేళ్ళక్రితం యే ఫ్యాక్టరీలోనో కూలివాడుగా చేరితే నా జీవితం యింకోవిధంగా వుండియుండును. వ్యవసాయంలో అస్తమానూ దెబ్బతింటూనే వున్నాను. మొదటినుంచీ నాది నష్టజాతకమే. దురదృష్టం నన్ను నేలకొట్టిరాసేసి మళ్ళీ తల యెత్తకుండా చేసేసింది."

"ఏం— అదేమిటి?"

"అవునండీ, చెబుతాను, గతాలు నెమ్మదిగా పోతూంటాయి. వాటిని ఆయాసపెట్టడం యెందుకు? మీరు మంచివారు కనుక వింటూన్నారు, లేకపోతే యెవరికి కావాలి యివన్నీ. నాజీవితంలో అడుగడుగుకీ గండాలే. పుట్టగానే యెలుకలది నన్ను చూసి మా అమ్మతో "అమ్మా, కేటరీనా! నీకొడుకు మహా అదృష్టవంతుడవుతాడు. చూడండి, ముఖంలో ఆ కళ. చిన్న నుదురూ, గుమ్మడికాయలా తలా, పాణకలా అపొట్టా, సన్నని కీచుకంఠమూనూ." అంది. కాని కొద్దిరోజులలోనే అది చెప్పినవన్నీ అబద్ధం అని తేలిపోయింది. నేను పుట్టిన రోజున యెన్నడూ లేనంత శీతలం వేసింది. నీళ్ళన్నీ గడ్డకట్టుకుపోవడంచేత గుక్కెడు నీళ్ళకికూడ కరువయింది. పక్షులు చలికి కొంకరించుకుపోయి యెక్కడిపక్కడే ఠారున చచ్చిపోయేయని మాఅమ్మ చెప్పుతూండేది. ఆలాంటప్పుడు నాకు మతంయిప్పించడానికి టుబ్యాకోసోక్చర్చికి తీసుకువెళ్ళేరు. పాపీ మీరుచెప్పండి; ఆలాంటి చలిలో చంటిపిల్లల్ని చన్నీళ్ళలో ముంచుతే యింకేమేనా వుండా! అందుచేత నీళ్ళు కాచడం మొదలెట్టేరు. డీకనూ, ప్రీస్టూకూడా వొళ్ళెరక్కుండా తప్పతాగి వున్నారేమో, వొకడు సలసలా మరుగుతూన్ననీళ్ళు తీసుకువచ్చి తొట్టెలో పోసేటప్పటికి రెండోవాడేనా ఆనీళ్ళు వేడిగానున్నాయేమోనని చూడకుండా, యేవో మంత్రాలు చదువుతూ నన్ను బుడుంగున ఆనీళ్ళలో ముంచేడు. నావొళ్ళంతా కమిలిపోయింది. మావాళ్ళు నన్నుఇంటికి తీసుకువచ్చేటప్పటికి వొళ్ళంతాబొబ్బలు తేలిపోయేయి. అదిమొదలు చాలాకాలంవరకూ యేదో రోగంతో తీసుకుంటూనే వున్నాను. కొంచెం పెద్దవాడినయి వీధులలో

ఆడుకొనే వయస్సు వచ్చినది మొదలు దూడలు, కుక్కలు, వొకటేమిటి ఆఖరికి బాతులుకూడా తరుముకొచ్చి బాధ పెడుతూండేవి. ఒకరోజున గాడిద తన్నేటప్పటికి స్పృహ తప్పి పడిపోయేను. మావాళ్ళు నేను చచ్చి పోయేనని యేడ్చేరుకూడాను అప్పుడు. తొమ్మిదోయేడు దాటింది మొదలు అంతకంటె యెక్కువ ప్రమాదాలు సంభవిస్తోచ్చేయి. నా పదోయేటలా వుంది గాలానికి చిక్కుకున్నాను........"

"ఏం గాలం?" అంతవరకూ పరధ్యాన్నంగా వింటూన్న డేవిడోవు ఆశ్చర్యంగా అడిగేడు.

"మామూలుగా చేపలు పట్టుకునే గాలమే. అప్పుడు యీవూళ్ళో 'కుపిర్' అనే ముసలితాత వొకడు వుండేవాడు. అతనికి బ్రహ్మచెముడు. శీతకాలంలో వుచ్చులు పోసి పిట్టల్ని పట్టుకొని వాటిపళ్లే బ్రతుకుతూ ఒక గుడారంలో కాలక్షేపం చేసేవాడు. వేసవిలో నదికిపోయి గాలాలువేసి, చేపలు పడుతూండేవాడు. ఆరోజులలో యీనది యింకా బాగా లోతుగా లాప్షినోవు మిల్లువరకూ వ్యాపించివుండేది. ఆమిల్లు డాముక్రింద యెప్పుడూ వుంటూండే తియ్యనీటిచేపలు, పెద్దపెద్ద గండుమీనులు పట్టుగోడానికి గాలాలు పుచ్చుకుని వొకపాదవారకూర్చునేవాడు. అతను యెప్పుడూ గాలాలు తీసుకువచ్చి కొన్నిటికి యెరలను, మిగిలినవాటికి గండుమీనుల్ని పట్టుగోడానికి చిన్న చిన్న చేపల్ని గుచ్చేవాడు. మేము కొంతమంది కుర్రాళ్ళం పోగడి అతని గాలాలు కొరికి యెత్తుకు పోతూండేవాళ్ళం. చెవ్వులో బాకా వూదినా వినిపించనంత బ్రహ్మచెముడు— అతనికి. అందుచేత మేమంతా అతనికి దగ్గరగా నదివొడ్డున మరియొక రుప్పవారచేరి, బట్టలు విడిచేసి, యెవళ్ళో వొకళ్ళం మెల్లిగా కెరటాలు రాకుండా నీళ్ళలోదిగి మునిగి అతని గాలాల క్రిందికి వెళ్ళి అందులో వొకటి పళ్ళతో కొరికేసి మళ్ళీ ఆరుప్పవారకి వచ్చి లుతేతూండేవాళ్ళం. ఆముసలాడు కర్రపైకి యెత్తిచూసి గాలం లేకపోవడములోటే నోరూనెత్తి మొత్తుగుని చేపలను తిట్టిపోస్తూండేవాడు. పాపం—

అతను యేగండుమీనో కొరికేసిందనుకొని వాటిమీద మండిపడుతూండేవాడు; కానిమేమేం చేసేమని యెరుగడు. అతను ఆగాలాలన్నీ పాపులో కొంటూండేవాడు. కాని అల్లా కొనడానికి మాదగ్గర డబ్బులేకపోవడంచేత అతన్ని మాయచేసి యెత్తుకుపోతూండేవాళ్ళం. ఒకరోజున మామూలుగా నేనోగాలం పట్టుకొని కొరికేసి రుప్పవాగకి చేరేను. ఇంకోగాలంకూడా 'పట్టుకోవాలని తోచింది. అతడూ హడావిడిగా యింకో గాలానికి యెర గుచ్చుతూండడం చూసి, మళ్ళీ నీళ్ళలో మునిగేను. నెమ్మదిగా వెళ్ళి అతాడు నోట కరిచానో లేదో యింతలో హఠాత్తుగా గాలం పయికి లాగేసేడు. నాపళ్ళమధ్యనున్న తాడు జారిపోయి గాలం పైపెదవిలో గుచ్చుకుపోయింది. నేను గట్టిగా అరిచేను. అయితేమాత్రం అతనికి వినిపిస్తే కాదూ! గాలం నా బరువు చేత క్రిందికి జారిపోతూండడంచేత, అతను మరీగట్టిగా పైకి యెత్తడం మొదలెట్టేడు. బాధకి సహించలేక నేను కాళ్ళూ చేతులు గిలగిలా కొట్టుకున్నాను. నెమ్మదిగా నేను పైకి వెడుతూన్నాను. నా అడుగున కర్రవొకటి పెట్టినట్లు అనిపించింది. ఆఖరికి యెల్లాగయితేమి నన్ను నీళ్ళపైకి లాగేసేడు. ఆముసలాడి పైప్రాణాలు పైనే యెగిరిపోయేయి. నోట మాట వచ్చింది కాదు. భయంచేత ముఖంతెల్లగా మాడిపోయినట్లయిపోయింది. భయపడ్డాడంటే ఆశ్చర్యం యేముంది. మంచి గండుమీను తగిలుకుందని తీరా పైకి లాగి చూసేటప్పటికి పిల్లాడు! అలాగే కొంతసేపు నిస్తుపోయి చూస్తూ, నిలబడి, ఆఖరికి ఆ గాలం క్రిందపారేసి పరుగు లంకించుకున్నాడు. ఇంక మళ్ళీ తిరిగేనా చూడకుండా పారిపోయేడు. గాలం అలా నానోట్లోవుండగానే నెమ్మదిగా యింటికి చేరుకున్నాను. మానాన్న ఆగాలం కోసి తీసేసి స్మృతి తప్పి పడిపోయేటట్లు బాదకొట్టేడు. క్రమంగా కొన్ని రోజులకి ఆపెదవిమీద గాయం పోయింది. కాని 'ఘూకరు' అని పేరుమాత్రం మిగిలింది. అప్పటినుంచీ నా అసలుపేరు పోయి ఆమారుపేరు శాశ్వతమైపోయింది.

"ఆమరుసటి సంవత్సరం వసంతకాలంలో వొకరోజున బాతుల్ని గాలిమర దగ్గరకు తోలుకుపోయేను. గాలిమరపని చేస్తూంది— అపక్క నే

మా బాతులు మేస్తూన్నాయి. బాతులు బాగా కంటికి నిండుగా వున్నాయేమో డేగ వొకటి వాటిని యెప్పుడు యెత్తుకు పోదమా అని ఒడుపు వేసి తిరుగుతూంది. కాని నేను జాగ్రత్తగా కాస్తూ, డేగని దూరంగా తరిమేస్తూనే వున్నాను. "ఇంతలో మరికొంతమంది కుర్రాళ్ళు వచ్చేరు. మేమందరం కలసి ఆ గాలిమర రెక్కల మీద లేవడం మొదలెట్టేము. రెక్క మీద యెక్కుతూండడం రెండుచేతులూ పైకి లేచేటప్పటికి కిందికి దూకి లేస్తే దానితరవాత రెక్క నెత్తికి తగులుతుందని అదికూడా దాటిపోయిన తరువాత లేచి, అవతలకి వెళ్ళిపోతూండడం — యిలాచేసేం కొంతసేపు. కాని అంతటితో వూరుకున్నాము. రెక్కమీద యెవడు చాలాసేపు తట్టుకుపోతే వాడిని రాజుగా చేసి మిగిలినవాళ్ళంతా వాడిని బుజాలమీద యెక్కించుకుని వూరుదగ్గరికి మోసుకుపోవాలని అనుకున్నాము. ఎవరివంతుకు వాళ్ళకే రాజవ్వాలని వుంది. నేనుకూడ అందరికంటె యెత్తుకిపోవాలని అనుకుంటూ హడావిడిలో బాతుల సంగతి మరిచిపోయేను. రెక్కమీద కొంతపైకి లేచి యేదాలాఘోల అలా చూసేటప్పటికి డేగ బాతునొకదానిని తన్నుకుపోవడానికి వస్తూండడం కనిపించింది. బాతుపోతే యింటిదగ్గర దెబ్బలు తగులుతాయన్న భయంచేత రెక్క మీద పైకిలేస్తూన్న సంగతి మరచిపోయి "వోరేయ్ డేగ బాతుని యెత్తుకు పోతూంది. తరిమెయ్యండి!" అని కేకేసేను. మళ్ళీ జ్ఞాపకం వొచ్చి చూసేటప్పటికి రెక్క బాగా పైకి లేచిపోయింది. అక్కడనుంచి వురకడానికి కా భయంవేసింది. పోనీ పయికి వెళ్దమా అంటే అంతకంటె భయం వేసింది. ఏమిటి చేసేది అప్పుడు? ఏమైపోతానో అనుకుంటూండగానే రెక్క వెళ్ళవలసినంత యెత్తు పయికి వెళ్ళి మళ్ళీ క్రిందికి దిగడం ప్రారంభించింది. కాళ్ళు పైకి తల క్రిందికి అవడముచేత పట్టుజారిపోయి పడిపోయేను. ఎంతసేపటికి నేల మీదికి పడ్డానో నాకేమీ తెలియదు. పడగానే లేచి చూసుకునేటప్పటికి చేతి యెముకలు విరిగిపోయి గుత్తిదగ్గర చర్మం పొడుచుకుని పైకివచ్చేయి. విపరీతమయిన బాధగా వుండడంచేత బాతుల సంగతే మరిచిపోయేను. డేగ బాతునొకదాన్ని యెత్తుకుపోయింది. కానిచస్తూంటే సంధ్యమంత్రం అన్నట్లు

చెయ్యివిరిగి బాధపడుతూంటే ఆగోడవ యెవడికి కావాలి. కట్లుకట్టిన కొన్ని నెలలకి యెముకలు అతుక్కున్నాయనుకోండి. అయితేమాత్రం యేమిటి! మళ్ళీ ఆమరుసటి సం॥మే అంతకంటె పెద్దప్రమాదమొకటి సంభవించింది. సైంటు పీటర్సు పండుగ అయిన మరునాడే నేనూ మాఅన్నా కలసి పండి ముగ్గారిపోయివున్న చేను కొయ్యడానికి వెళ్ళేము. నేను గుర్రాల్ని తోలుతూన్నాను. మాఅన్న పనలుకట్టి ప్లాట్‌ఫారం మీదనుంచే క్రిందకి పారేస్తూన్నాడు. ఎండ మంచి తీక్ష్ణంగా వుండడంచేత సీటులో నే వొక్క కునుకు పోదమా అనుకుంటున్నాను. ఇంతలో పక్కకి చూసేటప్పటికి, చాళ్ళలో పెద్దపక్షి వొకటి కనిపించింది. నేను గుర్రాన్ని ఆపేను. మా అన్న కొడవలి పుచ్చుకుని దానికోసం బయలుదేరబోయేడు. కాని నేను "అక్కర్లే దాన్ని చంపకుండా పట్టుకుంటాను. నువ్వు రాకు." అని హఠాత్తుగా దానిమీదకి వురికి రెండుచేతులతోను కావలించి పట్టుకున్నాను. అది వదలిపోయి రెక్కలతో నాతలమీద కొడుతూ నెమ్మదిగా లాక్కుపోవడం మొదలెట్టింది. దానికి యేం తోచిందో తెలియదుకాని వెనక్కితిరిగి గుర్రాలు వున్నవయిపుకే వచ్చి తిన్నగా వాటి కాళ్ళలో పడింది. గుర్రాలు బెదిరి నామీదనుంచి ఉరికి పరుగెత్తిపోయేయి. ఒక్క నిముషం దాటుతే నేను గుర్రాలు లాక్కుపోతూన్న మం నాగలికింద పడి చచ్చిపోదును. వెంటనే మా అన్న లివరునొక్కి నాగళ్ళు పయికి యెత్తేసేడు. ప్లాట్‌ఫారంక్రిందపడి, దానితోకూడా యీడ్చుకుపోయింది. ఒకగుర్రంకాలు యెముకలోకంటా తెగిపోయింది. నాకుకూడా వొళ్ళంతా గాయాలే. కొంతసేపటికి మా అన్నగారు యేలాగో తంటాలుపడి గుర్రాల్ని ఆపి అందులో వొకదానినివిప్పి నన్నుదానిమీద వూళ్ళోకి తీసుకువచ్చేడు. ఆరోజల్లా నాకు స్మృతి లేదు. ఇంతా శ్రమపడితే ఆఖరికి ఆపక్షి దొరకనేలేదు. ఆపర్యాయం చాలకాలంవరకు మళ్ళీ తేరుకోలేదు. ఆరునెలల తరువాత వొకసారి ఆపక్క యింటికి వెళ్ళి వస్తూంటే ఆంబోతు వొకటి యెదురయింది. నేను పక్కకి తప్పుకుని వచ్చేస్తూంటే అది తోకయెత్తి బుసకొడుతూ మీదికి వచ్చింది. ప్రాణాలంటే యెవరికితీపి కాదు చెప్పండి. నేను

గబగబా పరుగెత్తేను. కానిఅది నావెనక్కాలే తరుముకువచ్చి, కొమ్ములతో విసిరి దూరంగా పారేసింది. దానితో పక్క యెముకలు విరిగిపోయేయి. అందుచేత 21వయేట నన్ను సైన్యంలో చేర్చుకోడానికి పరీక్షచేసి అనర్హుడ నని తోసేసేరు. ఒక్క ఆబోతులేకాదు ఆఖరికి కుక్కలుకూడా నన్నుచూస్తే నల్లేరుమీద బండిలా మీదికి వచ్చేవి. నాగ్రహచారం యేమిటో తెలియదు. కాని యెవరక్కేనా గొలుసు తెంపుగుంటే అది నామీదకే వచ్చేది. పోతే యేమీ యెరక్కుండానేనా అలా వెళ్ళేవాడిని. అంతే— యెదురు పడ గానే మీదపడి బట్టలు చింపేసో లేకపోతే కాలుపుచ్చుగు పీకో వొదిలి పెట్టేది. ఒకసారి ట్రెప్పీలో అడవిపంది మీదపడి చప్పు పీకేసింది. మరోసారి యెద్దువొకటి తరుముకురావడంవల్ల నాబూట్లుపోయేయి. ఒకరోజురాత్రి వీధులోనుంచి వెడుతూన్నాను. డొనిట్స్కోవు యింటిదగ్గర ఆబోతుపల్లి యెదురయింది. అది రంకెవేసి నేల దువ్వడం మొదలెట్టింది. ‘అబ్బో— యిది మీదపడేలావుందే.” అనుకుంటూ తగు జాగ్రత్తలోవుండి యింటివారే నడుస్తూన్నాను. అదికూడా నావెనకే రావడం మొదలెట్టింది. నేను పరిగెత్తడం మొదలెట్టేను. దాని రంకెకూడ వెనక్కాలే వినపడింది. వీధివైపుకివున్న ఆ యింటి కిటికీ తీసివుంటే దానిలోనుంచి యింట్లోపడి ప్రాణాలు దక్కించు కున్నాను. అందులో యెవ్వరూ లేరు. అందుచేత ‘ఆబోతు వెళ్ళిపోయినతరు వాత చల్లగా అవతలకి లేచిపోదాం, వాళ్ళని లేపకుండా’ అనుకున్నాను. ఆ ఆబోతు పెద్ద రంకెలువేసి గోడఅంతా కొమ్ములతోతవ్వి కొంతసేపటికి వెళ్ళి పోయింది. నేనుకూడా కిటికీలోనుంచి వీధులోకి దిగబోతూంటే యెవరిదో చెయ్యి నన్నుపట్టుగుని వెనక్కి లాగింది. అపట్టుగున్నది ఆయింటి యజమాని డొనిట్స్కోవే. నప్పుడువిని చూడడానికి వచ్చి నేను కిటికీలోంచి క్రిందికి దిగుతూంటే వచ్చి పట్టుగున్నాడు. “ఏమిరా అబ్బాయి— యింత చీకట్లో యెందుకు వచ్చేవు యిక్కడికి?” అని అడిగేడు. “ఆబోతు తరుముకొస్తే యిలా పారిపోయి వచ్చేను.” అన్నాను. “ఛీ—వెధవా! ఆబోతు తరుముకువచ్చిందిరా నిన్ను! అంతా అబద్ధం— మాకోడలు వోల్యా కోసంఅని వచ్చేవు నువ్వు.”

# ముప్పైరెండో ప్రకరణము.

## పార్టీలోనుంచి తొలగించడం.

రజ్మెట్నోవ్ గుమ్మంలో నిలబడి బూట్లని పట్టుకున్న బాడి తుడుచుకుని, నగుల్నోవ్ కిటికీలోనుంచి బయటికి వస్తూన్న లాంతరు వెలుతురు చూసి "ఇంకా నిద్దర లేవలా వుంది; ఇప్పటిదాకా ఏంచేస్తూన్నాడు చెప్మా!" అనుకుంటూ తలుపుతీసి గదిలోకి వెళ్ళేడు.

టేబులుమీద ఒకమూల చిన్నలాంతరు వెలుగుతూంది. పుస్తకం ఒకటి తెరిచివుంది. మకార్ కుడిచేతిమీద గడ్డం ఆనుకుని కొంచెం ముందుకు వంగి తదేకదీక్షతో పుస్తకంవైపు చూస్తున్నాడు.

"ఏమోయ్, మకార్! ఇంతరాత్రిదాకా ఇంకా ఏమిటీ—చేస్తున్నావు?"

నగుల్నోవ్ తలయెత్తి విసుగుదలతో రజ్మెట్నోవ్ వైకేసిచూసేడు.

"ఏం వచ్చేవు?"

"ఊరికేనే; ఏమీతోచకపోతే కొంతసేపు నీతో బాతాఖానీ వేసిపోదాం అని వచ్చేను. నీపనికి ఏమేనా అడ్డా?"

"అడ్డా అవ్వతే అవుతుంది. కూర్చో. వచ్చినవాణ్ణి వెళ్ళిపొమ్మంటే బాగుండదు."

"ఆ చదివేది ఏమిటి?"

"ఏదో కాలక్షేపానికి." మకార్ పుస్తకం చేతితో కప్పి అండ్రీకేసి చూసేడు.

"నేను మెరీనాను విడిచిపెట్టేసేక........." అండ్రీ నిట్టూర్పువిడిచి దిగాలుబడి కూర్చున్నాడు.

"ఇంతక్రితంయెప్పుడో చేసి వుండవలసింది ఆపని నువ్వు."

"ఏం?"

ప్రతిదానికీ నిన్ను దెప్పికుతూండికనక. జీవితంలో అనవసరపు బాదర

బందీ అంతా వదుల్చుకోవలసిన స్థితులలో వున్నాం మనం ఇప్పుడు. మనబోటి కమ్యూనిస్టులు ఏవో ఇతర చిల్లర విషయాలలో సరదాగా కాలం గడుపుతూ కూర్చోవలసిన సమయం కాదిది."

"మేమిద్దరం ఒకరినొకరు గాఢంగా ప్రేమించుకున్నప్పుడు అది చిల్లర విషయం ఎల్లా అవుతుంది?"

"మీ ఇద్దరికీవున్న ప్రేమ ఏమిటది? అది మెడకి తగుల్చుకున్న గుదిబండగాని ప్రేమగాదు. నువ్వు ఎక్కడికేనా మీటింగుకి వెళ్ళేవంటే అది కూడా వెనకాల తయారాయి అస్తమానూ కళ్ళు నీమీదే పెట్టి కూర్చుని, నువ్వు ఆడవాళ్ళ నెవరినేనా చూస్తున్నావేమోనని కాపలా కాస్తుంటుంది. ఆండ్రీ! అది శిక్షకాని ప్రేమకాదు."

"అయితే కమ్యూనిస్టులయినవాడెవడూ ఆడవాళ్ళని ప్రేమించకూడదన్నమాట; బుడ్డకొట్టిన యెద్దులా జీవితంఅంతా పనిచెయ్యడమేకాని ఇంకేమీ అక్కర్లేదు!"

"అయితే అదిసాధ్యంకాదంటావా? ఏదోయింతక్రితమే పెళ్ళిచేసుకున్నవాళ్ళని అల్లా వదిలిపెట్టి, ఇకపైనుంచి యువకులెవరూ పెళ్ళిళ్ళు చేసుకోకూడదని డిక్రీపాస్ చేద్దును అధికారమేకనక నాచేతిలోవుంటే. ఆడదాన్ని పట్టుకు వేళ్ళాడేవాడు చస్తే బోల్షివిక్ అవలేడు. ఈగ తేనెచూస్తే వదలలేనట్లు మనము ఆడవాళ్ళనిపట్టుకు వదలలేము. నేనుచెప్పేవి ఉత్తమాటలు కావు; ఎంతో అనుభవంమీద చెబుతూన్నమాటలు ఇవి! సాయంత్రి భోజనం అయినతరువాత, నేను ఏదో చదువుకుంటూ కూర్చుంటే, మాఆవిడ పోయి పడుకునేది. నాలుగుపంక్తులుచదివి నేనుకూడా పోయి పక్కవాల్చేటప్పటికి మూతిముడిచి ముడ్డినాకేసితిప్పి పడుకునేది. దానితోనాకు ఒళ్ళుమండిపోయేది. ఆకోపంచేత ఎంతకీనిద్రపట్టక సిగరెట్టువిడిచి సిగరెట్టుకాలుస్తూచాలా రాత్రివరకూ అలాగే కూర్చుంటూండేవాడిని. అందుచేత నిద్రచాలక బడలికగా వుండి అనుకున్నపని సరిగాచెయ్యలేకపోయేవాడిని. పెళ్ళాంఒకర్తెవుంటేనే ఇల్లావుంటే ఇంక పిల్లలుకూడావుంటే వేరేచెప్పాలా! వాళ్ళు ఏవో సంసా

రంచూసుకుంటూ పిల్లల్ని సంరక్షించుకోడానికి తప్ప పార్టీకి ఎందుకూ పనికి రారు. పూర్వం జారుప్రభుత్వం రోజులలో నేను సైన్యములోచేరే కోసకు యువకులకి బోధిస్తూండేవాడిని. బ్రహ్మచారులు సంతోషంగా తెలివైన ముఖాలతో కిలకిలలాడుతూండేవారు. కాని వాళ్ళే పడుచుభార్యలను ఇళ్ళలో వదలి సైన్యములోచేరడానికి వెళ్ళేక వెర్రిమొహాలు వేసి ఈడుస్తోగోడా అని వుండేవారు. అల్లాంటప్పుడు వాళ్ళకిమనం ఏమిచెప్పినా బుర్రకిఎక్కదు. మనం సర్వేసుక్యోతేపన్నగురించి చెబుతూంటే వాళ్ళు అతిశ్రద్ధగా వింటూన్నట్లు నీళ్ళలంగాదూస్తుంటారు. వాళ్ళకళ్ళు మనవైపేచూస్తుంటాయి. కాని మనస్సులుమాత్రం పడుచుపెళ్ళాలమీదవుంటాయి. దానికల్లఏంలాభం చెప్పు? పూర్వం ఎవరూఎల్లాచెప్పినా ఇబ్బందిలేకపోయేది. ఇప్పుడు అల్లావీలులేదు. పార్టీలోచేరేక అవిఅన్నీ ఒదిలిపెట్టాలి. ప్రపంచవిప్లవం వచ్చినతరువాత ఆడదానితో కట్టుకట్టుకుని ఎందులోనేనా దిగినాసరే ఎవరూఅక్కర్లేదు. కాని ఇప్పుడుమాత్రం సమస్తశక్తులూ కేంద్రీకరించి విప్లవంకోసం పనిచెయ్యాలి."

మకార్ లేచి ఒళ్లువిరుచుకుని రజ్మెట్నోవ్ భుజం తట్టేడు. "నీహృదయంలో విచారంఅంతా నాదగ్గిరవెళ్ళబోసి సానుభూతి పొందుదం అని వచ్చేవు నువ్వు. అవునా? కాని, అండ్రీ! నేనుమాత్రం యీవిషయంలో సానుభూతిచూపించలేను. ఆసార్జంటు భార్యనిఒదిలేసేనంటే నాకుసహాసంతోషంగావుంది! దాని కొవ్వు అణిగేలా గట్టిగా దేహశుద్ధికూడా చెయ్యవలసింది. నేను లుకెరియాని ఒదిలేసేనుచూసుకో. ఏవిచారమూలేదు నాకుయిప్పుడు. ఇది పక్కనుండే అడ్డుకాస్తాకూడా తీరిపోయింది. చికిలీచేసిన కత్తిలా కమ్యూనిజాన్ని ప్రతిఘటించేవాళ్ళనందర్నీ చెలికెయ్యాలన్నంతవుత్సాహంగావుంది. పైగా స్వయంగా చదువుకుని జ్ఞానం అభివృద్ధిపరుచుగోడానికి కూడా అవకాశం కలిగింది."

"ఏమిటి చదువుకున్నావు? ఏదేనాశాస్త్రమా?" రజ్మెట్నోవ్ అయిష్టతగా, ముక్తసరిగా అడిగేడు. మకార్ మాటలకి అతనికి బాగాకష్టంతోచింది. వివాహం విషయంలో మకార్ చెప్పినది సర్వాసహ్యంగా తోచింది.

తడాఖా వాళ్ళకి చూపిస్తాను. ఏకోశాన్నా దయాదాక్షిణ్యాలు చూపించకూడదు. 'అయితే నువ్వు మీ ఇంగ్లీషు కూలీలని హింసపెట్టేవాళ్ళని, ఇంకా ఇతర అస్వాతంత్ర్యజాతుల్ని రక్తం కక్కి పిప్పిచేసేవ్వు కాదూ? సరే—అల్లా గొప్పనిపించుకునే బడ్ని ఒడేరా దొంగ్రోపీ. తోటిమానవుల శ్రమశక్తిని దోచుకున్న నీకు అదే సరియైనశిక్ష.' వాళ్ళతో నేను మాట్లాడేముక్కలు ఇవే. ఆమాటలే ముందునేర్చుకుంటాను—లేకపోతే అన్నీ మాట్లాడడానికి తడుముకోవలసివస్తుంది."

ఇంకో అర్ధగంటసేపు వాళ్ళిద్దరూ ఏవో పిచ్చాపాటీ మాట్లాడుకున్నాక ఆండ్రీ యింటికి వెళ్ళిపోయేడు. నగుల్నోవ్ మళ్ళీ పుస్తకం దగ్గిర కూర్చున్నాడు. నిశ్శబ్దముగా పెదవులు కదుపుతూ, ఏవో కఠినపదాలు తెలుసుకోనటకు ప్రయత్నిస్తూనట్లు కనుబొమలు ముడేసి ఆలోచిస్తూ తెల్లవారపట్ల రెండున్నరవరకు, ఇంగ్లీషు నేర్చుకుంటూ అల్లాగే కూర్చున్నాడు.

మరునాడు ఉదయాన్నే లేచి రెండుగ్లాసులపాలు తాగి సమిష్టివ్యవసాయక్షేత్రపు తబేలాకి వెళ్ళేడు.

"మంచిబాగా పోయే గుఱ్ఱాన్ని ఒకదాన్ని ఇయ్యి." అప్పుడు డ్యూటీ మీదఉన్న ఆపనిని అడిగేడు.

అతను బాగా చిత్రపిక్కలా ఉన్న గుఱ్ఱాన్ని ఒకదాన్ని తీసుకు వచ్చి ఎదటిలపెట్టి,

"చాలా దూరం వెడతున్నారా?" అని అడిగేడు.

"జిల్లాపట్టణానికి. ఎల్లాగైనా ఈరాత్రికి తిరిగి వచ్చేస్తానని చెప్పు డేవిడోవ్‌తో."

"గుఱ్ఱంమీద వెడతారా?"

"అవును. జీనుకూడా తీసుకురా."

మకార్ గుఱ్ఱానికి జీను వేసి, మెడతాడు తీసేసి, కంటికింపుగా బాగా కనిపిస్తూన్న టిటార్క్ తాలూకు కళ్ళెం తగిల్చి మంచినేర్పుతో ఎగిరి గుఱ్ఱంమీద కూర్చున్నాడు. గుఱ్ఱం కదంతొక్కుతూ బయలుదేరింది. గేటు దాటుతూంటే అకాత్తుగా బోకరించింది. కాని కిందపడిపోకుండా ఎల్లాగో నిల

తొక్కుకుని లేచి నిలబడింది.

"ఏం—అంత కళ్ళుమూసుకు నడుస్తున్నావాఏమిటి!" అంటూ మకార్ చుబుకుతో చురుక్కుమని రెండు తగిలించేడు.

"కామ్రేడ్ నగుల్నోవ్, ఒక్కసారికూర్చునిమరీ వెళ్ళు. అడుగులో హంసపాదు అన్నట్టు గేటుదాటుతూండగానే అపశకునం అయింది." అంటూ మకార్ ఎదురవడంచేత దోవవదిలి నిలబడ్డ షూకర్ అన్నాడు.

మకార్ ఏమీ సమాధానంచెప్పకుండా బయలుదేరి వెళ్ళిపోయేడు. గ్రామసోవియటు దగ్గిర ఒకడజను మంది ఆడవాళ్ళు నిలబడి చేతులు తిప్పుకుంటూ దేనిగురించో సందడిగోళంగా మాట్లాడుకుంటున్నారు.

"ఏయ్—దోవలో తప్పుకోండి; లేకపోతే మీదనుంచి పోనిస్తాను. గుఱ్ఱం." అంటూ మకార్ వేళాకోళంగా కేకేసేడు.

ఆడవాళ్ళు మాట్లాడకుండా పక్కకి తప్పుకున్నారు.

అతను దాటి వెళ్ళిన తరువాత ఎవరో మంచికోపంగా "ముందు నీమాట చూసుకో, తరవాత మమ్మల్ని తొక్కిద్దువుగాని, నిన్నింకా తెలియ్యా! ఏం చూసుకునో అంతమిడిసిపాటు—అంతా అణుగుతుందిలే వెళ్ళు." అనడం అతని చెవినిపడింది.

జిల్లాబ్యూరో సమావేశం పదకొండుగంటలకి ప్రారంభమయింది. అజండాలో జిల్లావ్యవసాయశాఖాధికారి బైగ్లిక్—మొదటిఆయిదురోజులలోను జరిగిన చల్లికలనుగురించి ఇచ్చినరిపోర్టుకూడా ఉంది. బ్యూరో మెంబర్లేకాక డిస్ట్రిక్టుకంట్రోల్ కమిషన్ ఛైర్మన్ సెమోఖ్విసడ్, జిల్లాప్రాసిక్యూటరుకూడా హాజరయేరు ఆసమయానికి.

నిర్మాణశాఖాధికారి ఖొమూటోవ్ నగుల్నోవుతో "ఆట్టేఎక్కడికీ వెళ్ళకు, నీవిషయమై కూడావస్తుంది యిప్పుడు." అన్నాడు.

బైగ్లిక్ రిపోర్టుచదవడానికి అరగంటసేపు పట్టింది. అంతసేపూ సభ్యులు ఆతురతతో నిశ్శబ్దంగా కూర్చున్నారు. భూమి పదునికి వచ్చినప్పటికీ ఇంకా జిల్లాలో కొన్నిప్రాంతాలలో చల్లికలు ప్రారంభించనేలేదు. కొన్నిగ్రామ

పోవియాటులు అవి వసూలు చెయ్యవలసిన విత్తనపుధాన్యం వసూలు చెయ్య లేదు. పమొస్క్ర వాయిదాలో రాజీనామాయిచ్చిన సమిష్టి వ్యవసాయ క్షేత్ర సభ్యులందరూ ఎకరివివాళ్ళుపట్టుకుపోయేరు. ఓఖ్లోవట్సుస్కిలో స్వయంగా మేనేజిమెంటు కమిటీయే పంచిపెట్టేసింది. రాజీనామాయిచ్చిన సభ్యులకేం దరికీ. అతిడు జిల్లాలో చల్లికలు యింతపాడుగా ఉండడానికి ల కారణాలు వివరంగా వర్ణిస్తూ తన ఉపన్యాసం ఇల్లాముగించేడు:

"కామ్రేడ్స్, చల్లికలు వెనకబడడానికి కారణం, వెనకబడడమే కాదు బయలుదేరకపోటనే ఉండడానికి కారణమనికూడా చెప్పచ్చు, చాల గ్రామాలలోని సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు అక్కడ స్థానికసర్కర్ల తీవ్ర మైన ఒత్తిడిచేత ఏర్పరచబడ్డం, మరికొన్ని గ్రామాలలో రివాల్వరుచూపించి భయపెట్టికూడా సభ్యులుగా చేర్పించడం. అందుచేతనే సమిష్టి వ్యవసాయ క్షేత్రాలన్నీ ఇప్పుడు పేకమేడల్లా కూలిపోతూన్నాయి. ఇక అల్లాకూలి పోకుండా మిగిలిన వాటిలోనైనా పని సరిగ్గాజరగడంలేదు."

డిస్ట్రిక్టుకమిటీ సెక్రటరీ వార్నింగుగా చేతిలోని పెనిసిలుతో టేబులు మీద చప్పుడుచేసి,

"ఇంక మీ టైము అయిపోయింది." అన్నాడు.

"ఆ—అయిపోవచ్చింది; ఒక్క నిముషం. కామ్రేడ్స్, ఇంక కొద్దిమాట లు చెప్పి ముగించేస్తూన్నాను. మొదటి 5 రోజులలోను మనకి చేరిన లెక్కలను పట్టిచూస్తే, మొత్తం మనజిల్లాఅంతటిలోనూ 950 ఎకరాలుమాత్రం చల్లిక లయేయి. ఇటువంటి పరిస్థితులలో జిల్లాలోని యాక్టివ్ వర్కర్లు అందర్నీ పోగుచేసి సమిష్టి వ్యవసాయ క్షేత్రాలకి పంపించకపోతే ఏమీలాభంలేదు. ఇప్పుడుమనం చెయ్యవలసింది ఏమిటంటే—మనకి చేతనయినంతవరకూ అన్ని విధములా, సమిష్టి వ్యవసాయ క్షేత్ర సభ్యులు రాజీనామాలు ఇవ్వకుండా చెయ్యడం, ఫారం మేనేజిమెంట్లు, నూక్లెస్ సెక్రటరీలు ప్రతీరోజూ తప్పని సరిగా, సమిష్టివ్యవసాయక్షేత్ర సభ్యులలో, ప్రభుత్వం సమిష్టివ్యవసాయ క్షేత్రాలకు ఇచ్చేవిరాళాలు, ఇతరసౌకర్యములు మొదలైనవానినిగురించి,

విపరీతమైనభయంనగుల్నోవ్ కి. సెమొఖిన్ డాక్యుమెంటు కేసులోనుంచి పెద్దదస్త్రంపైకి తీసేటప్పటికి నగుల్నోవ్ కి ఆందోళనపట్టుకుంది. గుండెలు వేగంగా కొట్టుకోడం మొదలెట్టేయి. రక్తం తలలోకి ఒక్కసారిగా వేగంగాప్రవహించింది. కంఠంలో ఏదో అడ్డుపడ్డట్టు అయింది. ఇవన్నీ అతనికి మూర్ఛ వచ్చేముందు కనపడేచిహ్నాలు. "ఇదికూడా ఇప్పుడే రావాలి." సెమొఖిన్ ఒక్కొక్క కాగితమే తాసి చదువుతూంటే నగుల్నోవ్ లోలోపల ఒణికిపోతూ వింటున్నాడు.

"డిస్ట్రిక్టుకమిటీ కంట్రోల్ కమిషన్ ఆజ్ఞమీద ఈకేసు నేను స్వయంగా విచారించేను. నగుల్నోవ్ ని, సమిష్టి వ్యవసాయక్షేత్రసభ్యుల్ని, అతనిచేత దెబ్బలుతిన్న రైతుల్ని, స్వయంగా చూసిన మరికొంతమంది సాక్షుల్ని పరీక్షించినమీదట నేను ఈక్రింది నిశ్చయానికి వచ్చేను. నగుల్నోవ్ అతని ప్రవర్తనవల్ల పార్టీకీర్తిని అపకారంచేసేడు. ఉదాహరణగా మొన్నఫిబ్రవరి నెలలోరైతుల్ని సమిష్టివ్యవసాయక్షేత్రంలో చేర్పడానికి యింటింటికీవెళ్ళి పిస్టలుతో బెదిరించి బలవంతంగా చేర్పించేడు. ఈవిషయం నగుల్నోవే అంగీకరించేడు..............."

"ద్రోహులలో ద్రోహులువాళ్ళు." అంటూ నగుల్నోవ్ కుర్చీలోనుంచి లేచేడు.

"మిమ్మల్ని ఎవరూ మాట్లాడమనలేదు యిప్పుడు! దయచేసికూర్చోవాలి!" సెక్రటరీ తీవ్రంగా మందలించేడు.

"తరువాత విత్తనాలు వసూలు చేసేటప్పుడు, సాధారణ రైతునొక్కణ్ణి సోవియట్ డెలిగేట్లు, సమిష్టి వ్యవసాయక్షేత్రసభ్యులు అందరూ వుండగా స్పృహతప్పి కిందపడిపోయేవరకూ పిస్టలుతో కొట్టేడు. అలాకొట్టడానికి కారణం ఆరైతు వెంటనే విత్తనాలు తీసుకురావడానికి నిరాకరించడమే......."

"సిగ్గు! సిగ్గు!" డిస్ట్రిక్టు ప్రాసిక్యూటరు గట్టిగా కేకేసేడు. నగుల్నోవ్ చేతితో కంఠం రాసుకున్నాడు. నిలువుదచ్చిపోయి మాట్లాడకుండానిలబడ్డాడు.

"కామ్రేడ్స్ ఆరోజురాత్రి ముగ్గురు సమిష్టివ్యవసాయక్షేత్రసభ్యుల్ని

పిస్టలుతో బెదిరించి ఒకగదిలోపెట్టి తాళంవేసేడు. దీనికికూడా కారణం వెంటనే వాళ్ళు ధాన్యంతీసుకురావడానికి నిరాకరించడమే. ఇదంతా చూస్తే పూర్వకాలంలో పోలీసు ఆఫీసర్ల జులుం జ్ఞాపకమొస్తుంది.........”

"నేను వాళ్ళని పిస్టలుతో బెదిరించలేదు."

"కామ్రేడ్ నగుల్నోవ్, నేను వాళ్ళు చెప్పినమాటలే చెబుతూన్నాను. మధ్యలో అడ్డురావద్దు. గెయీవ్ సామాన్యరైతు. అయినప్పటికీ నగుల్నోవ్ ఒత్తిడిచేత గొప్పరైతుఅని తీర్మానంచేయబడి ప్రవాసం పంపబడ్డాడు. నగుల్నోవ్ అతనిని గొప్ప రైతులలో చేర్చడానికి కారణం అతడు 1928 సం॥లో ఎవరినో కూలికి పెట్టుకోవడంచేతట. అయితే అతను ఎటువంటి పరిస్థితులలో కూలీని నియమించుగున్నాడు? కామ్రేడ్స్, గెయీవ్, గ్రిమాచీలాగ్‌లో ఒకపిల్లని సాగుకోలులలో ఒకనెలరోజులపాటు కూలికి పెట్టుకున్నాడు. అతని కొడుకు రెడార్మీలో చేరడానికి 1927సం॥లో పిలువబడడం చేత, మిగిలినవాళ్ళంతా పసిపిల్లలవడంచేత ఒక్కడికీ పనిసాగక అల్లా చెయ్యవలసివచ్చింది. అటువంటి పరిస్థితులలో కూలీలచేత పనిచేయించుకోడం సోవియటు చట్టాలప్రకారం నిషిద్ధంకాదు. గెయీవ్ ఆపిల్లని కూలిసంఘం అనుమతిమీద నియమించుకుని కూలిపూర్తిగా ఇచ్చేసేడు. ఇదంతా నేను విచారణచేసి తెలుసుకొన్నవిషయం. ఇంతేకాకుండా నగుల్నోవ్ ముండల ముఠాకోరుగా తిరుగుతున్నాడు. పార్టీమెంబరుయొక్క యిటువంటి ప్రవర్తన క్షంతవ్యంకాదు. నగుల్నోవ్ భార్యని ఒదిలేసేడు. ఒదిలెయ్యడమేకాదు. కుక్కని తరిమినట్లు బయటికితరిమేసేడు. దీనికి అతడుచెప్పేకారణం ఆమెకి గ్రిమాచీలాగ్‌లో మరియొకయువకునితో సంబంధం వున్నదని మాత్రమే. ఈసాకుతీసుకుని ఆమెనిలేవగొట్టేసి స్వేఛ్ఛగా ఉంటున్నాడు. భార్యనిఒదిలేసి అతడు ఎవరితోసంబంధం ఏర్పరచుకున్నదీ ఇప్పుడు నాకు తెలియదు. కాని వాకబువల్ల అతనిప్రవర్తన అనుమానించడానికి ఏమీ సందేహం అవసరం లేదనితోచింది. లేకపోయినట్లయితే అతను భార్యనిఎందుకు విడిచిపెట్టాలి? నగుల్నోవ్ ఉన్నయింటిఆమె అతెనుప్రతిరోజూ యింటికి బాగాపొద్దుపోయి

వస్తూంటాడని చెప్పింది. అతను ఎక్కడికి వెళ్ళేదీ ఆమెకు తెలియదు కాని అవిషయం ఒకరు చెప్పనక్కరలేకుండానే తెలుసుకోవచ్చు! భార్యని ఒదిలేసిన మొగాడు రాత్రిలు ఎక్కడ కాలక్షేపం చేస్తాడో తెలుసుకోలేకపోడానికి అంతకుర్రాళ్ళంకాదు మనం. ఒకదాన్ని విడిచి మరియొకదాన్ని మచ్చుచూస్తూంటాడు, ఎవరు బాగుంటారోనని. ఏమీ అనుమానంఅవసరంలేదు! కామ్రేడ్స్! ఇదీ నగుల్నోవ్ చరిత్ర. దీనికి పర్యవసానం ఏమిటి? ఇటువంటి ప్రవర్తనకి మూలకారణాలు ఏమైవుంటాయి? కామ్రేడ్ స్టాలిన్ చెప్పినట్లు విజయోన్మాదము కాదు. మరి ఏమిటంటే మంచిచెడ్డలు ఆలోచించకుండా అతివాదధోరణి అవలంబించి పార్టీపాలసీని ఎదుర్కోవడమే. సామాన్య రైతుల్ని భాగ్యవంతులని చెప్పి సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో చేరనివ్వక పోవడమే కాకుండా, కోళ్ళు, బాతులు, గొర్రెలు మొదలైన చిన్నచిన్న జంతువుల్ని కూడా సమాజపరం చెయ్యాలని రిజల్యూషన్ పాసుచేయించడంలోనే తెలుస్తూన్నాయి అతని తెలివి తేటలు.”

“వాటినిగురించి డిస్ట్రిక్టు కమిటీదగ్గరనుంచి ఉత్తరువు ఏమీ రాలేదు.” అన్నాడు నగుల్నోవ్ శాంతంగా.

“క్షమించండి, అక్కడే మీరు పొరపాటుపడుతున్నారు.” అని సెక్రెటరీ అందుకున్నాడు. “ఫలానావిధంగా చెయ్యమని డిస్ట్రిక్టుకమిటీ తెలియ చెయ్యకపోలేదు. తెలిసీ తెలియకుండా తప్పు పైవాళ్ళమీదికి తోసేద్దంఅని చూడకండి! లేబరింగుఅసోసియేషన్ రెగ్యులేషన్లలోనుంచి ఆమాత్రంవిషయం గ్రహించకపోడానికి అంత తెలియనివాళ్ళు కారు.”

“గ్రెమాచీ సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో ఆత్మవిమర్శన పూర్తిగా అణిచివెయ్యబడింది.” సెమ్యోభిన్ మళ్ళీ ప్రారంభించేడు. “నగుల్నోవ్ అందర్నీ హడలగొట్టేసి నోరెత్తకుండాచేసేడు. ప్రజలకి ప్రతీవిషయం విమర్శగాచెప్పి ఒప్పించడానికిబదులు కేకలేసి చిందులుతొక్కి మట్లాడుతే పిస్టలుతీసి బెదిరించడం మొదలెట్టేడు. అందుచేత గ్రెమాచీలాగ్ స్టాలిన్ సమిష్టివ్యవసాయ క్షేత్రసభ్యులలో అసంతృప్తి బాగా వ్యాపించిపోయింది. ప్రతిరోజు డజన్ల

కొలది రాజీనామాలు ఇచ్చేస్తూన్నారు. అక్కడ పల్లికలు మొన్ననే ప్రారంభమయేయి; కాని ఆపని అసంపూర్తిగా ఆగిపోవలసివస్తుంది. పార్టీలోచేరి దాని నిర్మాణకార్యక్రమం అంతా భగ్నంచెయ్యడానికి ప్రయత్నంచేస్తూన్న అన్నివర్గాల అపర్ట్యూనిస్టుల్ని పార్టీలోనుంచి తొలగించడానికి ఏర్పరుపబడ్డ డిస్ట్రిక్టుకంట్రోల్ కమిషను నేను చెప్పినవిషయాలలోని సారాంశంగ్రహించి నగుల్నోవ్ విషయం ఏమిచెయ్యవలసియున్నదీ నిర్ణయించుకొందురు గాక."

"పూర్తిఅయిందా?" సెక్రెటరీఅడిగేడు.

"ఆ—అయింది"

"నగుల్నోవు లేచిమాట్లాడచ్చు. అతను తనచర్యల్ని ఎల్లా సమర్థిస్తాడో చూద్దాం. నగుల్నోవ్! లేచిమాట్లాడు."

సెమోఖిన్ మాట్లాడడం పూర్తి అయేటప్పటికి నగుల్నోవుకోపానికి అంతులేదు. కానిఇప్పుడు హఠాత్తుగా అంతకోపముపోయిదానిస్థానే భయము, సంకోచము ఆక్రమించేయి. "నన్ను ఏంచేద్దాంఅని చూస్తున్నారు? సర్వనాశనంచేద్దాంఅని చూస్తూన్నట్టున్నారు?" అని ఆలోచించుకుంటూ టేబులుదగ్గరకివచ్చేడు. సెమోఖిన్ మాట్లాడుతున్నంతసేపూ 'అతను చెప్పినవన్నీ తీవ్రంగా ఖండిద్దాం.' అనుకున్న నగుల్నోవ్ ఆలోచనలేమీ ప్లాట్‌ఫారంమీదికి వచ్చేటప్పటికి నిలబడలేదు. బుర్రఅంతా ఖాళీఅయిపోయినట్లుగా అనిపించింది. మాట్లాడడానికి ఒక్కమాటకూడా తోచలేదు.

"కామ్రేడ్స్, నేనువిప్లవంనాటినుంచీకూడా పార్టీలోవున్నాను...." అని నగుల్నోవు ప్రారంభించేడు. "రెడార్మీలో పనిచేసేను........."

"ఆవిషయంమాకుతెలుసును! అసలువిషయానికిరండి!" సెక్రెటరీ విసుగుదలతో అతనిమాటకిఅడ్డంవచ్చేడు.

"శత్రువులతో అన్నియుద్ధరంగాలలోను పోరాడేను...... మొదటి అశ్వికదళంలోవున్నాను. నేను...ఆర్డర్ ఆఫ్‌ది రెడ్ బేనర్ పతకంకూడా..."

"ప్రస్తుతవిషయాన్నిగురించి మాట్లాడండి!"

"ఇదిమాత్రం దానికిసంబంధించింది కాదా?"

"నగుల్నోవు! వాదించినా లాభంలేదు. పూర్వం ఏవో ఘనకార్యాలు చేసేనంటే, అవేమీ లాభంలేదు ఇప్పుడు." అన్నాడు డిస్ట్రిక్టు ఎగ్జిక్యూటివ్ కమిటీ ఛైర్మన్.

"ఆ కామ్రేడ్‌ని మాట్లాడనియ్యండి. మాటమాటకీ అడ్డు తగులుతూంటా రెందుకు?" అన్నాడు బలాబిన్ తీవ్రంగా. బట్టతలమీద రక్తనాళాలు ఉబికినాయి.

"అయితే అనవసరపు గొడవపదిలేసి ప్రస్తుతవిషయం యెత్తుకుంటేసరి." నగుల్నోవు యెడమచెయ్యి గుండెలకి అదుముకొని అలాగే నిలబడ్డాడు. కంఠం పొడి ఆర్చుకుపోయింది. ముఖంమీద కత్తివాటువేస్తే నెత్తురుచుక్క లేదు. కుడిచేతితో కంఠం సవరించుకుంటూ అతికష్టంతో మళ్ళీ మాట్లాడడం ప్రారంభించేడు.

"నాకుతో చివరి యేదో చెప్పనియ్యండి. మీరు నామీద అంత శత్రుత్వం వహించడానికి అంత గర్భ శత్రువుని కాను. సైన్యంలో పనిచేసేటప్పుడు అనేక గాయాలు తగిలేయి,........." ఇంక నోట మాట వచ్చిందికాదు. బలాబిన్ ఆడావిడిగా కూజాలోని నీళ్ళు గ్లాసులోపోసి నగుల్నోవుకి అందించేడు, అతని ముఖంకేసి చూడకుండా.

సెక్రటరీ ఒక్కసారి మకార్ కేసి చూసి దృష్టి మరలించుకున్నాడు. మకార్ గ్లాసు నోటిదగ్గర పెట్టుకునేటప్పటికి చెయ్యి విపరీతంగా వణకడం ప్రారంభించింది. ఆ నిశ్శబ్దంలో గ్లాసు పళ్ళకి తగులుతూన్న చప్పుడు స్పష్టంగా వినిపిస్తూంది.

"మకార్, కంగారు పడకు. ధైర్యంగా మాట్లాడు!" అని బలాబిన్ హెచ్చరించాడు.

సెక్రటరీ తల పంకించేడు. మకార్ స్థితి చూసేటప్పటికి అతనికికూడా కొంచెం జాలికలిగింది. కాని, మళ్ళీ గుండె రాయి చేసుకున్నాడు. నగుల్నోవు పార్టీలో వుండడం అపాయకరమనీ సెక్రటరీ పదవినుంచేగాక అసలు పార్టీలోనుంచే తొలగించాలనీ అతనికి దృఢమయిన అభిప్రాయం యేర్పడింది.

ఒక్క బలాటిన్ మినహాగా అక్కడవున్న వాళ్ళందరూ అదేఅభిప్రాయంతో వున్నారు.

మకార్ గ్లాసెడునీళ్ళు రెండు గుక్కలలో తాగేసి వూపిరి తీసుకుని మాట్లాడసాగేడు.

"సెమోష్కిన్ చెప్పిందంతా నిజమే. దానిలో లేదని అబద్ధమాడి తప్పించుకునేది యేమీ లేదు. కాని పార్టీకి ద్రోహం చెయ్యాలన్న వుద్దేశం మాత్రం నాకు లేదు. అక్కడే సెమోష్కిన్ అబద్ధం ఆడుతూన్నాడు. నేను పరస్త్రీలతో తిరుగుతూన్నానన్నదికూడ పూర్తిగా అబద్ధమే! అదంతా వూహ. ఆడాళ్ళతో నేను చేసేది యేమీ లేదు. వాళ్ళ అవసరం యేమాత్రమూ లేదు నాకు..........."

"ఎందుకు? నేనా భార్యని విడిచిపెడత?" అన్నాడు హామూటోవ్ పరిహాసంగా.

"ఆ—అవును, అందుచేతనే" అని జవాబుచెప్పేడు మకార్ సీరియస్‌గా. "అవన్నీ నేనుచెప్పేను. అప్పటికీ ఇప్పటికీ; ఎప్పటికీకూడ విప్లవం జయప్రదం కావాలని కోరేను. నేను అనుసరించినమార్గం తప్పుఅయివుండవచ్చు. ..........నాకు ఆవిషయం తెలియదు. నాకంటెబాగా చదువుకున్నవాళ్ళు మీరంతా. బాగాశిక్షణ పొందేరు. పరిస్థితులన్నీ బాగాఅవగాహన చేసుకోగల శక్తి వుందిమీకు. చేసినతప్పు కప్పిపుచ్చాలనే ఉద్దేశం లేదు నాకు. ఇష్టంవచ్చినట్లు విచారణచెయ్యండి. కాని ఈపనులన్నీ......" గుక్కతిరగక మాట మధ్యలో మింగేసి ఊరుకున్నాడు ఒకనిముషం. "పార్టీని నాశనంచేద్దామన్న దురుద్దేశంలేకుండా, నాఅత్మకథతో చినవే అనిమాత్రం మీరు గుర్తించగోరుతాను. నేను జేనిక్ నికొడిల అతిమూపార్టీని వెక్కిరించి, విత్తనాలు పందులకి పోస్తానన్నందుకు కాని, ధాన్యంపంటనే ఇవ్వననందుకు కాదు..........."

"అదిగో, అల్లాచెప్పు!" సెమోష్కిన్ వేళాకోళంచేసేడు.

"అవును; జరిగిందే చెపుతున్నాను. హాస్యంచేసేను కాని ఇప్పటికీనాకువిచారంగావుంది. ఇంతకంటే నేనుచెప్పవలసింది ఏమీలేదు."

సెక్రెటరీ కుర్చీలోనుంచి లేచి నిలబడ్డాడు. ఉద్యోగహోంతెముల్చుకుని ఎప్పుడు బయటపడుదుమా అని చూస్తూన్నాడు.

"కామ్రేడ్స్, విషయంఅంతా స్పష్టంగా కనిపిస్తూనేవుంది. అన్ని విషయాలు నగుల్నోవ్ స్వయంగా అంగీకరించేడు. మొత్తంమీద అతను తప్పు కాదని ఒప్పించుకోవాలనేడు కాని ఆవిషయంకూడా ధైర్యంగా చెప్పలేకపోయేడు. సాధారణంగా చూసి ప్రతివాడూ, కొంత పని చెయ్యలేదనీ, కొంత మరియొకడిమీదికి తోసేసి, తప్పించుకోడానికి ప్రయత్నించడం మామూలే. సమిష్టి వ్యవసాయ క్షేత్రనిర్మాణవిషయంలో పార్టీ నిర్ణయాలు అన్నీ అతిక్రమించినందుకూ, కమ్యూనిస్టు అయివుండీకూడా చెడుప్రవర్తన కలిగియున్నందుకూ, నగుల్నోవ్‌ని పార్టీలోనుంచి తొలగించకతప్పదు. వెనకఎప్పుడో పార్టీకోసం చేసినత్యాగంమాసి ప్రథమతప్పిదంకింద ఊరుకునే పరిస్థితులుకూడా దాటిపోయేయి. మిగిలినవాళ్ళకి కూడా బుద్ధివచ్చేటట్లు కఠినంగా శిక్షించాలి. పార్టీకిద్రోహంతలపెట్టే వాళ్ళని, మూరుదోవలకి ఈడ్చి నాశనంచెయ్యప్రయత్నించేవాళ్ళనీ, దయతలచక బహుక్రూరంగా శిక్షించాలి. నగుల్నోవ్ విషయంలో సగం సగం శిక్షించివదలడానికి వీలులేదు. అతనివిషయంలో చాలా కాలంవహించేము ఓర్పు. క్రిందటిసంవత్సరం కో-ఆపరేటివ్ లాండ్ లేబరు అసోసియేషన్లు నిర్మించేటప్పుడే పార్టీఅతివాదిగా ప్రవర్తించడం, వార్నింగు యివ్వడంకూడాజరిగింది. కాని అతనిదృక్పథం ఏమీమార్పుచెందలేదు. దానికి మనంచేసేదేముంది! సమ్మతులు తీసుకొందమా! బ్యూరో మెంబర్లుమాత్రమే వోటుచెయ్యాలి. నలుగురు అనుకూలురు — అంతే కాదూ? కామ్రేడ్ బలాబిన్, మీరుసమ్మతిలేకమా!"

బలాబిన్ పిడికిలితో బల్లమీద గుద్దేడు. కణతలదగ్గిర రక్తనాళాలు ఉబికేయి.

"నేను ప్రతికూలంమాత్రమే కాదు; అతితీవ్రంగా ఎదిరిస్తూన్నాను." అన్నాడు. "మీరుచాలా పొరపాటునిర్ణయంచేస్తూన్నారు."

"మీరు ఆమాదిరిఉద్దేశ్యం కలిగివుండవచ్చు." అన్నాడు సెక్రెటరీ.

"నేనుమాట్లాడడానికి అవకాశంయివ్వాలి మీరు."

"బలాబిన్, ఇప్పటికేచాల ఆలస్యమయిపోయింది. నగుల్నోవ్‌ని పార్టీ నుంచి తొలగించడానికి యెక్కువమందిచేత అంగీకరించబడింది."

"ఆర్థికవిషయంలో మీరుతీసుకునే నిర్ణయంచాలా నిరంకుశంగా వుంది. ఈవిషయాన్ని నేను ఇంతటితో వదిలిపెట్టను. వెంటనే రిజినల్ కమిటీకి తెలియచేస్తాను. ఒక పాతపార్టీసభ్యుణ్ణి, అందులోనూ 'ఆర్డర్ ఆఫ్ ది రెడ్ బేనర్' బిరుదుపొందిన సభ్యుణ్ణి పార్టీనుంచితొలగించడం............ కామ్రేడ్స్, మతిస్థిరంవుండిచేసినపనేనాయిది? పార్టీనుంచి తొలగించడమేచెప్ప ఇంకేమీశిక్షలేకపోయిందా?"

"ఒకవిషయం నిర్ణయంఅయిపోయేక ఇంకే ప్రశ్న, చర్చ అవసరంలేదు. ఇంతక్రితమే వోటుచేసేసేము."

"ఇటువంటివోటింగుకి మిమ్మల్ని యేమిచేసినా పాపంలేదు." బలాబిన్ కోపంతో గట్టిగా అనడంచేత కంఠంకీచుపోయింది. పెదవులు వణికేయి.

"ఆజబర్దస్తీ వ్యవహారం కట్టిపెట్టండి." అన్నాడు నిర్మాణశాఖాధికారి. "ఇది జిల్లాపార్టీకమిటీకాని జిల్లామిలీషియా ఆఫీసుకాదు."

"ఆవిషయంమీరు చెప్పనక్కరలేకుండానే తెలుసును. కాని నేను మాట్లాడేటందుకు అవకాశం యివ్వరెందుచేత?"

"అవసరంలేదని తోచడంచేత." అన్నాడు సెక్రటరీ ఆ కోపంలో. "నేనుజిల్లాపార్టీసెక్రటరీని. ఇక్కడమాట్లాడడానికి మీకుఅవకాశంయివ్వను. అంతగామాట్లాడదలుచుగుంటే బయటవరండామీదికి వెళ్ళి మాట్లాడండి."

"బలాబిన్, మీరుకూడా అంతరెచ్చిపోతే యెల్లా! అసలుఅంతకోపం దేనికి? మీవుద్దేశ్యం రిజియనల్ కమిటీకి వ్రాతమూలంగా తెలియపరచండి. ఇంతకిృతమే వోటుచేసేసేము. అంతాఅయిపోయేక మీరు యెంతచెబితే మాత్రంయేముంది." జిల్లాఎగ్జిక్యూటివ్ కమిటీ ఛైర్మన్ బలాబిన్‌ను అనునయించడానికి ప్రయత్నించేడు. అతను బలాబిన్‌ను జబ్బపట్టుకునిఒకమూలకు తీసుకువెళ్ళి నెమ్మదిగా యేదోమాట్లాడుతున్నారు.

ఈలోపుగా బలాఓవ్‌తో పేచీయూలాన కోపంగావున్న సెక్రెటరీ మకార్ వైపు తిరిగి ఇలాఅన్నాడు.

"నగుల్నోవ్! ఈవ్యవహారంఇంతటితో ముగిసింది. నిన్ను పార్టీనుంచి తొలగించడానికి బ్యూరోనిశ్చయించింది. నీవంటివారు పార్టీకి అవసరంలేదు. నీపార్టీ మెంబర్‌షిప్ కార్డు యిచ్చెయ్యి."

నగుల్నోవ్ ముఖానకత్తి వేటు వేస్తే నెత్తురుచుక్క లేదు. మనిషినిలువునా వణికిపోయేడు. "నాపార్టీ కార్డునేను యివ్వను." అన్న కంఠస్వరానే అతనిది కాదు.

"నువ్వుయిచ్చేటట్టు చేస్తాను."

"నగుల్నోవ్! రిజియనల్ కమిటీకి వెళ్ళు." అని బలాఓవ్ అమూల నుంచి గట్టిగా కేకేసేడు. షైర్మన్‌తో మాట్లాడుతూమాట్లాడుతూఅకాత్తుగా బయటికి వెళ్ళిపోయి తలుపులు భడేలున వేసేసేడు బలాఓవ్.

"నాపార్టీ కార్డుయివ్వను." అన్నాడు తిరిగిమకార్. క్రమంగా కంఠస్వరం హెచ్చింది. ముఖంలోని వెంకటిరక్తహీనతపోయి క్రమంగా జేవురించింది. "పార్టీకి నేను యింకావుపయోగపడతాను. పార్టీనుంచి వేరయిపోయి నేను జీవించలేను. నేను నీకోలాంగను. ఇదిగో ఈకోటుజేబులో పార్టీ కార్డు వుంది. చేతనైతే తీసుకో. దగ్గిరికి వస్తేమాత్రం జాగ్రత్త."

"చివరకు విషాదాంతకంగా పరిణమించేటట్లుంది యీవ్యవహారం" అన్నాడు జిల్లాపార్టీసెక్రెటరీ జబ్బలు కుదుపుకుంటూ. "ఈ ఉన్మత్తులు లేకుండగా........"

ఆమాట లేవీ లెక్కచెయ్యకుండా మకార్ సెక్రెటరీకేసి చూస్తూ నెమ్మదిగా, తనలోమాట్లాడుతున్నట్టుగా మొదలెట్టేడు.

"పార్టీనుండి లేనీ యింక నేను యెక్కడికి వెడతాను? అవికాక నేనుఎందుకు వెళ్ళిపోవాలి? పార్టీ కార్డుమాత్రం నేను యివ్వను. నేను నాజీవితంఅంతా.... ......నాజీవితంఅంతా........." అకాత్తుగా జవసత్త్వాలు ఉడిగిపోయిన మనిషివానిమాదిరిగా టేబులుమీదకువంగి మాటలు తడబడుతూ అడావిడిగా

అస్పష్టంగా మాట్లాడుతూ ముగించేడు.

"ఈపరిస్థితుల్లో మీరు.........వెంకనాకు జీవితంలో మిగిలినదేమి టంటే చావు ఒక్కటే. ఇంకెయేమీ పోవాయిలేదు. ఇంకనాకు జీవితలక్ష్యం ఏమీలేదు. అందుచేత దానికికూడా మీరే స్పష్టి చెప్పండి.......ఒకప్పుడు నాఅవసరం వుండి.........ఇప్పుడు ముసలివాణ్ణి అయిపోయేను......... ఈ ముసలికుక్కని బయటికి తరిమెయ్యండి."

పెదవులు వణికేయి. ఆఖరిమాటలు అంటుంటే అతనిజీవితానికి అంతటికీ అదే ప్రథమపర్యాయం, కన్నీరు ఏకధారగా ప్రవహించింది.

"కన్నీళ్ళు పెట్టుకుంటే లాభంలేదు. ఇందులోంచి బయటపడేమార్గం అదికాదు, కామ్రేడ్." అన్నాడు సెక్రెటరీ.

"కామ్రేడువు కాదు నువ్వు........." అనిసగుల్లోవ్ మళ్ళీ గట్టిగా అందుకున్నాడు. "మానవరూపంలోవున్న తోడేలువు. ఇక్కడున్న మీరంతా విషపుఘ్వాలు. అధికారం మీచేతులలోవుంది! నెమ్మదిగామాట్లాడుతూ తడిగుడ్డతో గొంతుకకొయ్యడం బాగానేర్చుకున్నారు. హొమూటోవ్, పళ్ళు అలా ఇకిలిస్తావెందుకు? నాకళ్ళనీళ్ళుచూస్తే నీకు సరదాగావుందా? నువ్వు ......1921 సం॥లో ఫోమిన్ సైన్యం దేశంఅంతా ధ్వంసంచేస్తూంటే నువ్వు రిజియనల్ కమిటీకిరావడం గుర్తుందా? ఏం—మరిచిపోయేవా? వచ్చి పార్టీటికెట్టు యిచ్చేసి, ఇకనుంచి రాజకీయాలు వదులుకొని వ్యవసాయం చేసుకుంటానన్నావు.........ఫోమిన్ కోసం భయపడి పార్టీటికెట్టు యిచ్చేసేవు! కాని ఆతరువాత మళ్ళీ నెమ్మదిగా పార్టీలోని ఉన్నత స్థానానికి తుట్టపురుగులా యెల్లాగో పాకి చేరుకున్నావు. అటువంటినువ్వు నన్ను పార్టీలోనుంచి తొలగించడానికి వోటుచేస్తూన్నావా? చావుదెబ్బకొట్టి, విచారిస్తూంటే నవ్వుతూన్నావా?"

"చాలు, చాలు. సగుల్లోవ్, అట్టేకేకలేసి లాభంలేదు. ఇంకాఇతర విషయాలు చర్చించవలసినవి అనేకం వున్నాయి." అన్నాడు నిర్మాణశాఖాధికారి హొమూటోవ్ వెనకటి వెంకితెంచవలసి కొంచెం నెమ్మదిగా. సగుల్లోవ్

"అది సమిష్టివ్యవసాయక్షేత్రానిది, ఇంకా మీ రెరగరా! ప్రతివస్తువా సమాజపరం అవాలి." అన్నాడు సల్లగడ్డపుకోసక్క. ఆపుగాకుసంచీ తనదే అయినట్లు పెద్దముక్క ఒకటి ఏరితీసుకున్నాడు.

వాళ్ళంతా సిగరెట్లు వెలిగించేరు. బేనిక్ అడావిడిగా పుగాకుసంచీ బ్రౌజరుజేబులో పెట్టేసి, చిరునవ్వు నవ్వుతున్నాడు. మొదట్లోకంటా కోసేసిన గుఱ్ఱాల మొండితోకల కేసి జాలిగా చూసేడు బేనిక్. తుండుఈగలు గుఱ్ఱాల మీదవాలి రక్తం తెగపీలుస్తూన్నాయి. వాటినితోలుకోడానికి మామూలుతల వాటునొప్పున ఆగుఱ్ఱాలు మొండితోకలు ఇటూఅటూ ఆడిస్తూన్నాయి కాని ఏమీవుపయోగంలేకుండా వుంది.

"మొండితోకతో ఆవైపు ఛకిచూపిస్తూంది. ఎక్కడికీ!" అన్నాడు బేనిక్ వేళాకోళంగా.

"సమిష్టివ్యవసాయ క్షేత్రంలోకి. మీగుఱ్ఱాలతోకలు కోసెయ్య లేదూ ఇంకానూ వాళ్ళు?"

"కొద్దిగా ఒక బెత్తెడుముక్క మాత్రం కోసేరు."

"మాసోవియట్ షైర్మన్ మొదట్లోకే కోయించేసేడు. అందుకోసం ఆయనకి బహుమానంకూడా వచ్చింది. కాని ఎండాలుముదిరేకవున్నాయి వీటి పాట్లు. మేమువచ్చేటప్పుడు పుగాకు తెచ్చుగోలేదు. అందుచేత దోవపొడూగునా పిచ్చెత్తినట్లుగావుంది. పాపం మేము అడగగానే లేదనకుండా ఇచ్చేరు మీరు. ఇంక వెడతాం."

"ఎక్కడికి వెళ్ళాలి?"

"గ్రెమాచీ."

"అయితే మాఊరికే అన్నమాట మీరు వెళ్ళేది. ఏంపనిమీద!"

"విత్తనాలకోసం."

"ఆ—ఎందుకూ?"

"విత్తనాలు మీఫ్రాంటునుంచి తెచ్చుకోవలసిందని జిల్లానుంచి ఆర్డరు వచ్చినది. 92 బస్తాలు కావాలి."

"ఆఖరికి అనుకున్నంతా అయింది!" అంటూ జేసిక్ వచ్చిన దోవనే ఊళ్ళోకి పరుగెత్తేడు.

యార్స్కి-బళ్ళు సమిష్టి వ్యవసాయ క్షేత్ర కార్యాలయం చేరకుండానే వాళ్ళు విత్తనాలు తీసుకుపోడానికి వచ్చేరని గ్రామంలో సగంమందికైనా తెలిసిపోయింది అప్పుడే. జేసిక్ ఒగర్చుకుంటూ వచ్చి ఇంటింటికీ వెళ్ళి చెప్పేడు.

వెంటనే ఆడాళ్ళు పక్క సందులలో చేరి గందరగోళ పడసాగేరు.

"మనవూళ్ళో ధాన్యం అన్నీ పట్టుకుపోతూన్నారట కాదూ!"

"ఆఖరికి మనకి ఒక్క గింజైనా మిగలదు."

"సమిష్టి వ్యవసాయ క్షేత్రపు గాదులలో ధాన్యం పోసుకోవద్దని మన వాళ్ళు చెప్పనే చెప్పేరు."

"కోసక్కులు మనమాట వినరండే!"

"మనం వెళ్ళి ఒక్క గింజకూడా ఇవ్వడానికి వీలులేదని చెబుదాం వాళ్ళతో."

"అవును—నడవండి వెళదాం! ఆలస్యం చేస్తే లాభం లేదు."

తరువాత క్రమక్రమంగా కోసక్కులు కూడా గుమిగూడసాగేరు. వాళ్ళ ధోరణి కూడా స్త్రీలమాదిరిగా నేవుంది. ప్రతివీధుల్లోనిజనం సమిష్టి వ్యవసాయ క్షేత్రపు గాదులవైపు బయలుదేరేరు.

ఇదే సమయానికి దేవిడోవ్ డిస్ట్రిక్టు అగ్రికల్చరల్ యూనియన్ ఛైర్మన్ దగ్గరనుంచి యార్స్కి బళ్ళవాళ్ళు తీసుకువచ్చిన ఆజ్ఞాపత్రం చదువుతున్నాడు.

"కామ్రేడ్ దేవిడోవ్" అని వ్రాసేడు. "మీరు డిస్ట్రిక్టుకి 49 బస్తాల గోధుమలు ఇవ్వవలసియున్నది. యార్స్కి సమిష్టి వ్యవసాయ క్షేత్రము తగినన్ని గోధుమ విత్తనాలు లేకుండా వుంది గనక ఆ గోధుమలు వారికి ఇవ్వవలసిందని కోరుతూన్నాను. ఈ విషయంలో నేను ఇదివరకే గ్రెయిన్ కోఆపరేటివ్‌తో ఖరారునామా వ్రాసుకున్నాను."

గోధుమలు వెంటనే తూకం వేసి యివ్వవలసిందని దేవిడోవ్ ఉత్తరువు

లిచ్చేడు. యార్స్కి మనుష్యులు బళ్లు సమిష్టివ్యవసాయ క్షేత్రపుఆఫీసునుంచి గాదులకిందికి తోలుకువెళ్ళేరు. కాని అప్పటికే గాదులచుట్టూ వీధికి అడ్డంగా జనం గుమిగూడివున్నారు. బళ్ళురావడంతోటే, ఆడాళ్ళూ, కోసక్కులూ కలిసి రెండుమూడువందలమంది వాటిచుట్టూ మూగేరు.

"ఇలా ఎందుకనివచ్చేరు?"

"మాగోధుమలన్నీ తీసుకుపోడానికి వచ్చేరా? మిమ్మల్ని పంపిన వెధవ ఎవడురా?"

"ఈపాటికి వచ్చినదోవనే దయచేయండి!"

"ఒక్కగింజకూడా ఇయ్యం!"

"మీరంతా ఇక్కడగుమిగూడేరు ఎందుకని?" అనిదేవిడోవ్ అడిగేడు వాళ్ళని.

"మాగోధుమలు ఎవళ్ళకో యార్స్కివాళ్ళకి ఇస్తూన్నారెందుకు? అవి అన్నీ వాళ్ళకి ఇవ్వడానికి ఇచ్చేమా మేము?"

"దేవిడోవ్! ఎవరిచ్చేరు అధికారం మీకు?"

"ఈ ఏడాది మేము చల్లికలు ఏంచేస్తామనుకున్నారు?"

డేవిడోవు పక్కనేవున్న గాదిపెట్లమీదనిలబడి, తను గోధుమవిత్తనాలు ఇవ్వడంలేదనియు, డిస్ట్రిక్టు అగ్రికల్చరల్ యూనియనుఆర్డరుప్రకారం ధాన్యపుపన్నుమాత్రం ఇస్తూన్నానని చెప్పేడు.

"మీరు అంతభయపడవలసిన అవసరంలేదు." అన్నాడు అతడు. "మీ గోధుమలు ఏవీ ముట్టుగోము. అనవసరంగా ఇక్కడమూగేకంటె, పొలాలలోకిపోయి మీమీపనులు చూసుకుంటే మంచిది. బ్రిగేడ్ లీడర్లు పనిలోకి రానివాళ్ళ పేర్లు వ్రాసుకుంటారన్నమాట మరిచిపోకండి."

డేవిడోవు చెప్పినమాటకు సంతృప్తినొంది కొంతమంది కోసక్కులు వాళ్ళవాళ్ళ పనులమీద పొలాలలోకి వెళ్ళిపోయేరు. స్టోరుకీపరు గోధుమలు కొలుచుతూంటే డేవిడోవు ఆఫీసుకి వెళ్ళిపోయేడు. ఆడవాళ్ళుఅంతాఅక్కడే నిలబడిచూస్తూన్నారు. యాకోవ్ లూకిచ్ కోసక్కులతో "దేవిడోవు

చెప్పేది అంతా అబద్ధం! ఇప్పుడువాళ్లుతూచేది విత్తనపుగోధుమలే. సమిష్టివ్యవసాయక్షేత్రపు భూములన్నీ చల్లికలుపూర్తిచేసుగుని విడిరైతుల కిత్తనాలు అన్నీ వాళ్ళకితూచేస్తూన్నారు." అని రహస్యంగాచెప్పి వాళ్ళనిపురికొల్పేడు.

ఆడవాళ్ళలో ఆందోళనహెచ్చింది. బేక్, డైమిడ్, డొనిట్‌స్కో మొదలైనవాళ్ళు మొత్తం ముప్ఫైమందివరకూ కొంతసేపు ఏదోమాట్లాడుకొని తరువాత కాటాదగ్గిరకి వెళ్ళేరు.

"ఇక్కణ్ణుంచి ఒక్కగింజకూడా తీసుకువెళ్ళడానికి వీలులేదు. తప్పుకోండి." అన్నాడు డొనిట్‌స్కోవ్ వాళ్ళందరి తరఫునా.

"నిన్నెవడూ అడగలేదు దయచెయ్యి!" డెమ్కావ్రషొకోవ్ అతనిని వెనక్కిగెంటేడు.

దానితోసంఘర్షణ ప్రారంభం అయింది. యార్స్కినుంచివచ్చినబళ్ళవాళ్ళు డెమ్కాపక్షానికి వచ్చేరు. బేనిక్‌దగ్గరనుంచి పుగాకుతీసుకున్న ఆ నల్లగడ్డపుకోసక్కు బండీమీదలేచినిలబడి నోటికివచ్చినట్లల్లా చెడామడాతిట్టేడు.

"ఇప్పుడు మీరుప్రభుత్వంఆజ్ఞలు తిరస్కరిస్తూన్నారు ఎందుకని? మిడిఎండలో ముప్ఫైమైళ్ళు వెళ్ళాలికదా మేము—ఎందుకని ఆటకాయిస్తూన్నారు, మమ్మల్నిత్వరగాపోనియ్యక! ఓగున్నాలేకపోతే మీరు పట్టుపగ్గాలు ఉంటాయా! ఇలాంటివెధవల్ని సొలోవ్‌కా కాన్సెన్ట్రేషన్ కాంపులకి పంపిస్తేనేకాని ఈపొగరుబోతుతనం అణగదు! మీకుఅక్కర్లేదు, పైవాళ్ళకికావలిస్తేతీసుకువెళ్ళనియ్యరు. పొలాలకిపోక ఇక్కడ నిలబడ్డారెందుకు! ఈవేళ ఏమయినాపండుగా!"

"ఏం, మహాపేలుతూన్నావు!" చిన్నఅకిమ్ అరిచేడు. "ఒళ్ళుతీటగా ఉందా! ఏమేనావుంటేఒదులుస్తాం ఇలారా. అదెంతసేపు!" అతనుచొక్కాచేతులుపైకితీసుకుంటూ జనాన్నిత్రోసుకుంటూ ముందుకువెళ్ళేడు.

ఆనల్లగడ్డపు యార్స్కికోసక్కు కిందికిపురికేడు. వెనకాముందూ చూడకుండా, వెంటనే అకిం దౌడమీద సాచి సత్తువకొలది దెబ్బకొట్టేడు. అకిమ్ ఆదెబ్బకి తట్టుగోలేక కిందపడిపోయేడు.

దానితో పెద్దదొమ్మీ ప్రారంభమయింది. యార్స్కీవాళ్లు చావు దెబ్బలుతిని రక్తాలు కారుకుంటూ, బళ్ళలోపడి జనంమీదనుంచి తొక్కించుకుంటూ, గుఱ్ఱాలు తోలుకుని పారిపోయేరు.

గ్రిమాచీలాగ్‌లో అంతవరకూ లోలోపల రవులుతూన్న విద్వేషాగ్ని ప్రజ్వరిల్లింది. డెమ్కాదగ్గరవున్న గాదులతాళాలు లాక్కోవడానికి అతని కోసం వెతికేరు జనం. కాని అతడు అంతకుముందే చల్లగా తప్పించుకుని ఆఫీసుకి పరుగెత్తేడు.

“కామ్రేడ్ డేవిడోవ్, ఈతాళంచెవులు ఏంచేద్దంఅంటావు! మన వాళ్ళు యార్స్కీవాళ్ళని చుట్టుముట్టి ధావక్కొట్టేస్తూన్నారు. ఇంకోకొంతసేపట్లో మనమీదికికూడా వచ్చిపడతారు.

“అవి నాచేతికి ఇయ్యి.”అన్నాడు డేవిడోవ్ శాంతంగా.

అతడు తాళంచేతులుతీసుకుని, జేబులోవేసుకుని, తిన్నగా గాదుల దగ్గిరకి వెళ్ళేడు. ఈలోపుగా ఆడాళ్ళుఅంతా, గ్రామసోవియటులోనున్న ఆండ్రీరజ్మట్నోవుని పట్టుగుని బయటికి లాక్కొచ్చేరు “మీటింగు ప్రారంభం చెయ్యి!” అనికేకలేస్తూ.

“ఇప్పుడు మీటింగులు అవసరంలేదు. చల్లికలరోజులలో మీటింగులు చేస్తూకూర్చుంటే ఎలాగ! కాకపోయినా ఇప్పుడు మీటింగు ఎందుకు?” రజ్మట్నోవ్ వాళ్ళనిశాంతపరచడానికి ప్రయత్నించేడు.

కాని వాళ్ళు అతనిమాటలువినలేదు. కెల్లు, జబ్బలు, చొక్కా పట్టుకొనిఆండ్రీని నూక్కులుకులాక్కుపోయేరు.

“మీటింగు ప్రారంభంచెయ్యి, లేకపోతే మాఅంతటమేమే ప్రారంభించుకుంటాం.”

“నీకుతెలియదంటేమాత్రం మేం నమ్మద్దూ. షైర్మణ్వు కూడాను నువ్వు, నీచేతనవును.”

ఆండ్రీ వాళ్ళనందర్నీ విదల్చి దూరంగాగెంటేసి, చెవులలో వేళ్ళు పెట్టుగుని వాళ్ళకంటె గట్టిగా “ఛీ. మిమ్మల్నితగలెయ్యా దూరంగాపొండి!

ఇప్పుడు మీటింగురెందుకు మీకు?"

"ధాన్యాన్ని గురించి నీతో మాట్లాడడానికి."

ఆఖరికి ఎల్లాఅయితేనేం వాళ్ళంతా బలవంతపెట్టి ఆండ్రీచేత సభ ప్రారంభం చేయించేరు.

"ముందు నేనుమాట్లాడాలి." అంది రెయికటెరినా గుల్యాశ్చాయా.

"ఆ ఉబలాటం అవుతుంది, రా మాట్లాడు!"

"అట్టే వాగేవంటేజాగ్రత.........మాధాన్యంఅంతా ఎవరికో పంచి పెట్టడానికి నీకేంఅధికారంవుంది? ఆఅధికారం యిచ్చినవాడెవడు? ముందు దీనికి సమాధానం చెప్పు." అంటూ సమాధానంకోసం అతనికేసి చూసింది.

"కామ్రేడ్ డేవిడోవ్ ఇందాకమీకు చెప్పేడు. అదీకాక ఇలాంటివిషయాలు మాట్లాడేటందుకు కాదు ఈసభ ప్రారంభించేస్త.........."ఆండ్రీ నిట్టూర్పువిడిచేడు.

"అంతాకలసి పందికొక్కులను చంపడానికి వెళ్ళవలసిఉండడంచేత."

ఆండ్రీ వాళ్ళని మాయచేసి, మరిపించడానికి చూసేడు. కాని లాభంలేకపోయింది.

"పందికొక్కులేమిటి?"

"ఇప్పుడు పందికొక్కులు ఉన్నా చచ్చినా ఎవడికీ అక్కర్లేదు."

"మాధాన్యంమాకిచ్చెయ్యి."

"పందికొక్కుల్ని చంపడానికి బయలుదేరుదువుగాని, ముందుమా ధాన్యంమాట ఏమంటావు?"

"ఏముంది అనడానికి, ఏమీలేదు."

"ఏమిటీ! ఏమీలేదూ? ముందు ధాన్యంఇచ్చి మరీమాట్లాడు."

అంటూ గుల్యాశ్చాయా, మరికొంతమంది ఆడవాళ్ళు వేదికదగ్గిరికి వచ్చేరు. అక్కడే వేదికమీద దగ్గరగనిలబడియున్న ఆండ్రీ వాళ్ళకేసిచిరునవ్వు నవ్వుతూ చూస్తూన్నా లోలోపల అతనికిగాభరాగానేవుంది. ఆడవాళ్ళ వెనక దూరంగానిలబడ్డ కోసక్కులుకూడ చాలాతీవ్రంగానేవున్నారు.

"శీతకాలం, వేసవికాలంకూడా నీవు మంచిఖరీదైనబూట్లు తొడుక్కునేఉంటావు; మాకుమాత్రం అవేమీఅక్కరలేకుండాపోయింది." అందిఒకతె.

"కమీసారు అయిపోయేడు!"

"మెరీనా మొగుడు ట్రౌజర్లు తొడక్కటంమానేసేవు ఎంతకాలంనుంచి!"

"బట్టలు లాగేద్దాంరండి!"

చెవులు గింగురుమనేలా ఒక్కటేగోల. ఆడాళ్ళంతా వేదికచుట్టూ మూగేరు. ఆండ్రీ వాళ్ళనందర్నీ శాంతపరచడానికి ఎంతో ప్రయత్నించేడు కాని లాభంలేకపోయింది. ఆగోలలో అతనిమాట వినబడలేదు.

"ముందుగా బూట్లులాగేద్దాం; అంతా ఒక్కసారిగా పెడదాంరండి!"

అంతాఒక్కసారిగా వేదికయెక్కి ఆండ్రీఎడమకాలుపట్టుగున్నారు. అతడు కాలువిదుల్చుగోడానికి చాలాప్రయత్నించేడు. కాని ఇంతలో ఎవరో బూటు కాలినుంచిలాగేసి జనంపైనుంచిగిరవాటేసేరు. ఆబూటు ఎవరికిఅందుతే వాళ్ళుపట్టుగుని ఇంకావెనక్కిపారేస్తూ పకపకనవ్వడం మొదలెట్టేరు. వెనక నుంచి మగవాళ్ళ కేకలుకూడా వినిపించేయి.

"గుడ్డలులాగెయ్యండి!"

"దిసమొలతో వదిలెయ్యండి!"

"రెండోబూటుకూడా లాగెయ్యండి!"

"మాస్టారేం కిందపడతోసి........"

వాళ్ళు ఆండ్రీరెండోబూటుకూడా లాగేసేరు. అతని కాలిపట్టీలు తీసేసి "కావలిస్తే ఇవికూడాతీసుగోండి! ఎవరేనా ముక్కుతుడుచుగునేందుకైనా ఉపయోగిస్తాయి!" అన్నాడు.

అంతవరకూ వెనక నిలబడిచూస్తూన్న కుర్రాళ్ళుకొంతమంది వేదిక వైపుకి తోసుగువచ్చేరు. వాళ్ళలో ఇఫీమ్‌ట్రిబేఖావ్ ఒకడు. తండ్రి అటు మానేజమెంటులో పనిచేసేడు. ఇతనుకూడా ఆరడుగులకితక్కువయుండడు. నీగ్రోవాళ్ళలా తుట్టపెదవులు. ఆడాళ్ళని వొత్తిగించుగుని వేదికమీదకి ఎక్కేడు.

"కాలికిచుట్టుగున్న గుడ్డపీలికలు ఎవడికీఅక్కర్లేదు." అన్నాడునవ్వుతూ "కాని ఆట్రౌజర్లుమాత్రం నువ్వుయివ్వకపోయినా లాక్కుంటాము."

"అవును. ట్రౌజర్లు చాలాఅవసరం! చాలామంది ట్రౌజర్లులేక ఎంతో చిక్కుపడుతూన్నారు. మొన్న భాగ్యవంతులదగ్గరనుంచి తీసుకున్నవి అందరికిసరిపోలేదు." అంటూ అతనికంటె కొంచెంకురచగాను వయస్సులో కూడా లేతగానూ కనిపిస్తూన్న ఇంకొకడు అందుకున్నాడు. ఆవాలకంచూస్తే శుద్ధగడేకారులా వున్నాడు.

ఉంగరాలుతిరిగి, సంస్కారంఏమీఎరగని రుప్పలాంటిజుట్టు కోసకు టోపీకిందనుంచి కనిపిస్తూంది. ఇతనిని "స్మోకీ" అనిమారుపేరుతో పిలుస్తూంటారు అందరూ. ఇతనితండ్రి జర్మనీయుద్ధములో చచ్చిపోయేడు; తల్లిటైఫాయిడ్ జ్వరంచేత చచ్చిపోయింది; అందుచేత చిన్నప్పటినుంచీ మేనత్తపోషణలోనే పెరిగేడు. జ్ఞానంవచ్చిందిమొదలు ఎక్కడఏదికనబడినా ఎత్తుకుపోవడమే అతనివృత్తి. పెద్దవాడయినతరువాత దొంగతనానికితోడు జారత్వంకూడ ప్రారంభించేడు. గ్రామంలో ఈడేరిన ఆడపిల్లలున్న ఏతల్లీకూడ ఇతనిని చూస్తే అసహ్యించుకోనిదిలేదు. అతడుకనక వీధులోనుంచి వెడుతూకనిపిస్తే చాలు "ఛీ. పోకిరీవెధవకి చిత్తకార్తికుక్కలా వీధులంట తిరగడమేపని అస్తమానూ." అనితిట్టుకుని కూతుళ్ళకేసితిరిగి "ఏమమ్మా, అంతదీక్షగా అలా చూస్తూన్నావెందుకు? ఏంపనివుందని, కిటికీదగ్గరనిల్చున్నావు? ఆఖరికియెప్పుడో మనమడిని తీసుకొస్తావులావుంది నాకు, పీకపిసికిఅవతలకుగిరవేస్తాను. ఏమనుకున్నావో! వెళ్ళి తట్టెడుపిడకలుఏరుకురా. పొయిలోకి ఏంలేవు. అలానిలబడకపోతే ఆవుదగ్గిర గడ్డివున్నదోలేదో ఓసారిచూడకూడదూ." అంటారు.

కాని స్మోకీమాత్రం చింకిరిబూట్లూఅతనూ, నిశ్శబ్దంగా అడుగులువేసుకుంటూ ఈలవేస్తూదొడ్డిగుమ్మాలకేసి, కిటికీలకేసి చూస్తూ వెళ్ళడంమాత్రం మానడు. ఎక్కడేనా ఆడపిల్లకనిపిస్తే ఊరికేఒదిలిపెట్టేవాడుకాదు. "ఫెక్టినా! కనుచీకటిపడగానే మీదొడ్డివెనక్కాలకివస్తాను. రాత్రి ఎక్కడపడుకుంటావు

నువ్వు?" "చాల్లే! ఎవరేనా చూస్తేనవ్విపోయేరు!" అని ఆపిల్ల అడావిడిగా వెళ్ళిపోయింది.

స్మోకీ చిరునవ్వుతో ఆమెవైపు చూస్తూ వెళ్ళిపోతాడు. సాయంకాలానికి నెమ్మదిగా కమ్యూనల్ గ్రేనరీదగ్గిరికిచేరి ప్రవాసం పంపబడ్డ అతని స్నేహితుడు టిమోఫీ అకార్డియన్ వాయించుకుంటూ కూర్చుంటాడు. చీకట్లునాలుగు మూలలాకమ్మి గ్రామం కొంచెం సద్దుమణుగుతూంది అనగానే నిర్భీతిగా పక్కసందులపడి ఫెక్టినాదొడ్డివెనకకి చేరుకుంటాడు.

పైగుణాలేకాక తాగుడుఅలవాట్లు రౌడీతనముకూడా ఉంది అతనికి. ఎక్కడదొమ్మీలాటజరిగినా అతడు వుండకుండావుండడు. మొదటదూరంగా చూస్తూ నిలబడతాడు. కాని, చివరకి లోపలినుంచి తన్నుకువస్తూన్న ఉద్రేకం ఆపుకోలేక అతడుకూడా కలియబడతాడు. 20 సం॥లు వచ్చేటప్పటికి ఎలాగయితేం అతడు ఒకఅరడజనుపండ్లవరకు ఊడగొట్టించుకున్నాడు. అనవసరంగా ఇతరులదెబ్బలాటలలో కలగచేసుకుంటేనేమి, ప్రణయసంబంధాలలోనైతేనేమి, అనేకసార్లు గావుదెబ్బలుతిన్నాడు. మళ్ళీకోలుకునేవరకు నెలరోజులపాటు ఇంట్లోనే పడివుండి, మళ్ళీయధాప్రకారంగా ఈలలువేసుకుంటూ తిరుగుతూంటాడు.

అతనులేని విషయమేవుండదు. యంగ్ కమ్యూనిస్టులీగులోనుంచి తొలగించబడి, ఇళ్ళు, గడ్డివాములు మొదలైనవి అంటించినందులకు శిక్షించబడ్డాడు. ప్రతీవాళ్ళతోనూ నిర్హేతుకంగా పేచీలకి దిగినందుకు రజ్మట్నోవ్ అతనిని అనేకసార్లు సోవియట్ షెడ్డులలోపెట్టి—ఆరాత్రిమట్టుకు తాళంవేస్తూవచ్చేడు. అందుచేత రజ్మట్నోవ్ అంటే స్మోకీకి తీరనిద్వేషం. అందుచేత ఇప్పుడు ఆకసితీర్చుగోడానికి వేదికఎక్కేడు.

క్రమంగా దోవచేసుకుని అండ్రీదగ్గిరకి వెళ్ళేడు. కాళ్ళువణకసాగాయి.

అక్రౌజన్లు మనకు అవసరమవుతాయి; చూస్తూ అలానిలబడతారేం—విప్పేద్దాం రండి!" అన్నాడు.

జనంవొత్తిడికి వేదిక దడదడలాడింది. అంతా ఆండ్రీ చుట్టూమూగి అతనుఎటువెళ్ళడానికి వీలులేకుండాచేసేరు.

"నేను సోవియట్ ఛైర్‌మన్‌ను. నన్ను చేసే ఈఅవమానంఅంతా సోవియట్ ప్రభుత్వానికి చేస్తున్నారన్నమాట. జాగ్రత్త తప్పుకోండి! మిమ్మల్ని ధాన్యంమాత్రం పట్టుకువెళ్ళనివ్వను. ఇంతటితో మీటింగుమూసేసేను. వెళ్ళిపోండి మీరంతా." అన్నాడు ఆండ్రీ పెద్దగొంతుకతో.

"నువ్వుఇచ్చేది ఏమిటి, మేమేతీసుకుంటాము."

"ఓహోహో! మీటింగుమూసేసేడుట!"

"అయితే మనంమళ్ళీతెరుద్దాం!"

"డేవిడోవ్‌పని పడితేకాని లాభంలేదు. రండర్రా!"

"రండి! ఆఫీసుకి వెడదాం రండి!"

"ముందు రజ్మిట్నోవ్‌ని ఖైదుచెయ్యండి!"

"ఓ దరువు పట్టక చూస్తారేం, కుర్రాళ్ళు!"

"ఇంకా వెర్రిముఖాలేసుకు నిలబడతారేం?"

"స్టాలిన్‌కి వ్యతిరేకుడు వీడు!"

"ఖైదులో పారెయ్యండి!"

ఒకఆమె టేబులుమీదపరిచియున్న గుడ్డలాగి, వెనకవైపునుంచి రజ్మిట్నోవ్ ముఖంమీద ముసుగువేసింది. దుమ్ముతోనిండియున్న ఆగుడ్డతీసిపారెయ్యడానికి అతడు పెనుగులాడుతూంటే, స్మోక్కీవచ్చి పొట్టలో ఒక్కపోటు పొడిచేడు. ఆండ్రీ బాధచేత ఒగరుస్తూ ప్రాణరక్షణకోసం జేబులోనిపిస్టలు పైకిలాగేడు. ఆడవాళ్ళంతా హాహాకారాలు చేస్తూపరుగెత్తేరు. కాని స్మోక్కీ మరిముగ్గురుకోసక్కులూ కలిసి అతనిచేతులోని పిస్టలు ఊడలాక్కున్నారు.

"అరివెధవ! పిస్టలుతో కాల్చిపారేద్దంఅనే!" అంటూ ఒకకోసక్కు గుళ్ళులేని పట్టిపిస్టలు పైకియెత్తుతూ అన్నాడు.........

గాదులదగ్గరనుంచి సముద్రప్రహోరులా పెద్దగోల వినిపిస్తూంది. డేవిడోవ్ గమనవేగంతగ్గించి నిలబడ్డాడు. ఆగోలనంతను మించి ఒకస్త్రీ

ఆర్తనాదం చెవులలో గింగురుమంది.

"గాదులుబద్దలకొట్టి ధాన్యం పట్టుకుపోతారేమో, రెండోబ్రిగేడు కోసం కభురుపంపేస్తేనయం, ఎందుకైనామంచిది." అనుకున్నాడు డేవిడోవ్ గాదులతాళంచెవులు దాచడానికై, తిరిగిఆఫీసుకిపోవడానికి నిశ్చయంచేసుకున్నాడు. అక్కడికి వెళ్ళేటప్పటికి గేటుదగ్గిర డెమ్కావుషాకోవ్ ఆందోళనతో నిలబడివున్నాడు.

"కామ్రేడ్ డేవిడోవ్, తాళంచెవులకోసం నన్ను వెతుక్కుంటూ వస్తారుఇప్పుడు. ఎక్కడికోపోయి దాంకుంటాను." అన్నాడు.

"సరే నీయిష్టం. నైడియనోవు ఇక్కడవున్నాడా?"

"లేడు. రెండోబ్రిగేడులో వెళ్ళేడు."

"రెండోబ్రిగేడు వాళ్ళూ ఎవరూలేరూ ఇక్కడ?"

"కోండ్రాట్ మైడనికోవ్ ఉన్నాడు."

"ఏడీ? ఏంచేస్తున్నాడు?"

"విత్తనాలు పట్టుకువెళ్ళడానికి వచ్చేడు. అడుగో!"

మైడనికోవ్ హడావిడిగా పరుగెత్తుకుంటూ వాళ్ళకేసివచ్చి "ప్రజలంతా ఆండ్రీరజ్మట్నోవుని పట్టుకుని కొట్టులోపెట్టి, గాదులదగ్గిరకి వెడుతున్నారు. కామ్రేడ్ డేవిడోవు ఎక్కడేనాదాంకోండి, లేకపోతే హానికలుగవచ్చు..............జనంఅంతా వెర్రెత్తినట్లు ఉన్నారు." అన్నాడు ఆతురతతో.

"నేనుమాత్రందాంకోను. మరిపోయిందాఏమిటినీకు? ఈ తాళంచెవులు తీసుకో. వెంటనే బ్రిగేడుదగ్గిరికివెళ్ళి లుబిష్కిన్‌తో, 15 మందిని గుర్రాల మీద అర్జంటుగా రమ్మన్నానని చెప్పు. పరిస్థితులు ఎంతవిషమంగావున్నాయో నువ్వుచూడలేదూ నేవు. దేనిమీదవచ్చేవు నువ్వు?"

"బండిమీద."

"అయితే ఒకగుర్రాన్నివిప్పి, దానిమీదవెళ్ళు. జనాన్ని ఇక్కడవున్నట్లుగా పంపించాలి."

"ఇప్పుడు ఒచ్చేత్యానా!" మైదనికోవ్ తాళంచెవులు జేబులోవేసు కుని పక్కసందంపట పరుగెత్తేడు.

దేవిడోవు నెమ్మదిగా గాదులదగ్గిరికి వెళ్ళేడు. అతనురాగానే అంతా సద్దుమణిగి చూస్తూనిలబడ్డారు. "అడుగో ఒస్తున్నాడు!" అంది ఒకామె. వేలెత్తిచూపిస్తూ, ఆవేశంతో.

కాని అతడు నదురుబెదురు లేకుండా వాళ్ళఅందరికి కనబడేటట్లు ఎద రికివచ్చి నిలబడి, గాలివాలుకుతిరిగి, అగ్గిపుల్లగీసి సిగరెట్టు ముట్టించేడు.

"సిగరెట్టు తరువాత కాలుద్దువుగానిలే—రా! రా!"

"ఇక్కడకాదు పైలోకంలో కాలుద్దువుగాని!"

"తాళంచెవులు కూడా తెస్తున్నావా, లేదా!"

„సాధారణంగా లేకుండారాదు."

పొగ చుట్టలుచుట్టలుగా వొదులుతూ జేబులలో చేతులుపెట్టుగుని తాపీగా జనందగ్గరగా వచ్చేడు. అతనిగుండె దిటవుఏదోవిధంగా ప్రజలమీద పనిచెయ్యకపోలేదు. వెనక ఆసరాలేకపోతే ఇంతధైర్యంగా రాడని కొంతమంది అనుకున్నారు. వర్షంకురిసినట్లు ప్రశ్నలుకురిసేయి.

"తాళంచెవులు ఇచ్చెయ్యి."

"అంతా కట్టకట్టుకు తగులడండి! ఎవడురమ్మన్నాడు మిమ్మల్ని ఇక్కడికి!"

"మావిత్తనాలు మాకుఇచ్చెయ్యి!"

"మేము వ్యవసాయముచేసుగోకుండా అడ్డురావడానికి నువ్వెవడవు!"

ఉత్తరాన్నుంచి వీస్తూన్న పిల్లగాలులకి ఆడవాళ్ళు నెత్తికిచుట్టగున్న రుమాళ్ళకొసలు ఎగురుతూన్నాయి. గాదులపైనవేసిన రేకులకరిలు పైకి లేస్తూన్నాయి.

"ఏమిటి ఈబాడావిడంతా? సోవియట్ ప్రభుత్వపు ఆజ్ఞలు నెరవేర్చక పోవడానికి కారణంఏమిటి? యూర్పీ సమిష్ఠి వ్యవసాయక్షేత్రానికిధాన్యం పట్టుగువెళ్ళకుండా అడ్డగించేరందుచేత? దీనికోసమూ, వసంతఋతువుచల్లికలు

జరగకుండా చేసినందుకూ మీరు కోర్టులో సమాధానం చెప్పవలసివుంటుందని తెలియదూ! సోవియటు ప్రభుత్వం ఇటువంటిపనులుచేసే వాళ్ళని ఎన్నడూ క్షమించదు."

"ఇంకా సోవియటుప్రభుత్వం ఎక్కడ? అయిపోయింది దానిపని." అన్నాడు ఒకరైతు. పొట్టిగా, కుంటికాలూఅతనూ.

ఎవరోనవ్వేరు. చేనిక్ ఎదటికి వచ్చినిలబడ్డాడు.

"ఇప్పుడుమీరు చేస్తూన్న పనులుఏమీ సోవియటుప్రభుత్వం చెయ్యమన లేదు. నువ్వు, మకార్ నగుల్నోవ్ ప్రారంభించిన ఈసోవియటుప్రభుత్వానికి మేములొంగివుండం. రైతుల్ని భూములుదున్నకోనివ్వకపోవడం న్యాయమేనా! పార్టీపేరుచెప్పి మీయిష్టంవచ్చినట్లు ప్రవర్తించడం కాకపోతే ఏమిటిది!"

"అయితే మిమ్మల్ని చల్లికలు చల్లుకోనివ్వకుండా అడ్డుపెట్టేమా మేము!" అని అడిగేడు దేవిడోవ్.

"అవును, లేదా!"

"సీవిత్తనాలు ఉమ్మడికొట్లులో జాగ్రత్త పెట్టడానికి ఇచ్చేవా!"

"ఆ—ఇచ్చేను."

"వాటిని మళ్ళీమీకిచ్చేసేరా!"

"ఇచ్చేసేరు, అయితే ఏమిటి!"

"అయితే నువ్వుచల్లుకోకుండా అడ్డుపెట్టినవారెవరు! అసలు ఇక్కడికి ఎందుకువచ్చేవు నువ్వు!"

ఏమిచెప్పడానికీతోచక చేనిక్ కొంచెంతత్తరపడ్డాడు, "ఇప్పుడు నేను తంటాలుబడుతూంట సమిష్టివ్యవసాయక్షేత్ర సభ్యత్వానికి రాజీనామాయిచ్చి, వాళ్ళదూడలు, ధాన్యం తిరిగి పొందనివాళ్ళకుకాని నాకోసం కాదు. అదీకాకుండా, నాకుఇచ్చినభూమి ఎల్లాంటిది? ఊరికిదగ్గరగా ఉన్న భూమిలాక్కొని, ఎక్కడో దూరంగావున్న భూమి ఎందుకుయిచ్చేరు!"

"కొంటనేఇక్కడినుంచిఅవతలకిపో!" దేవిడోవ్ కి కోపంఆగిందికాదు.

"నీతో తరవాత మాట్లాడుతాలే! సమిష్టివ్యవసాయ క్షేత్రవిషయాలలో నువ్వు అట్టేజోక్యం కలగచేసుకోకు, లేకపోతే మాటదక్కదు. జాగ్రత్త! దీనికంతకీ మూలకారకుడవు నువ్వే! అవతలకి పొమ్మని చెబుతూన్నాను, మళ్ళీ రెండోసారి!"

సణుక్కుంటూ దేవిడోవ్ వెనక్కి తప్పుకున్నాడు. కాని, ఇంతలో ఆడాళ్ళు వచ్చి అతని స్థానం ఆక్రమించేరు. దేవిడోవ్ మాట వినపడకుండా గట్టిగా అరవటం మొదలెట్టేరు. అతడు ఎలాగైనా లుబిష్కిన్ వచ్చేవరకు కాలంగడుపుదాం అని చూసేడు. కాని, ఆడాళ్ళు చెవులుబద్దలయేటట్లు గోలపెడుతూ, అతన్ని చుట్టుముట్టేరు. కోసక్కులంతా వెనక మాట్లాడకుండా నిలబడి చూస్తూన్నారు.

దేవిడోవ్ చుట్టూ కలయచూసేటప్పటికి మెరీనా పొయార్కోవా కనబడింది అతనికి. ఆమె బుజాలుకట్టుకు నిలబడి కొంతమంది ఆడవాళ్ళతో ఉద్రేకంగా మాట్లాడుతూంది. కనుబొమలు ముడిపడ్డాయి. ఆపక్కనే డైమిడ్‌తో గుసగుసలాడుతూన్న యాకోవ్ లూకిచ్ కనపడ్డాడు.

"తాళంచెవులు ఇచ్చెయ్యి! నీమంచికోసమే చెబుతూన్నాం, విను." ఒకామె దేవిడోవ్ జబ్బ పట్టుకుని, బ్రీజరు జేబులో చెయ్యిపెట్టింది తాళాలకోసం.

దేవిడోవు ఆమెను ఒక్కతోపు తోసేటప్పటికి, వెనక్కి వెల్లకితలా పడిపోయి, "అయ్యో. వీడి అమ్మకడుపుమాడా, చంపేసేడు! చూస్తూ ఊరుకుంటారేం!" అంటూ గోలపెట్టింది.

"ఏమిటది!" అన్నారు వెనకనుంచి ఎవరో, కంపితస్వరంతో తీవ్రంగా. "కొట్టడం కూడానా! సరే అయితే, ఏమాత్రం కాస్తాడో అదీ చూద్దాం నడవండి!"

పడిపోయిన ఆమెను లేవతియ్యడానికి దేవిడోవ్ వంగబోతూన్నాడు. ఇంతలో ఎవరో అతని నెత్తిమీద టోపీ ఎగరకొట్టేరు. గబగబా అయిదారు దెబ్బలు నెత్తిమీద, ముఖంమీద పడ్డాయి. వాళ్ళు అతని చేతులు రెండూ గట్టిగా పట్టుకున్నారు. జబ్బలు రెండూ విదల్చుకొని, అతను కొట్టడానికి

వస్తూన్న వాళ్ళని గెంటివేసేసేడు. కాని వాళ్ళు గొల్లుమని గోలపెడుతూ మళ్ళీ అతనిమీదపడి పట్టుబిగించేసేరు. జేబులు రెండూ వెతికేరు కాని ఏమీ కనిపించలేదు.

"దగ్గరలేవు తాళంచెవులు!"

"ఎక్కడదాచేవు?"

"ఇచ్చెయ్యి! లేకపోతే తాళాలుబద్దలుకొడతాం."

హద్దు-పద్దులేకుండా ఊడతిడుతూ మిషా-ఇగ్నటియోవిక్ తల్లి దేవిడోవుదగ్గిరికి తోసుకువచ్చి, అతనిముఖంమీద ఉమ్మేసింది.

"దేవుడులేడనే నీవంటినాస్తికవెధవలకి చేసేగౌరవం ఇదే!"

దేవిడోవ్ నిగ్రహించలేపోయేడు. వాళ్ళచేతులలోనుంచి విడిపించుకోవడానికి, శక్తినంతినూ ఉపయోగించి ఆఖరిప్రయత్నంచేసేడు. కాని ఏమీలాభంలేకపోయింది. కొంతమందికోసక్కులు ఆడవాళ్ళకి సహాయంగావచ్చి, రెండు జబ్బలూవిరిచి వెనక్కి పట్టుకున్నారు. అందుచేత విడిపించుకునే ప్రయత్నం వదులుకున్నాడు. అక్కడవున్నవాళ్ళెవరూ తనసహాయానికిరారని తెలుసుకుని కొత్తపంథా అవలంబించాలనుకున్నాడు.

"గాదులతాళంచెవులు నాదగ్గరలేవు. అవి.........."అని మధ్యలో ఆగేడు: వాటిని తనదగ్గిర ఉంచుకోలేదని చెబుదం అనుకున్నాడు. కానిమళ్ళీ అలాచెప్పినట్లయితే వాళ్ళంతా డెమ్కా-ఉషాకోవ్ కోసం పరుగెత్తి పట్టుకుంటారని తోచింది. డెమ్కాకనక దొరికినట్లయితే చంపెయ్యడానికికూడా వెనుతియ్యరు. "వాటిని ఇంట్లోపెట్టేనని చెప్పి, అక్కడవెతుకుతూ కాలక్షేపం చేస్తారు. కొంతసేపయేక, కనిపించలేదని చావుకబురు చల్లగాచెబుతాను. సాధారణంగా నన్ను చంపేటంత సాహసంచెయ్యరు. ఈలోపుగా లుబిష్కిన్ రానేరావచ్చు. వీళ్ళనితగలెయ్యా వీళ్ళరోగం అలాకుదర్చాలి!" అనుకున్నాడు. నిశ్శబ్దంగా, నుదుటిమీదనుంచి కారుతూన్న రక్తం జబ్బతో తుడుచుకుని, "తాళంచెవులు నాబసలోఉన్నాయి, కాని మీకుమాత్రంయివ్వను. ఇంక తాళాలుబద్దలుకొడతా మంటారా, తమ వాతవానికి ఫలితం

అనుభవిద్దురు గాని." అన్నాడు.

"మీ ఇంటికి తీసుకువెళ్ళు. తిరిగి మేమే తీసుకుంటాము." అంది ఇగ్న టిమోనక్కతల్లి. ఆమె ఆందోళనకి ముడతలుపడి వేళ్ళాడుతూన్న దవడలు, ముక్కుమీది ఉలిపిరికాయ ఊగిసలాడేయి. చెమటప్రవాహం కట్టి కారుతూంది. ఆమె దేవిడోవ్‌ని గెంటుతూంటే, అతను ఇష్టంలేనట్టుగా నటిస్తూ నెమ్మదిగా అతని ఇంటికేసి నడవడం ప్రారంభించేడు.

"నిజంగా అక్కడ తాళంచెవులు ఉన్నాయా? మరిచిపోయేవేమో జ్ఞాపకం చేసుకో." అంది బేనిక్ భార్య అన్దోకియా.

"జ్ఞాపకం వుంది; అక్కడే పెట్టేను." అని అతి ఉత్సాహంగా అని చిరునవ్వు వాళ్ళకు కనిపించకుండా తలవంచుకున్నాడు.

నలుగురు అతని జబ్బ పట్టుకున్నారు. ఒక ఆమె దృఢమైన కర్ర చేతపుచ్చుకుని వెనక వస్తూంది. అతనికుడివైపున ఇగ్నటిమోనక్ తల్లి మొగాళ్ళా నడుస్తూ వస్తూంది. ఎడమవైపున మిగిలిన ఆడాళ్ళంతా కేరింతాలుకొడుతూ, మాట్లాడుకుంటూ గుంపులుగుంపులుగా బయలుదేరేరు. కోసక్కులంతా అక్కడే నిలబడ్డారు తాళంచెవులకోసం.

"చేతులు ఒదిలెయ్యండి; ఎక్కడికీ పారిపోను మరేం భయంలేదు." అని అడిగేడు డేవిడోవ్.

"నువ్వు పారిపోతేమాత్రం ఏమిటి చేసేది."

"అబ్బే— ఎక్కడికీ పారిపోను."

"కూడా వస్తే ఏ బాధా వుండదు మాట్లాడక రద్దూ!"

వాళ్ళంతా అతని ఇంటికి వెళ్ళేరు; వీధి గేటు తోసుకుని లోపలికి జొరబడ్డారు అంతా.

"లోపలికి వెళ్ళి తాళంచెవులు తిరిగి తీసుకురా. తీసుకురాకపోయేవంటే మాత్రం మాటదక్కదు; కోసక్కుల్ని పిలిపించి రెక్కలు విరిచి కట్టిపాడిస్తాను జాగ్రత్త!"

"పోనియటుప్రభుత్వం సంగతి మరిచిపోయేరులావుంది అప్పుడే! కాని

అదిమిమ్మల్ని త్వరగామరిచిపోదు ఈపనికి."

"చావుఅంటూ ఎన్నిమాట్లువుండేమిటి, ఎప్పుడోఒకప్పుడు చస్తాము. ఈఏడు ఇంతవరకూ వ్యవసాయంఏమీలేదు ముందులో తిండిలేకచస్తేం, ఇప్పుడుచస్తేం. ఈపాటికి వెళ్ళి అవిపట్టుకురా ఆక్టేకభుర్లుచెప్పక."

డేవిడోవ్ గదిలోకివెళ్ళేడు. బయటనుంచి వాళ్ళంతా చూస్తూండడం చేత వెతుకుతున్నట్లు నటించసాగేడు. మాట్కేసులోనివి టేబులుమీదివి అన్నీ తిరగబోర్లావేసి వెతిగేడు. కాగితాలన్నీ చిందరవందరగా పడేసేడు. మంచంకింద దూరికూడా వెతిగేడు.

కొంతసేపటికి బయటికివచ్చి "తాళంచెవులు దొరకలేదు."అన్నాడు.

"అయితే ఏమయేయి?"

"నగుల్నోవు తీసుకువెళ్ళేడేమో అనుకుంటాను......" అన్నాడు.

"అతను ఊరికివెళ్ళేడుగావుంది."

"వెడితేమాత్రం! వెళ్ళేటప్పుడు తాళంచెవులుఇంటివగ్గిరపడేసే వెళ్ళి వుంటాడు. రెంజోబ్రిగేడుకి విత్తనాలుకూడా ఇయ్యవలసివుంది ఈవేళ. తాళంచెవులు తప్పకుండా ఇచ్చిమరీవెడతాడు ఏమీసందేహంలేదు."

అక్కడినుంచి వాళ్ళు డేవిడోవ్ని నగుల్నోవ్ ఇంటికి తీసుకువెళ్ళేరు. దోవలోఅతన్ని కొట్టడంమొదలెట్టేరు. మొదట తిట్టడంతో సరిపెట్టేరుకాని అతను నవ్వుతూ వేళాకోళంచెయ్యడంమొదలెట్టేటప్పడికి వాళ్ళకిఒళ్ళుమండి కొట్టసాగేరు.

"చేతులతో కొట్టడంచాలక పైగా కర్రతోకూడా కొడతారేం!" అంటూ లేనినవ్వు తెచ్చిపెట్టుకున్నాడు. కాని వాళ్ళు నిర్దాక్షిణ్యంగా చావకొట్టేరు. అన్ని దెబ్బలుతింటున్నా వేళాకోళాలు నవ్వులుమాత్రం మానలేదు.

"మీరు ఇన్నిదెబ్బలుకొట్టేరుకదా మరి వాటికి నేను బదులు తీర్చగొద్దూ!"

"ఆరి— నీమొహంమండా, నీది నూకరాయికాని ఒళ్ళుకాదురా!" అంది నస్తియాడొనిట్స్కోవా రెండుచేతులా డేవిడోవ్పుసడ్డిమీద కొడుతూ.

నాచేతులు నెప్పెట్టాయి కాని వాడికి చీమకుట్టినట్లు కూడా లేదు........"
ముక్కులోనుంచి రక్తం కారుతూంది. పెదవులు బద్దలయేయి. మెలి
తిప్పడంచేత చెవులు కందిపోయి ఎర్రగావున్నాయి. అయినా కాని
అతడు తొప్పిపన్ను బయటపడేటట్లు నవ్వుతూ బాగా కొట్టేవాళ్ళని నెమ్మ
దిగా పక్కకి గెంటేసేడు. వాళ్ళ అందరిలోను ఇగ్నటియానవ్ తల్లి పళ్ళు
కొరుకుతూ విధీవిరామం లేకుండా కొడుతూంది. ఒళ్ళు బాగా నొచ్చడానికి
పిడికిలి బిగించి ముడుసులతో ముక్కుమీద, కణతలమీదా కొట్టింది. అడ్డం
వున్నవాళ్ళని పక్కకితోసి, ఒగరుస్తూ అతనిముందరికి వెళ్ళి "ఎంతసేపు
వోర్చుగుంటాడోచూద్దాం, మీరంతా పక్కకి తప్పుగోండి. చెబుతాను"అంది.

"తొందరపడకు, రాక్షసిముండా! నీపని చెబుతాను, లుబిష్కిన్
రానీ!" అనుకుంటూ ఆమెదెబ్బలు తగలకుండా పక్కకి తొలగిపోయేడు.

ఎంతసేపు చూసినా లుబిష్కిన్ జాడ కనబడలేదు. ఇంతలో వాళ్లు
దేవిడోవ్‌ని నగుల్నోవ్ ఇంటికి లాక్కుపోయేరు. ఈసారి ఆడవాళ్ళు
దేవిడోవ్‌తో కూడా లోపలికివెళ్ళేరు. పుస్తకాలు, కాగితాలు, బట్టలూ అన్నీ
చిందరవందరగా పారేసి గది అంతా గాలించేసేరు. ఆ ఇంటివాళ్ళు ఉన్న
భాగంకూడ పూర్తిగా వెతిగేరుకాని తాళంచెవులు ఎక్కడా కనబడలేదు.
అందుచేత వాళ్ళు దేవిడోవ్‌ని బయటికి లాక్కుపోయి "తాళంచెవులు
ఏంచేశావో చెబుతావా లేకపోతే చంపెయ్యమన్నావా!" అని మీదపడ్డారు.

"ఆస్త్రోవ్‌నావ్ దగ్గిరఉంటాయి." అని సమాధానం చేప్పేడు దేవి
డోవ్. గాదులదగ్గిరనవ్వుతూ నిలబడ్డ అవ్యవసాయక్షేత్రపు మేనేజరుముఖం
జ్ఞప్తికి తెచ్చుకుని;

"అంతా అబద్ధం! అతన్ని మేము యిదివరకే అడిగేము. నీ దగ్గిర
ఉంటాయని చెప్పేడు."

ఏదో జ్ఞప్తికి తెచ్చుగుంటూన్నట్లుగా బాగా వాచిపోయివున్న ముక్కు
తడుముకుంటూ చిరునవ్వు నవ్వేడు. "ఇంతసేపటినుంచి వృధాగా కొట్టేరు
నన్ను! ఆఫీసులో నా టేబులులో ఉన్నాయి తాళంచెవులు! ఇప్పుడు
జ్ఞాపకం వచ్చింది."

"ఆటకింద పట్టించేవు మమ్మల్ని!" అంది ఎకచెరి నాగుల్యాశ్చాయా.

"అక్కడికి తీసుకువెళ్ళండి : నిజమో అబద్ధమో మీకే తెలుస్తుంది. కొట్టడం మాత్రం వద్దు. ఆ ఒక్క ఉపకారం మాత్రం చెయ్యండి." దెవిడోవ్ వీధిలోకి దోవతీసేడు. అతనికి నోరు ఇగిరిపోయింది; ప్రతిష్ఠ కోసం అని ఎల్లాగో నిలబడివున్నాడు. దెబ్బలుతినడానికి యిదే మొదటి సారి కాదుకాని ఇంతవరకు ఆడవాళ్ళచేత యెప్పుడూ దెబ్బలు తినివుండని వాడవడంచేత, మనస్సు మనస్సులోలేదు. "ఏమైనాసరే లొంగుబాటు చూపించకూడదు. లేకపోతే ఇంకా వెర్రెత్తి ఆఖరికి చంపేస్తారుకూడాను! ఆఖరికి నీచపుచావు చావనా!" అనుకుని ఆశాపూరిత దృష్టితో దూరాన్న నీలిగా కనబడుతూన్న గుట్టలవరసకేసి చూడసాగేడు. కాని యెక్కడా గుర్రపురౌతుల జాడకాని, గుర్రపుడెక్కల ధూళికాని కనబడలేదు. ఆ ప్రాంతంలో కంటికి ఆనినంతవరకు యెక్కడా మనుష్యసంచారంలేదు. వీధులుకూడా అల్లాగే వున్నాయి. గ్రామంలో ఆబాలగోపాలం గాదులదగ్గర చేరారు.

ఆఫీసుదగ్గరకి వచ్చేటప్పటికి, వాళ్ళు కొట్టేదెబ్బలకి దేవిడోవ్ ఇంక నిలబడలేకపోయేడు. పరిహాసంగా మాట్లాడడం మానేశాడు. తల రెండు చేతులా పట్టుకుని, తరచుగా తూలిపడిపోతూ, "చాలు! వృధాగా ఎందుకు కొట్టిచంపుతారు! తాళంచెవులు నాదగ్గిరలేవు! తలమీదమాత్రం కొట్టకండి. సాయంత్రంవరకు కొట్టినాసరే పడతానుకాని నాదగ్గిరమాత్రం తాళంచెవులు లేవు!"

"సాయంత్రంవరకూ కొట్టినా పడతావేం?" అంటూ అంతా మళ్ళీ దేవిడోవ్‌మీద పడి, కొట్టి, తన్ని, పీకి, నానాహింసాపెట్టారు.

ఆఫీసు ఆవరణకి యెదురుకుండా రోడ్డుమీద చతికిలపడ్డాడు దేవిడోవ్. అతని కేన్వాసుషర్టు అంతా రక్తంతో తడిసిపోయింది. మోకాళ్ళ వరకూ మాత్రం ఉన్న టౌజర్లు చిరిగిపోయాయి; పేలికలు అయిపోయిన షర్టులోనుంచి గుండెలు, నడ్డి, బాగా కనబడుతున్నాయి. దీర్ఘ విశ్వాసాలు వదుల్తూ, చూడడానికి జాలిగొలుపుతున్నాడు.

"ఛతిగిలపడ్డావేం లేవక!" అంటూ ఇగ్నటియోనవ్ తల్లి కాలితో తన్నింది.

"పిశాచంముండల్లాలా, మీకోసమే మేం పనిచేస్తూంట! అల్లాంటి వాణ్ణి నన్ను చంపుతూన్నారు!" అంటూ మెరుస్తూన్న కళ్ళతో వాళ్ళకేసి చూస్తూ శక్తికొలదీ గట్టిగా అర్చేడు. "తాళంచెవులు మీకు ఇవ్వను. తెలిసిందా? అర్చి చచ్చినాసరే ఇవ్వను! ఏం?"

"కోసక్కులు తాళాలు బద్దలుకొట్టి ధాన్యం పంచేస్తూన్నారు—త్వరగా రండి!" అని కేకేస్తూ ఒకఆమె పరుగెత్తుకు వచ్చింది.

వాళ్ళంతా దేవిదోవ్‌ని అక్కడే ఒదిలేసి, గాదులదగ్గిరికి పరుగెత్తేరు. దేవిడోవ్ ఒక్కసారిగా లేనిబలం తెచ్చుకుని లేచి విలబడి ఆఫీసు ఆవరణలోకివెళ్ళేడు. ఎండకి గోరువెచ్చబడ్డ బాల్చీ-నీళ్లూ వరండామీదికి తీసుకువెళ్లి కడుపుపట్టినన్ని నీళ్ళుతాగేశాడు. తరవాత ఆ నీళ్ళన్నీ నెత్తిమీద పోసుగున్నాడు. మూలుక్కుంటూ ముఖంమీద, మెడమీద నున్న రక్తం కడిగేసుకుని, ఆవరణ గోడమీద ఆరేసివున్న గుడ్డపెట్టి తుడుచుకుని కూర్చున్నాడు.

ఎక్కడా మనుష్యసంచారం లేదు. పెంటకుంప కెక్కరిస్తూ కోడిపెట్ట ఒకటి 'క్లక్, క్లక్' అంటూంది. స్టెప్పీమీద నుంచి 'మార్మొట్లు' చేసే కీచుధ్వని గాలివాన వాలుకి వినిపిస్తూంది. దూదిపింజల్లా చిన్న చిన్న మేఘాలు సూర్యుణ్ణి కప్పేసినప్పటికీ ఎండవేడిమి తీవ్రంగానే ఉంది. దొడ్డి అంతా 'బుర్రు'మని చప్పుడుజేస్తూ తిరుగుతూండే పిచ్చికలు చడీచప్పుడూ లేకుండా, తలలు జాపుకుని చూస్తూ పడుకొని, మధ్యమధ్య రెక్కలు అల్లారుస్తూ ఉన్నాయి.

గుర్రపుడెక్కల చప్పుడు వినపడి దేవిదోవ్ తలయెత్తి చూసేడు. జీనుతోనున్న గుర్రం ఒకటి పుల్‌గేలప్‌మీద గేటులోనుంచి పరుగెత్తుకు వచ్చింది. నోటంపట తెల్లటి నురగపిసళ్లు, కాలివున్న నేలమీద పడుతూంటే సకిలిస్తూ దొడ్డిచుట్టూ రెండు చక్కర్లుకొట్టి వచ్చి, తిన్నగా గుర్రపుసాల ఎదట ఆగి నేల మూచూడటం మొదలెట్టింది. కళ్ళెం నేల జీరాడు

